# మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ

## [ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసము]



మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ


రచయిత్రి :

వి. వి. రాఘవమ్మ



ప్రథమ ముద్రణ :

నవంబరు 1988

ప్రతులు 1000

వెల : రు. 25/-

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ ప్రెస్

విజయవాడ—2

ప్రతులకు :

సి. హెచ్. అన్నపూర్ణమ్మ

ఎస్. ఎన్. పి. అగ్రహారం

బాపట్ల —522 101.

302
1-89

# అంకితం

హృదినిండిన అనురాగంతో

మది నిండిన మమకారంతో

అనుపమాన గుణ సంపదతో

కని పెంచిన జననీ జనకులు

రుక్మిణమ్మ, వెంకట సుబ్బయ్యగార్లకు,

మరియు

విశేష శేముషీ విభవంతో

అశేష జనానీకాన్ని అలరిస్తున్నాడని

స్వర్గీయులు స్వాగతమిస్తే

అర్థాంతరంగా వీడ్కోలు అందుకున్న

నా అనుంగు సోదరుడు వెంకటనారాయణకు

అంకితమిస్తున్నా.



VINNAKOTA VENKATA NARAYANA

English Lecturer

Arts and Science College of

BAPATLA

# విద్యయా విందతేఽ మృతమ్

'చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న ఆ చదువు నిరర్థకంబు....' అని అంటాడు లోకజ్ఞుడైన ఒక కవి. చదువుల దారి వేరు, సంస్కారం తీరు వేరు. సుచరితుల చూపులో ఈ రెండు పరస్పరం పరిపోషకాలు. ఈ రెండింటికీ సరియైన సమన్వయం సాధించిన సిద్ధార్థులకృషి సమాజానకి శ్రేయో వర్ధనం. 'భద్రమిచ్ఛంతి సాధవః'

తెలుగు సాహిత్య చరిత్రలో కవయిత్రుల పాత్ర విస్మరించరానిది చాటువుల చాటున తొంగిచూచే ఖడ్గ తిక్కన తల్లి ప్రోలమ్మ, భార్య చానమ్మల పేర సంభావితమవుతున్న సాహితీ వరివస్యకు నికరమైన నిదర్శనాలు కానరావు. వట్టి ఊహలు చరిత్ర పరికల్పనలో ప్రమాణాలు కాజాలవు. ఇక తాళ్ళపాక తిమ్మక్క, కృష్ణరాయల తనయ మోహనాంగి [తిరుమలదేవి] మొదలైన వారి కవితా వ్యవసాయం వివాదాస్పదం.

అందుచేత తెలుగు కవయిత్రులలో ఆతుకూరి మొల్ల ఆద్య అని నిష్కర్షించవచ్చు. తెలుగు సాహిత్యోద్యానంలో రామాయణ కుసుమ పరిమళాలు గుబాళింపజేసిన విశిష్ట కవితా మల్లి కావల్లి మొల్ల. వాత్సల్య సౌశీల్య సౌలభ్యాది కళ్యాణ గుణాలు రూపెత్తిన పురుషోత్తముని ఇల్లాలు సీతమ్మ పాత్రను చిత్రించడంలో కవయిత్రి మొల్లమ్మ చూపిన మెలకువల పొలకువ ప్రస్తుత పరిశోధనాంశం.

దురూహాలూ, దుస్తర్కాలూ పరిశోధనా రంగంలో పనికిరావు. దురన్వయాలూ, దూరాన్వయాలూ సత్యావిష్కరణ ప్రయత్నానికి గుదిబండలు. 'కుతర్కాత్ నశ్యతే విద్యా' అని పెద్దల మాట. కుతర్కాల జోలికి పోకుండా, తర్క సహమైన రీతిలో సకలాంశాలను శ్రద్ధా భక్తి పురస్సరంగా వితర్కించి, ప్రమాణోపత్తి సంకలితంగా నిగ్గు తేల్చిన ఈ లఘు సిద్ధాంత వ్యాసం విద్వజ్జనుల మెప్పుదలను పొందగలదనీ, రచయిత్రి కుమారి రాఘవమ్మ ఇతోఽధిక సాహితీ పరిశ్రమకిది భూమిక కాగలదనీ మా నమ్మిక.


డాక్టర్ తూమాటి దోణప్ప

ఎం. ఏ. పి. హెచ్. డి; డి. లిట్.

కులపతి

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాద్-4.




# ఆముఖము

"మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ—" కుమారి పి. వి. రామవమ్మ లఘుసిద్ధాంత వ్యాసము సంతోషపరచిన చక్కని కూర్పు. ఆంధ్ర మహిళామణులలో మనోహరమైన కవిత్వము వ్రాయగలిగి గ్రంథరచన చేసిన కవయిత్రులలో మొల్ల పేరు మొట్ట మొదట వినగలుగుదుము. ఈమె తండ్రి ఆతుకూరి కేసనసెట్టి, గురులింగ జంగమార్చన పరుఁడు. శివభక్తుడు ఈమె కుమ్మరి వంగడమున జన్మించినదని జనశ్రుతి. శ్రీకంఠ మల్లేశుని వరముతో ఈమెకు తెలుఁగు కవిత్వము లభించినది. మల్లీశుని యనుగ్రహమున పుట్టువందిన దగుటచే ఈమె అసలు పేరు "మల్లమ్మ" యనియు మెల్ల మెల్లగ తెలుఁగు నోళ్ళలో "మొల్ల"గా పరిణమించిన దనియు చెప్పుకొందురు. మల్లేశుఁడు గోపవరపు వేల్పు. గోపవరము నెల్లూరి మండలములోనిది.

మొల్ల కాలమును గూర్చి భిన్నాభిప్రాయములున్నను, శ్రీనాథుని యుగాంతమునకు చెందినదని, పదునారవ శతాబ్ది యని నిశ్చితమైనది. కాలమున కేమి? తన రామాయణముతో మొల్ల ఎల్లకాలము నిలఁబడఁజాలిన కవయిత్రి. ఈమె తొలి పుట్టువులో ఎంతో సుకృతము చేసికొన్నది. తత్ఫలముగా శివానుగ్రహము కలిగినది రామభక్తి యేర్పడినది.

"పలికెడిది భాగవతమఁట, పలికించెడువాడు రామభద్రుండఁట!"-అను పోతనగారి పద్యము వంటిదే మొల్ల వ్రాసినది.

చెప్పుమని రామభద్రుఁడు
చెప్పించిన పల్కు మీఁదఁ జెప్పెద నేనే
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్రఁ దప్పు లెంచకుఁడెందున్.

అదికాక, మొల్ల తెలుఁగుకై తకు కొన్ని యెల్ల లేర్పరచినది. అతి గూఢ శబ్దములకు ఆమె యిష్టపడదు. అతి గూఢములనగా, నిఘంటువు చూచుకోవలసినవి కావచ్చును.

"తేనెసోక నోరు తియ్యన యగురీతి
తోడ నర్థమెల్లఁ దోఁపవలయునఁట!"

"గూఢ శబ్దములతో కొట్లాడుపని మూఁగ చెవిటివాని ముచ్చట యఁట!"
ఏదో పరాధీనయై వ్రాసికొని పోవుటకాక కవిత్వ మెట్లున్నచో విబు

ధులకు రుచించునో మొల్ల తెల్లము చేసినది. ఇది వరకే భాస్కర, రంగనాథాదులు రామాయణమును వ్రాసిరి. తాను మరల వ్రాయుటయేల? దీనికి మొల్ల యిట్లు సమాధానపడినది.

"భూజన కల్పకంబగుచు భుక్తికి ముక్తికిమూలమైనయారాజును దైవమైన రఘురామును తించినదప్పు కల్గునే!"

మరియొక చక్కని మాట: "రాముని పేరుతో రాచిలుకను పిల్చిన వెలయాలికే ముక్తి లభించగా, నేర్పుతో రాముని వినుతించిన వారికి ముక్తిరాదా!" అన్నది.

రామానుగ్రహము పొందుటకు భక్తి వలయునేకాని. చదువుకాదు.

నేరిచి పొగడిన వారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గా రణ మగుటకు భక్తియె
కారణ మగుఁగాని చదువుకారణమగునే!

ఓహో! ఈ యొక్క పద్యము చాలు మొల్ల హృదయమును గ్రహించుటకు. ఈమె కల్పనములు చాల సుకుమారములు. రసార్ద్రమైన పలుకుబడి. ధారాళమైన శైలి.

ప్రకృతము: మొల్ల రామాయణమును కూలంకషముగా పరిశీలనముచేసి, ఆమె కూర్పులకు. తీర్పులకు, మురిసి రాఘవమ్మగారు ఈ సిద్ధాంత వ్యాసమును సంతరించిన తీరు మెచ్చదగియున్నది. ఇందు— శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము. ఐతిహాసిక నాయిక సీత, సీత ఆభిజాత్యము, సీత సౌందర్య సమీక్ష, సీతాకల్యాణము సీత సంసారిక జీవనము అను ప్రకరణములున్నవి.

వాల్మీకములోని శ్లోకములు, మొల్ల పద్యములుచూసి పోలికలను పొందు పరచుటలో ఈ రచయిత్రి చేసిన కృషి సంతోష మొదవించినది. ఈ కూర్పునందలి వ్యాస రచన సుగమముగా, చెప్పదలచిన దానిని విశదము చేయుచూ మనస్సున కాహ్లాదము మొదవించు చున్నది.

కుమారి రాఘవమ్మ సాహిత్య రంగమున ముందు ముందు సాగించగల పరిశోధనాది కృషికి ఈ గ్రంథము నాందియగుగాతయని ఆశీర్వదించుచున్నాను

మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి
లలితా నగర్, రాజమండ్రి-5.

# అభినందనము

కుమారి వి. వి. రాఘవమ్మ M. A. (Lecturer in Telugu, St. Theresa's College, Eluru) గారు నాగార్జున విశ్వవిద్యాలయము వారికి ఎం.పిల్ కొరకు సమర్పించిన "మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ" అను లఘు సిద్ధాంత వ్యాసమును సాంతము చదివి సంతోషించితిని. దీనిలో నారు ప్రకరణములున్నవి. 1. శ్రీ మద్రామాయణ కావ్య ప్రాశస్త్యము- మొల్ల రామాయణ వైశిష్ట్యము 2. ఐతిహాసిక సీత 3. సీత అభిజాత్యము 4. సీత సౌందర్య సమీక్ష 5. సీతాకళ్యాణము 6. సీత సాంసారిక జీవనము అనునవి.

ప్రథమ ప్రకరణములో శ్రీమద్రామాయణ కావ్య ప్రాశస్త్యము, మొల్ల రామాయణ వైశిష్ట్యమును వివరించుట జరిగినది. గీర్వాణభాషలో మధురాక్షర సమన్వితమగు వాల్మీకి రామాయణ ప్రాశస్త్యమును గ్గడించిరి. భారతీయ సాహిత్యమునందేకాక విశ్వసాహిత్య వీధులలో కూడ వాల్మీకి రామాయణము మహేతిహాసముగా ఉజ్జ్వల ప్రశస్తిని బొందినది అది ఉత్తమాదర్శములకు, నుదాత్త దర్శనములకు ప్రతీకం ఉత్తరకాండతో కలిపి ఏడు కాండలలో 24000 శ్లోకములు కలది వాల్మీకి రామాయణము. మొల్ల తన రామాయణమును సంక్షిప్తీకరించి 800 పద్యములలో అనగా మూడవ వంతుకు తగ్గించి పరిసమాప్తి చేసినది. అట్లు చేయుటలో ఆమె శాంతాదేవి చరిత్ర, మందర వృత్తాంతము, శ్రావణ కుమారచరిత్ర, దశరథశాప కథనం, అహల్యాశాప వృత్తాంతం, రామాదుల జనన కాల నక్షత్రముల మార్పు, మిథిలలో సీతాదేవి బాల్య క్రీడలు, వివాహమైన తరువాత సీత అయోధ్యలో గడిపిన సాంసారిక జీవనము మొదలగునవి పరిహరించినది. అడవిలో చెంచెతలు సీతపొందు మార్గాయాసమును చూచి జాలిపడుట, శ్రీరాముడు సీత కోరికపై బంగారు లేడి చర్మము నొలిచి కానుకగా దెచ్చినట్లు, రావణుని పాతాళహోమము సంగతి, కాలనేమి వృత్తాంతము వంటి అవాల్మీకములగు విషయములను తన కావ్యములో చొప్పించెను.

రామాయణము మన దేశములోని వివిధ భాషలలో ననువదింపబడుటయే పాశ్చాత్య దేశములలో కూడ ప్రాశస్త్యమును సంతరించుకొన్నది. తెలుగు భాషలోనే కూడ ప్రాశస్త్యమును సంతరించుకొన్నది. తెలుగు భాషలోనే పెక్కురు రచయితలు పద్య, గేయ, నాటక రూపములలో రచించియున్నారు. సంస్కృతములో కాళిదాసు, భాసుడు, మురారి మొదలగు ప్రముఖ కవులు రచనలుచేసి యున్నారు. రఘువంశము, భాసనాటకములు, అనర్ఘరాఘవము మున్నగునవి.

# విద్యయా విందతేఽ మృతమ్

'చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న ఆ చదువు నిరర్థకంబు....' అని అంటాడు లోకజ్ఞుడైన ఒక కవి. చదువుల దారి వేరు, సంస్కారం తీరు వేరు. సుచరితుల చూపులో ఈ రెండు పరస్పరం పరిపోషకాలు. ఈ రెండింటికీ సరిసమైన సమన్వయం సాధించిన సిద్ధార్థులకృషి సమాజానికి శ్రేయో వర్ధనం. 'భద్రమిచ్ఛంతి సాధవః'

తెలుగు సాహిత్య చరిత్రలో కవయిత్రుల పాత్ర విస్మరించరానిది చాటువుల చాటున తొంగిచూచే ఖడ్గ తిక్కన తల్లి ప్రోలమ్మ, భార్య చానమ్మల పేర సంభావితమవుతున్న సాహితీ పరివస్యకు నికరమైన నిదర్శనాలు కానరావు. పట్టి ఊహలు చరిత్ర పరికల్పనలో ప్రమాణాలు కాజాలవు. ఇక తాళ్ళపాక తిమ్మక్క, కృష్ణరాయల తనయ మోహనాంగి [తిరుమలదేవి] మొదలైన వారి కవితా వ్యవసాయం వివాదాస్పదం.

అందుచేత తెలుగు కవయిత్రులలో ఆతుకూరి మొల్ల ఆద్య అని నిష్కర్షించవచ్చు. తెలుగు సాహిత్యోద్యానంలో రామాయణ కుసుమ పరిమళాలు గుబాళింపజేసిన విశిష్ట కవితా మల్లి కావల్లి మొల్ల. వాత్సల్య సౌశీల్య సౌలభ్యాది కళ్యాణ గుణాలు రూపెత్తిన పురుషోత్తముని ఇల్లాలు సీతమ్మ పాత్రను చిత్రించడంలో కవయిత్రి మొల్లమ్మ చూపిన మెలకువం పొంకువ ప్రస్తుత పరిశోధనాంశం.

దురూహలూ, దుస్తర్కాలూ పరిశోధనా రంగంలో పనికిరావు. దురన్వయాలూ, దూరాన్వయాలూ సత్యావిష్కరణ ప్రయత్నానికి గుదిబండలు. 'కుతర్కాత్ నశ్యతే విద్యా' అని పెద్దల మాట. కుతర్కాల జోలికి పోకుండా, తర్క సహమైన రీతిలో సకలాంశాలను శ్రద్ధా భక్తి పురస్సరంగా వితర్కించి, ప్రమాణోపపత్తి సంకలితంగా నిగ్గు తేల్చిన ఈ లఘు సిద్ధాంత వ్యాసం విద్వజ్జనుల మెప్పుదలను పొందగలదనీ, రచయిత్రి కుమారి రాఘవమ్మ ఇతోఽధిక సాహితీ పరిశ్రమకిది భూమిక కాగలదనీ మా నమ్మిక.

డాక్టర్ తూమాటి దోణప్ప
ఎం. ఏ. పి. హెచ్. డి; డి. లిట్.
కులపతి
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్-4.



# ఆ శం స

"మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ—" కుమారి పి. వి. రాఘవమ్మ లఘుసిద్ధాంత వ్యాసము సంతోషపరచిన చక్కని కూర్పు. ఆంధ్ర మహిళామణులలో మనోహరమైన కవిత్వము వ్రాయగలిగి గ్రంథరచన చేసిన కవయిత్రులలో మొల్ల పేరు మొట్ట మొదట వినగలుగుదుము. ఈమె తండ్రి ఆతుకూరి కేసనసెట్టి, గురు లింగ జంగమార్చన పరుఁడు. శివభక్తుడు ఈమె కుమ్మరి వంగడమున జన్మించిన దని జనశ్రుతి. శ్రీకంఠ మల్లేశుని వరముతో ఈమెకు తెలుఁగు కవిత్వము లభించి నది. మల్లీశుని యనుగ్రహమున పుట్టువందిన దగుటచేఈమెఅసలుపేరు "మల్లమ్మ" యనియు మెల్ల మెల్లగ తెలుఁగు నోళ్ళలో "మొల్ల"గా పరిణమించిన దనియు చెప్పు కొందురు. మల్లేశుఁడు గోపవరపు వేల్పు. గోపవరము నెల్లూరి మండలములోనిది.

మొల్ల కాలమును గూర్చి భిన్నాభిప్రాయములున్నను, శ్రీనాథుని యుగాంతమునకు చెందినదని, పదునారవ శతాబ్ది యనినిశ్చితమైనది. కాలమునకేమి? తన రామాయణముతో మొల్ల ఎల్లకాలము నిలఁబడఁజాలిన కవయిత్రి. ఈమె తొలి పుట్టువులో ఎంతో సుకృతము చేసికొన్నది. తత్ఫలముగా శివానుగ్రహము కలిగినది రామభక్తి యేర్పడినది.

"పలికెడిది భాగవతమఁట, పలికించెడువాడు రామభద్రుండఁట!"-అను పోతనగారి పద్యము వంటిదే మొల్ల వ్రాసినది.

చెప్పుమని రామభద్రుఁడు
చెప్పించిన పల్కు మీఁదఁ జెప్పెద నేనె
ల్లప్పుడు నిహపర సాధన [illegible]
మిప్పుణ్య చరిత్రఁ దప్పు లెంచకుఁడెందున్.

అదికాక, మొల్ల తెలుఁగుకైతకు కొన్ని యెల్ల లేర్పరచినది. అతి గూఢ శబ్దములకు ఆమె యిష్టపడదు. అతి గూఢములనగా, నిఘంటువు చూచుకోవం సినవి కావచ్చును.

"తేనెసోక నోరు తియ్యన యగురీతి
తోడ నర్థమెల్లఁ దోఁపవలయునఁట!"
"గూఢ శబ్దములతో కొట్లాడుపని మూఁగ చెవిటివాని ముచ్చట యఁట!"
ఏదో పరాధీనమై వ్రాసికొని పోవుటకాక కవిత్వ మెట్లున్నచో విబు

ఘలకు రచించునో మొల్ల తెల్లము చేసినది. ఇది వరకే భాస్కర, రంగనాథాదులు రామాయణమును వ్రాసిరి. తాను మరల వ్రాయుటయేల? దీనికి మొల్ల యిట్లు సమాధానపడినది.

"భూజన కల్పకంబగుచు భక్తికి ముక్తికిమూలమైనయారాజాను దైవమైన రఘురాముని తించినదప్పు కల్గునే!"

మరియొక చక్కని మాట: "రాముని పేరుతో రాచిలుకను పిలిచిన వెలయాలికే ముక్తి లభించగా, నేర్పుతో రాముని వినుతించిన వారికి ముక్తిరాదా!" అన్నది.

రామానుగ్రహము పొందుటకు భక్తి వలయునేకాని. చదువుకాదు.

నేరిచి పొగడిన వారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గా రణ మగుటకు భక్తియె
కారణ మగుఁగాని చదువుకారణమగునే!

ఓహో! ఈ యొక్క పద్యము చాలు మొల్ల హృదయమును గ్రహించుటకు ఈమె కల్పనములు చాల సుకుమారములు. రసార్ద్రమైన పలుకుబడి. ధారాళమైన శైలి.

ప్రకృతము: మొల్ల రామాయణమును కూలంకషముగా పరిశీలనముచేసి, ఆమె కూర్పులకు. తీర్పులకు, మురిసి రాఘవమ్మగారు ఈ సిద్ధాంత వ్యాసమును సంతరించిన తీరు మెచ్చదగియున్నది. ఇందు— శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము. ఐతిహాసిక నాయిక సీత, సీత అభిజాత్యము, సీత సౌందర్య సమీక్ష, సీతాకల్యాణము సీత సంసారిక జీవనము అను ప్రకరణములున్నవి.

వాల్మీకములోని శ్లోకములు, మొల్ల పద్యములుచూసి పోలికలను పొందుపరచుటలో ఈ రచయిత్రి చేసిన కృషి సంతోష మొదవించినది. ఈ కూర్పునందలి వ్యాస రచన సుగమముగా, చెప్పదలచిన దానిని విశదము చేయుచూ మనస్సున కాహ్లాదము మొదవించు చున్నది.

కుమారి రాఘవమ్మ సాహిత్య రంగమున ముందు ముందు సాగించగల పరిశోధనాది కృషికి ఈ గ్రంధము నాంది యగుగాతయని ఆశీర్వదించుచున్నాను

మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి
లలితా నగర్, రాజమండ్రి-5.

# అభినందనము

కుమారి వి. వి. రాఘవమ్మ M. A. (Lecturer in Telugu, St. Theresa's College, Eluru) గారు నాగార్జున విశ్వవిద్యాలయము వారికి ఎం.ఫిల్ కొరకు సమర్పించిన "మొల్లమ్మ తీర్పులోని సీతమ్మ" అను లఘు సిద్ధాంత వ్యాసమును సాంతము చదివి సంతోషించితిని. దీనిలో నారు ప్రకరణములున్నవి. 1. శ్రీమద్రామాయణ కావ్య ప్రాశస్త్యము- మొల్ల రామాయణ వైశిష్ట్యము 2. ఐతిహాసిక సీత 3. సీత ఆభిజాత్యము 4. సీత సౌందర్య సమీక్ష 5. సీతాకళ్యాణము 6. సీత సాంసారిక జీవనము అనునవి.

ప్రథమ ప్రకరణములో శ్రీమద్రామాయణ కావ్య ప్రాశస్త్యము. మొల్ల రామాయణ వైశిష్ట్యమును వివరించుట జరిగినది. గీర్వాణభాషలో మధురాక్షర సమన్వితమగు వాల్మీకి రామాయణ ప్రాశస్త్యమును గ్గడించిరి. భారతీయ సాహిత్యమందేకాక విశ్వసాహిత్య వీధులలో కూడ వాల్మీకి రామాయణము మహేతిహాసముగా ఉజ్జ్వల ప్రశస్తిని బొందినది అది ఉత్తమాదర్శములకు, సుదాత్త దర్శనములకు ప్రతీక. ఉత్తరకాండతో కలిపి ఏడు కాండలలో 24000 శ్లోకములు కలది వాల్మీకి రామాయణము. మొల్ల తన రామాయణమును సంక్షిప్తీకరించి 800 పద్యములలో అనగా మూడవ వంతుకు తగ్గించి పరిసమాప్తి చేసినది. అట్లు చేయుటకో ఆమె శాంతాదేవి చరిత్ర, మందర వృత్తాంతము, శ్రావణ కుమారచరిత్ర, దశరథశాప కథనం, అహల్యాశాప వృత్తాంతం, రామాదుల జనన కాల నక్షత్రముల మార్పు, మిథిలలో సీతాదేవి బాల్య క్రీడలు, వివాహమైన తరువాత సీత అయోధ్యలో గడిపిన సాంసారిక జీవనము మొదలగునవి పరిహరించినది. అడవిలో చెంచెతలు సీతపొందు మార్గాయాసమును చూచి జాలిపడుట, శ్రీరాముడు సీత కోరికపై బంగారు లేడి చర్మము నొలిచి కానుకగా దెచ్చినట్లు, రావణుని పాతాళహోమము సంగతి, కాలనేమి వృత్తాంతము వంటి అవాల్మీకములగు విషయములను తన కావ్యములో చొప్పించెను.

రామాయణము మన దేశములోని వివిధ భాషలలో ననువదింపబడుటయే పాశ్చాత్య దేశములలో కూడ ప్రాశస్త్యమును సంతరించుకొన్నది. తెలుగు భాషలోనే కూడ ప్రాశస్త్యమును సంతరించుకొన్నది. తెలుగు భాషలోనే పెక్కురు రచయితలు పద్య, గేయ. నాటక రూపములలో రచించియున్నారు. సంస్కృతములో కాళిదాసు, భాసుడు, మురారి మొదలగు ప్రముఖ కవులు రచనలుచేసియున్నారు. రఘువంశము, భాసనాటకములు, అనర్ఘరాఘవము మున్నగునవి.

రామభక్తి పరతంత్రయగు మొల్ల శ్రీరామునారాధ్య దైవముగా భావించి సర్వ స్వతంత్రగా చక్కని, చిక్కని మకరందమునకెన యగు పద జాలముతో భక్తి భావవిలసితముగా, ధారాశుద్ధితో అలతి, అలతి మాటలతో భావ స్ఫోరకముగా, మనోహరముగా రచన సాగించినది. సీతాయాశ్చరితమ్ మహత్ అని వాల్మీకి నుడివినటుల ప్రత్యక్షర మాహాత్మ్యమును గ్రహించి సీతా పాత్రమునకు న్యాయము సమకూర్చినది.

మొల్ల నెల్లూరి మండలములోని రాపూరు తాలూకాలోని గోపవర గ్రామ నివాసిని. ఆతుకూరి కేసనశెట్టి కొమార్తె. కులాలవంశ సంభూత. శ్రీకంఠమల్లేశుని వరప్రసాదముతో కవిత్వము చెప్పినది. తెనుగు సాహిత్యమున తేనెవంటి తియ్యని పలుకులతో, ముద్దులొలుకు పద్యములతో రామాయణమును రచించి పండిత పామరుల నాకర్షించినది. దీర్ఘములు, కఠినములు నైనసమాసభూయిష్ఠయిములైన పద్యముల రచించుట తనకు నచ్చదనియు పూర్వ, కావ్యములన్నియు సంస్కృత భాషామిశితములనుచు తన రచనలోని సారళ్యతను వివరించినది.

> "మును సంస్కృతముల దేటగఁ
> దెనిగించెడి చోటనేమి తెలియకయుండన్
> తన విద్యమెఱయఁగ్రమ్మఱ
> ఘనమగు సంస్కృతముఁ జెప్పగా రుచియగునే?
> తేనెసోఁక నోరు తీయనయగురీతిఁ
> దోడ నర్థమెల్లఁదోఁచకుండ
> గూఢశబ్దములను గూర్చిన కావ్యమ్ము
> మూగ చెవిటి వారి ముచ్చటగును.
> కందువ మాటలు, సామెత
> లందముగాఁ గూర్చి చెప్పనది తెనుఁగునకున్
> బొందై, రుచియై, వీనుల
> విందై, మరి కానుపించు విబుధుల మదికిన్"

అనుచు తన కావ్య ప్రణాళికను నివదించినది. అది వరకు కొన్ని రామాయణము లుండ మరల తానేల రామాయణ రచన కుద్యమించినదనుటకు సమాధానముగా నిల్లనినది.



"అది రఘురామ చరితము
సాదరముగ విన్నఁగ్రొత్తయై, లక్షణి సం
పాద్యమై, పుణ్యస్థితి
వేదమైతోఁచకున్న పెట్టినె చెప్పన్."

తెనుఁగు భాషలో రచింపబడిన వివిధ రామాయణములను నిశితముగా పరిశీలించి, వాల్మీకి రామాయణముతో తులనాత్మక విమర్శనొనరించిన వ్యాస రచయిత్రి.కుమారి రాఘవమ్మ వాల్మీకి రామాయణములోని శ్లోకముల నెడనెడ నెన్నింటినో నుదాహరించుచు మొల్ల రామాయణమును తులనాత్మకముగా విమర్శించి కృతార్థురాలైనది. మొల్ల రామాయణము ప్రకృతి పురుషుల ఆదర్శ జీవనమునకు ప్రతిబింబమై, గార్హస్థ్య ధర్మప్రబోధితమై సీతారాముల కథలో రమ్యత్వము నాపాదించినది. మానవజీవిత మును తీర్చిదిద్దినది. రామచంద్రుని ప్రవర్తనము అద్భుతమైన నీతిని, ఉదాత్తాదర్శన ములను, పవిత్ర ప్రణయమును, ఆత్మీయతానుబంధములోని లాలిత్యమును నిరూపించి చేసి అతఁడాచరించిన ధర్మము నాచరింప మానవులను నుద్బోధించుచున్నది. రామ కథా మాధురి కవయిత్రి అడుగడుగున వెలయించినది మృదుమధురమైన శైలీవిన్యా సముతో రచన సాగించినది. కావ్యారంభములోని అయోధ్యా వర్ణనము, సుందర కాండలోని సీతారావణ సంభాషణలు, హనుమత్సీతా సంభాషణలు మరువరానివి. హనుమంతుడు సీతాదేవితో శ్రీరాముని శోభనగుణములనిట్లు వర్ణించెను.

"నీలమేఘచ్ఛాయఁబోలు దేహమువాఁడు
ధవళాబ్జ పత్ర నేత్రముల వాఁడు
....      ....      ....      ....
ఇన్ని గుణముల రూపింప నెసఁగు వాఁడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెవాఁడు

రచయిత్రి స్త్రీయైనను స్త్రీ సర్వాంగ వర్ణనము ప్రబంధరీతిలో వర్ణించినది. సాధారణ ముగా నాద సౌందర్యములేని పద్యము కనబడదు. ప్రతి పద్యము భావసమన్వితమే. కల్పనలన్నియు మధుర భావనకు పరసీమవే. శబ్దమాధురికి పరాకాష్ఠ రచయిత్రి ప్రతిభకి పెట్టని నగ. పలుకుబ్రోడతనానికి. వాదబలానికి ప్రతీకలు. కులాల సం ఘాతమైనను ఆమె మధుర శైలికి ముగ్ధులై పలువురు రచయితలామెను ప్రశంసించి యున్నారు. శ్రీమతి కాళ్ళకూరి మహలక్ష్మి సుందరమ్మగారు ఆమెనే కులమైననేమి యనుచు ప్రశంసా పూర్వకముగా నిట్లు వచించిరి.

"ఊతకు లోతులేదు, జగదీశ్వరు నాజ్ఞకు లాతి లేదు, వి
ఖ్యాతికి రోతలేదు, పరమార్థపు దృష్టికి జాతిలే "దంటూ"

శ్రీమతులు కంచనపల్లి కనకమ్మగారు, చిల్కపాటి సీతాంబగారు, కనుపర్తి వరలక్ష్మమ్మగార్లు మొల్ల రచన గురించి ప్రశంసా వాక్యముల నందించియున్నారు. డాక్టర్. కె. యన్. కేసరిగారు, మన్నెపల్లి రామకృష్ణరావుగారు, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు కూడ ఆమెకు నివాళులర్పించేరు. "రాముని వంటి సోదరుడు, భరతుని వంటి భక్తుడు, సుగ్రీవుని వంటి స్నేహితుడు, దశరథుని వంటి కరుణామూర్తి ప్రపంచ వాఙ్మయములో నెందును సృష్టికాలేదు." అన్న శ్రీసురవరం ప్రతాపరెడ్డి గారి మాటలు అక్షరసత్యాలు.

ద్వితీయ ప్రకరణము ఐతిహాసిక సీత

సీత తన పాతివ్రత్య ధర్మమునేత అధర్మము నెదిరించి నిలుచుట కెట్టి కడగండ్ల పాలైనదో రామాయణ కావ్యము చక్కగ నిరూపించినది. సీత తన ప్రవర్తనచే ఒక మహేతిహాసమును సృష్టించిన కావ్యనాయిక "ధర్మసూత్రము లను దృఢముగా బిగించినపుడు నడుమచిక్కి నలిగిపోయిన వ్యక్తులలో నొకతె సీతమ్మ" అన్నారు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. "రామో విగ్రహవాన్ ధర్మః" అని తెలిసినవారు రాముని విమర్శింపరు కాని సీతాదేవి అందుచే పడిన పాట్లు తలుచుకుంటే ఎవరికైనా కడుపు తరుగుకొని పోవును. ఆమె ధర్మాచరణ వైశిష్ట్యమే ఆమె నంతటి యున్నత స్థానమునకు చేర్చినది. ఆమె నిర్వహించిన భూమిక దివ్యసందేశాత్మకమై ఆమెకు దైవత్వమాపాదించినది. ఆమె భారతీయ సతీత్వమునకు పెన్నిధి. వాల్మీకి "కావ్యం రామాయణం కృత్స్నమ్" అన్నాడు.

త్రేతాయుగమును పావనముఁజేసి ఆ పావిత్ర్యమును తరతరములందు భారతీయులకు పంచిపెట్టిన పవిత్ర నారీమణి సీత. ఆమె జీవితమే ఒక యితిహాసము, ఐతిహాసిక నాయిక సీత యను ప్రకరణములో నుట్టంకించిన విషయములన్నియు అక్షర సత్యములు. సీత రాజస ప్రవృత్తితో ఎడనెడ రామునితో పలికిన పలుకు లామె ధైర్యస్థైర్యములకు ప్రతీకలు. అటువంటి సమయములో రామునికే మాత్రము బాధ కలుగకపోగా ఆమెను ప్రశంసించేడు. 'సీతా!' నీవులేని యెడల నాకు స్వర్గభోగములు కూడ రుచింపవన్నాడు. భర్త ఆంతర్య మెరిగి ప్రవర్తించు ఇంగిత జ్ఞానముకలది సీత. ఆమె శుద్ధ పేలపిండి, బెల్లపు ముద్ద అనిన సర్. సి. ఆర్. రెడ్డిగారి మాటలలో సత్యము లేదు. పట్టాభిషేకంగమైన తరువాత రాముఁడు

సీతను తనతో వనమునకు రావలదని చెప్పినపుడు సీత ఎంతో ధైర్యముతో, యుక్తి యుక్తముగా మాటాడి అతని నొప్పించినది. స్త్రీలకు మాతా పితలుకాని, సోదరులు కాని, పుత్రులు కాని, కోడండ్రు కాని భర్తతో తుల్యమైనవారు కారనియు. భర్తకు దూరమైన భార్య లోకనిందకు గురియగుననియు తన తండ్రి తన్ను సహధర్మ చారిణిగా తనకప్పగించినందులకు తానులేకుండ అరణ్యములకొక్కడు పోవుట భావ్యము కాదని, తన కరణ్యములు క్రొత్తవి కావని, తనకు రాజభోగములపై నాశ లేదని చెపుతూ తన తండ్రి స్త్రీరూపములో నున్న పురుషుడవని తెలియకతన్ను వివాహముచేసెననినిష్ఠురోక్తులు కూడఆడి రాముని కడకు ఒప్పించినది. సుందరకాండలో అశోకవనంలో రావణుడు తన ప్రతాపమును గూర్చి వీరాలాపములాడుచు తనఐశ్వర్యముగురించి చెప్పితన కష్టదిక్పాలకులు వినయ విధేయతలతో కైవసమై యుండిరచనురాముని రాజ్యహీనుడని,వనవాసియని చెప్పినపుడామె రావణుని తృణీకరించిరామచంద్రుని బలపరాక్రమములను వర్ణించి ఖరదూషణాదుల ససైన్యముగా పదునాల్గువేల మందిని ఒక్కడే సంహరించుట తెలిసి అతనితో యుద్ధము చేయుటకు భయపడి తన్ను దొంగతనముగా తీసికొని వచ్చినట్లు నిస్సంకోచముగా నిర్భయముగా చెప్పుటలో నామె ధైర్య, స్థైర్యములు, వ్యక్తిత్వము తెలియుచున్నది. దండకాటవిలో మునులు రాక్షసుల వధింపుమని ప్రార్థింపగా రాముడు వారి కభయమిచ్చినపుడు సీత రామునితో రాక్షసులెంత క్రూరులైనను తమ జోలికి రానప్పుడు వారిని వధించుట శ్రేయము కాదని పలికెను. ఇన్ని విధములుగా ధైర్య, సాహస వ్యక్తిత్వములతో యింపెసలారు సీతను పేలపిండి, బెల్లపుముద్ద యనుటలో ప్రామాణికత్వములేదు.

తృతీయ ప్రకరణము సీత అభిజాత్యము:

సీత అయోనిజ. భూగర్భము నుండి జనకుడు యజ్ఞ భూమిని దున్నినపుడు నాగేటి చాలులో లభ్యమైనది. సీతారాములు చిచ్ఛక్తుల సమాహారము. లోక కళ్యాణము కొఱకు అవిర్భవించిన ఆది పరాశక్తి యపరాంశయే సీత. ఆమె పతిసేవా పరాయణత్వము, ధర్మైక దీక్ష నావ్యతో దర్శనీయము. నిరుపమాన పాతివ్రత్యముతో శీల విభవముతో భరత భూమిని పునీతము, భాగ్యవంతము చేసిన నారీమణి. నాగేటి చాలు వంటి సక్రమమైన నడవడి కలది. "శ్రీరాముడాది నారాయణుడు. సీత ఆదిలక్ష్మి. వానరులు బృందారకులు కావున సీత రామునెదిరించి జయమ్ముగొనుట కడిందియని విభీషణుడన్న రావణునితో పలికిన పలుకులు యధార్థములు. రావణ పీడభరింపజాలక యింద్రాదులు బ్రహ్మతో కలిసి పరమేశ్వరుని

ప్రార్థింపగా వారికి "రాక్షస భయంకరి" యగు స్త్రీ యుద్భవింపఁబోవుచున్నదని పరమేశ్వరుఁడు వారికభయ మొసఁగెను. వాల్మీకి సీత నొక దేవ్యంశ కల దానినిగా వర్ణించెను. రావణసంహారమైన తదుపరి రాముఁడు సీతను గ్రహింప నిరాకరింపగా ఆమె యగ్ని ప్రవేశము చేసినది. అగ్నిదేవుడు వైదేహిని తీసికొని వచ్చి ఆమె అకలంక చరిత్ర, సాధ్వియని చెప్పి రామునకు అప్పగించెను. బ్రహ్మయు సీత యందే దోసము లేదు. పవిత్ర చరిత యని నినదించెను దశరథుడు పుత్త్రి లిద్దఱిని, కోడలిని కౌగిలించుకొని దీవించెను.

## చతుర్థప్రకరణము—సీత సౌందర్యసమీక్ష

అరణ్యకాండలో సీతాదేవి సౌందర్యవర్ణన, శ్రీరామవిరహతాప వర్ణన మనోహర ఘట్టాలు. శూర్పణఖ అన్న రావణునితో సీతాదేవి అంగాంగ వర్ణనము చేసి చెప్తుంది. సీత శరీరములోని-అవలకలు నాసిక, కరములు, వదనం, చరణములు, కంఠస్వరము, పయోధరములు, నడుము, అధరము, వాక్కు, బాహువులు, గమన వైఖరి, హాసము, కన్నులు ఊర్పులు, మొదలైనవి. పైకి వాచ్యంగా చెప్పకుండా ముంగురులతో తుమ్మెదలకూ, నాసికతో సంపెంగకూ, కరములతో పద్మాలకూ, వదనముతో చంద్రుడికే, చరణాలతో చివురు టాకులకూ, కంఠముతో కోకిలకూ, నడకలతో ఏనుగులకూ, హంసలకూ నడుముతో సింహానికీ, ఓష్ఠంతో దొండ పండుకూ పలుకులతో చిలుకలకూ, బాహువులతో తామరతూండ్లకూ, హాసముతో వెన్నెలలకూ, కన్నులతో చకోరాలకూ, ఊర్పులతో గాలికీ, నూగారుతో సర్పాలకు గల స్పర్ధను మొల్ల గడుసుగా, వ్యంగ్యము చేసినది. ఇలా మొల్ల సీతాదేవిలో క్రొత్తర సౌందర్యమును వర్ణించినది. అరణ్యకాండలో అత్రి, అనసూయల ఘట్టము, శరభంగ, సుతీక్ష్ణ, అగస్త్యమహర్షుల యాశ్రమముల సీతా సమేతుఁడై శ్రీరాముడు దర్శించిన విషయము పరిగారించినది.

## పంచమప్రకరణము: సీతాకల్యాణము

జనకుఁడు "శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుండగువాని కిత్తు నీ పంకజ నేత్ర సీత నరపాలకులార! అని ప్రకటించి నందున సీత రాముని స్వయంవరమున చేపట్టలేదు, సర్వాభరణ భూషిత యగు సీతను శివధనుర్భంగ మొనర్చిన రాముని చేతిలో నుంచి, రాకుమారా! ఈ సీత నా కూతురు. నేఁటినుండి నీ సహధర్మచారిణి. ఈమె పాణిని గ్రహింపుము. నీకు సర్వశ్రేయములు కలుగును. ఈమె పతివ్రతయై, భాగ్యశాలినియై ఛాయవలె నిన్ననుసరింపగలదని పలికెను. సీతా వివాహము

ఉత్తరఫల్గుని నక్షత్రమున జరిగినది.- "ఇప్పటి వరకు నా కొమార్తె. నేటి నుండి నీ భాగ్య దేవత. ఇరువంశముల నుద్ధరించు సచ్ఛీల, సౌభాగ్యసంపద గల సీతను నీ కప్పగించుచున్నా"ననుచు జనకుడామెను రాముని కప్పగించెను. సీత తల్లి (జనకుని భార్య) విషయము, నామము తెలుపలేదు. వాల్మీకములో సీత, ఊర్మిళ తన కొమార్తెలని జనకుడనగా, మొల్ల సీత యొకతెయే జనకుని కొమార్తెయనియు, ఊర్మిళా, మాండవి శ్రుతకీర్తులు జనకుని సోదరుడగు కుశధ్వజుని కొమార్తెలని తెలిపినది. ఏమైననూ సీతా వివాహ వైభవము మొల్ల సాంగముగా వర్ణించలేదన్నది నిర్వివాదాంశము. ఈ ఘట్టము వాల్మీకి విపులముగా వర్ణించెను.

షష్ఠ ప్రకరణము సీత సాంసారిక జీవనము

సీతారాములు ఒకరిని విడిచి వేరొకరు లేరు. అదే పవిత్ర ప్రేమకు పరాకాష్ఠ. అటువంటి దాంపత్యజీవనమును పండించుకొని తరతరముల కాదర్శ వ్యక్తులైనారు జానకీరాములు. తన భర్త యాంతర్యము నెఱిగి తదనుగుణ వర్తనముతో భర్తను ఆదరించి, గౌరవించి ప్రేమించినది భూమిజ. రావణ ప్రలోభ సమయములో, కష్టములో నుండి రామునిపైని తన యనురాగమును పదిలముగా నుంచినది. ఇది యామె నిర్మాలిన్యమైన ప్రేమకు, నిష్కపట వర్తనమునకు నిదర్శనములు. రాక్షస స్త్రీలతో కూడ సీత యక్లేమాటాడినది. భర్తృసాన్నిధ్యములో అయోధ్యయైనను, అడవియైనను ఒకే విధముగా భావించి సంతృప్తిని వెలయించినది. అవధిలేని వారి ప్రణయము అన్యోన్యత, సౌఖ్యదాయక జీవనము, స్వాధీన భర్తృకత ఎన్నదగినవి. సీతకు అత్తమామల యెడల నమపమగుభక్తి, అభిమానము. గౌరవము. మఱదుల యెడను తన సోదరీమణులగు ఊర్మిళా, మాండవీ శ్రుతకీర్తులనిన ఎంతయో గౌరవము, అభిమానము. కౌసల్యకు సీత యెడ నెనలేని ప్రేమ. లంకలోనుండగా హనుమంతునితో రామలక్ష్మణుల కుశలము నడుగుచు కౌసల్యా సుమిత్రాదులకు నమస్కారము లందజేయుమని కోరెను. వనవాసమునకు వెడలునపుడును, వనవాసము నుండి తిరిగి వచ్చిన కృశాంగి సీతను గాంచి కౌసల్య ఎంతగానో దుఃఖించినది. సీత పుట్టినింటికి, మెట్టినింటికి గౌరవము తెచ్చిన యిల్లాలు. సీత అడవికి వెడలు సమయమున "సీత నెవరు వనముల కంపుచున్నారు. ఆమెకు నార చీరలు కట్టుకొనుట తెలియదే. అందుచే తగినన్ని చీరలిచ్చి పంపుడని దశరధుడు పలుకగా

సీత నిరాకరించి తాను నార చీరను ధవుని సాయముతో కట్టుకొని వనముల కరిగెను. అయోధ్యలో నున్న ద్వాదశ సంవత్సరములలో నామె ప్రజాభిమానమును చూఱ గొనినది. సీతారామలక్ష్మణు లడవులకు వెడలునపుడు ప్రజలు చాల దూరము వారిని వెంబడించిరి. వారు వెడలుటకు ముందు విప్రులకు భూదాన, గోదాన, సువర్ణదానము లొసగిరి. సీత ప్రత్యేకముగా వేదవిదుడగును యజ్ఞుని భార్య కెన్నియో రత్నా భరణము లొసగి గౌరవించినది. ఈ విషయము లన్నియు మొల్ల తన గ్రంథములో పరిహరించినది. అగ్ని ప్రవేశము చేసిన సీతను గాంచి దశరథుఁడు బుజ్జగించి కొడుకుల నాలింగనము చేసికొని వారిని వాత్సల్యముతో చూచినాఁడు. తుల్యశీల వయోరూపములు కలవారు జానకీరాములు. జానకి యెడల నంతఃపుర కాంతలు కూడా ప్రేమాభిమానముల ప్రకటించిరి. వనగమనమునకు పోవు సమయమున దశరధునకే కాక కుల గురువు, రాజపురోహితుఁడగు వసిష్ఠునకు కూడ కైకయెడ కోపము వచ్చినది. కైకతో "సీత అడవులకు వెడలనక్కఱలేదు రాముని తరువాత సీతయే రాజ్యపాలనము చేయును. ఒకవేళ ఆమె కూడా వనముల కేగిన ఆమె వెనుక యీ అయోధ్య సర్వ, తరలి పోవును. దీని వలన సీత సచ్చరితము వీ ద్గొష్యము లోకమెరుగునని నాఁడు. మనువు స్త్రీ పురుషున కాత్మ వంటిదవినాఁడు. మారీచవధ తరువాత లక్ష్మణుని, రాముని కొరకు పొమ్మని సీత ఆదేశించగా లక్ష్మణుడు నిరాకరించినపుడతనిని సీత అనరాని మాట లనినదని మొల్ల వ్రాసినది. కాని వాల్మీకి ఆమె నిష్ఠురోక్తులను విపులముగా వర్ణించెను.

పట్టభంగమైనపుడు సీత నిరాశా నిస్పృహలకు లోనుకాక పతి పరాయ ణగా స్థిత ప్రజ్ఞయై వనముల కేఁగినది. వాల్మీకి రామాయణములో శ్రీరాముడు జానకితో దండకాటవిలో ఆశ్రమముల సందర్శించు సమయములో అగస్త్య మహ ర్షిని దర్శించు నపుడు నామహర్షి రామునితో నిట్లనెను. "కష్ట సమయములందు నీ భార్య నిన్ను విడువక నీతోపాటు కలిసి జీవించుట నీ యదృష్టము" అని వలు కుచు" యీమె చంచల చిత్తలైన సామాన్య స్త్రీ కోవకు చెందినదికాదు. అసాధారణ స్త్రీమూర్తియైన యీ జానకిని మిక్కిలి ఆదరణతోచూడుము" అనెను. నిరాఘని కథ స్వయం ప్రభ వృత్తాంతము. అనసూయాదేవి సీతకు అంగరాగాదులు, వస్త్రాభరణ ముల నిచ్చి సన్మానించి పతి శుశ్రూష యందను రక్తయైన నామెనెంతో కొనియాడి నది. ఈ సన్నివేశములను మొల్ల పరిహరించినది.

రామాయణ కావ్యమునకు హృదయ స్థానమైనదిసుందరకాండ. వైదేహి హృదయ సౌమనస్యమునకు పరాకాష్ట యీ కాండ జానకికి గలకుశాగ్ర బుద్ధికి, నిశిత పరిశీలనా వైదగ్ధ్యమునకు, సంభాషణా చాతుర్యమునకు, ధీరత్వమునకు, పాతివ్రత్య మునకు పరసీమ. సీతారావణులమధ్య, హనుమజ్జానకీ దేవుల మధ్య జరిగిన సంభా షణలు మణి దీపములు. మొల్లకూడ యీ సన్నివేశములను యథావాల్మీకముగ హృదయంగమముగ చిత్రించినది. ఆమె స్వభావసిద్ధమైన సద్వృత్త శీల సత్యదయా శౌచములకాలవాలము. మొల్లరావణు నెదిర్చి తనధైర్యసాహసములను నిరూపించిన తీరుప్రశంసనీయము. ఆమెకు తన పతియందున్న గౌరవప్రపత్తులు,భక్తివిశ్వాసము, పాతివ్రత్యమును చాటినది. వాల్మీకియు సుందర కాండలో సీతను శోకమూర్తిగా, విచక్షణాశీలగా, ప్రతీకార వాంఛా దీక్షగలదానిగ, ధైర్యశాలినిగ చిత్రించియున్నాడు. హనుమ సీతాదేవిని తనతో కొనిపోయెద ననగా సీత తనకు అతని శక్తి తెలియు ననియు, అది క్షేమదాయకము కాదనియు, పరపురుష స్పర్శ కూడదని, రాముడేవచ్చి తన్ను తీసికొని పోవుట మంచిదనియు, రావణుడు తాను వివశనై యుండగా స్పృశించి పోయినాడనియు, రావణుడు దొంగతనముగా తన్ను తీసుకొని పోయె ననియు ఇపుడు నీవు నన్ను కొనిపోయిన "భూవరుడే దొంగ యండ్రనియు, దొంగిలి కొనిపోవదగునె దొరలకు నెందున్ అని లోకజ్ఞగా మాటాడినది. సీత నగ్ని పరీక్షకు గురిచేసి తానామెను పరిగ్రహింపలేననియు, భరత,లక్ష్మణ శత్రుఘ్న సుగ్రీవులలో నొకరిని గైకొనుమనెను. "సీత యెక్కడ నున్నను పాపరహితయను విషయము తెలిసినను రాముడట్లు నిరాకరించుట తాను కాముకుడై నందున భార్యను స్వీకరించెనను లోకనిందకు వెరచి సీత నగ్ని పరీక్షకు గురిచేసెనను. మాటను వాల్మీకి సమర్థించుట అన్యాయమనుటలో న్యాయములేదు. తరువాత ఉత్తర కాండలో ఒక రజకుని నిందతో సీతను తిరిగి అరణ్యములకు పంప వలసివచ్చినది. దీని వలన వాల్మీకి లోకజ్ఞత్వము దూర దర్శిత్వము విదితమగుచున్నది. ఇది పురుషా ధిక్య ప్రపంచము యొక్క తీరును వాల్మీకి సమర్థించెనను కొనుటలో న్యాయము లేదు.

ఈ వ్యాసరచయిత్రి వాల్మీకి రామాయణము నుండి వలసినచోటనెన్నియో శ్లోకమ్ములను ఉదాహరించి మొల్లమ్మ తీర్పులో సీతమ్మ వ్యాసమును శిల్పీకరించి సకల పతివ్రతా లోకమున కాహ్లాదము గలిగించెను. ఆమె పరిశ్రమకు, పరిశీలనా వైదగ్ధ్య మునకు, పరిశోధనకు నాకైవారములు. ఆమె గంగా ప్రవాహమువంటి శైలీవిన్యా సమునకు నా అభినందనములు.

కరుటూరి సత్యనారాయణ

రాజమండ్రి

# తెలుగింటి సీతపై కొత్త వెలుగులు

విశ్వసాహితికి భారత భారతి అందించిన మహా కావ్యం రామాయణం. ఇది దూర తీరాల అవధులను అధిగమించి మానవ జాతికొక విశ్వసందేశం అందిస్తున్నది గనుకనే తరతరాలుగా నిలచి ఉంది. నదులు, నదులు, గిరులూ ఈ భూమిపై నిలచిఉన్నంత కాలం రామాయణం నిలచి ఉంటుందని విజ్ఞులు భావిస్తున్నారు.

తమిళనాడులో లంకేశ్వరుని కథ మరొక రూపంలో ప్రచారంలో ఉంది. సీత లంకేశ్వరుని కూతురుగానూ, రామ రావణ యుద్ధం ఆర్యద్రావిడ చరిత్రను సమరంగానూ ప్రచారం చేస్తారు. ఇది నిజం ఎందుకుకాగూడదు అని ఆలోచిస్తే- ఈ కథ ద్వారా ఇచ్చే సందేశం అంటూ ఏమీ ఉండదు. రామాయణం భారతీయ సంస్కృతిని, సంప్రదాయ సంపదను లలితంగా, వాఖ్యంగా జాతికి అందిస్తుంది. ఈ కావ్యం ఒక విజ్ఞాన భాండం కనుక దాని నుంచి జ్ఞానామృతం విశ్వవ్యాప్తంగా అందుతూ ఉంది కనుకనే—ఇంకే కుటుంబ వ్యవస్థ, వావి వరుసలు, మానవత్వం, మమత, ప్రేమ, త్యాగం మిగిలి ఉన్నాయి. వీటిని వాల్మీకి రామాయణం మనకు అందిస్తున్నది. ఈ తల్లి వేరునుంచే వందలాదిగా తెలుగులో రామాయణాలు వెలశాయి. అందు విశిష్టమైన వాటిలో మొల్ల రామాయణం ఒకటి. మిక్కిలి వినయ సంపదగల మొల్ల తనకు అలంకార వ్యాకరణాలు పెద్దగా తెలియదంటూ, రచన ఎలా ఉండాలో అలంకార వాఙ్మయ సారాన్ని, తన కవితా లక్ష్యాన్ని ఇలా చెబుతూంది.

"తేనె సోఁక నోరు తీయనయగు రీతి
తోడ నర్థ మెల్ల దోఁచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటి వారి ముచ్చటగును"

అలాకాకుండా తన కావ్యాన్ని హృద్యమంగా తీర్చి దిద్దింది మొల్ల, వాల్మీకి తీర్చి దిద్దిన సీత కంటే-మొల్లమ్మ, దిద్దిన సీతమ్మలో సౌందర్యగుణం, శీల సంపద, అభిజాత్యం, విశిష్ట వ్యక్తిత్వం, తెలుగుదనం మరో మెట్టు హెచ్చుగా చూపింది. దీన్ని రాఘవ+అమ్మగారు - అంటే కౌసల్యాదేవి తన కోడలి ఔన్నత్యాన్ని గురించి ఎంత గొప్పగా చెప్పుకుంటుందో అలాగ వివరించారు. సీత ప్రధానంగా ఈరచన రచనలో రామకథ నడిచింది. సీత వ్యక్తిత్వం రాముని విశిష్ట గుణసంపదకు ఒరపిడి రాయి అన్నట్లుగా రాఘవమ్మగారి విశ్లేషణ మనోజ్ఞంగా సాగించి.

తెలుగులో రామాయణంపై వచ్చిన విమర్శ, ప్రశంసాత్మక రచనలలోనే ఇదొక మేలి రచన. సీతపై వెలుగులను ప్రసాదించే రాఘవమ్మ తొలి విశిష్ట రచన.

**డాక్టర్ వెలగా వెంకటప్పయ్య** పి హెచ్, డి
కార్యదర్శి జిల్లా గ్రంథాలయ సంస్థ
ఏలూరు-534 006 ఫోన్ : 40

•*•

# కృతజ్ఞతలు


ఇక్ష్వాకుల ఇంటి దీపం అయిన శ్రీరాముని ఇతిహాసంలో "సీతాయాశ్చరితం మహత్" ని వాల్మీకి కొనియాడిన స్త్రీ రత్నం సీత, ఆమె జీవన సౌభాగ్యం భారతీయ సతీత్వాధర్మాలకు మణిమకుటం స్త్రీ వ్యక్తిత్వానికి, మేధా వికసనానికి, పాతివ్రత్య పాలనకు, త్యాగౌదార్యాలకు నాన్యతో దర్శనీయచరితం. ఆమె జీవితానుభవాలు ఆమెనొక ఉత్తమ ఇల్లాలుగ, ఆదర్శ సతీమణిగ లోకానికి పరిచయంచేసి కీర్తిదాయకం అయిన తిరుతీఘూలను వాల్మీకంతో తులనాత్మకంగ మొల్ల రచియించిన కథా విశేషాలను సమీక్షించిన ప్రయత్నమిది. వాల్మీకం నందలి సారూప్యభేదాలతో సంక్షిప్త రామచరితమైన మొల్ల రచనతో సీతాదేవి సమగ్రరూప చిత్రణ గావించాను. ప్రాచీనార్వాచీన కవుల గ్రంథాలను, విజ్ఞుల వ్యాసాలను, పరిశీలించి విషయ సమన్వయంతో విశదీకరించాను. జనక పుత్రి జీవితాచరణలు భారతనారీ లోకానికి ఉపదేశాత్మకాలై ఆదర్శ పాత్రం కాగలవని ఆశిస్తున్నాను.

"శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" అన్నారు. ఈ దేహాన్నిచ్చిన ఆదేవుడికి, ఈ రూపాన్నిచ్చిన నా తల్లి దండ్రులకు ముందుగ శిరసువంచి పాదాభివందనం చేస్తున్నాను. ఆగిపోయిన నా విద్యా వ్యాసంగంసాగిపోయే అవకాశాన్ని కల్పించిన మా అన్నయ్య వెంకట నారాయణకు, ఉన్నత విద్యకై ఇతోధికంగా సహాయ సహకారాల్ని అందించి అభిమాన పుత్రికగ ఆదరించిన మా అక్కయ్య అన్నపూర్ణమ్మకు, మామయ్య శ్రీరామయ్యకు వినయంతో అంజలి ఘటిస్తున్నాను.

ఎం. ఫిల్. చేయడానికి నన్ను ప్రోత్సహించి, అనుమతిని, ఆశీస్సులను తెలిపిన మా కళాశాలాధ్యక్షురాలు రివరెండ్ సిస్టర్. మేరీ విన్‌ఫ్రెడ్‌గార్కి, సుపీరియర్ రివరెండ్ సిస్టర్ క్రిస్టీనా గార్కి, తెలుగు శాఖాధ్యక్షురాలు శ్రీమతి ఊటుకూరి సుహాసిని గార్కి నా కృతజ్ఞతలు.

ప్రతి విషయాన్ని తగిన సూచనలతో ఆమూలాగ్రంగా పర్యవేక్షించి, చర్చించి, సవరించి, ఈ లఘు సిద్ధాంత వ్యాసానికి సారధ్యం వహించి, తమ అమూల్య అభిప్రాయాల్ని తెలియచేసిన మా గురుదేవులు, తెలుగు విద్యార్థి కలల వెలుగు, స్వర్ణపతక స్థాపకులు, లబ్ధ ప్రతిష్ఠులు, నేడు ఆచార్య విభవంతో తెలుగు విశ్వవిద్యాలయకులపతులై ఆంధ్ర భాషామతల్లి గ్రైవేయ హారమైన మల్లె పూదండవలె యశోవిభూషితులైన డాక్టర్ ఆచార్య తూమాటిదోణప్పగార్కి భక్తితో వందన మాచరిస్తున్నాను.

విద్యాకౌశల ప్రణాళిక క్రింద ఉపకార వేతనం ఇచ్చిన యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్ వారికి, సకాలంలో అనుమతిని తెలియచేసిన డైరెక్టర్ ఆఫ్ హాయ్యర్ ఎడ్యుకేషన్ వారికి, నాగార్జున విశ్వవిద్యాలయ కులసచివులకు, ప్రాచార్యులకు, వసతి గృహ నిర్వాహకురాలు డాక్టర్ కుమారి కె. వాణి గార్కి, వివిధ గ్రంథ పాలకులకు నా నమోవాకాలు. వ్యాస ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన తెలుగు విశ్వ విద్యాలయం కులపతులకు, కులసచివులకు, తదితరులకు నా కృతజ్ఞతలు. తమ అమూల్య అభిప్రాయాలను తెలియ చేసిన సుప్రసిద్ధ కవి, పండితులు కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణగార్కి. ప్రసిద్ధ కవులు కరుటూరి సత్యనారాయణగార్కి, సంస్కారానికి, శేముషీవిభవానికి, ఆత్మీయతకు మరో పేరుగ ప్రసిద్ధి చెందిన డాక్టర్ వెలగా వెంకటప్పయ్యగార్కి అక్షరాంజలులు. వయస్సులో పిన్నవాడు, సుగుణాలెన్నో వున్నవాడు, ఆత్మీయతకు, ఆదర భావానికి ప్రతీకమైనవాడు నా అభిమాన సోదరుడు చి॥ డా. టి. గౌరీశంకర్‌కు. చి॥వీరాంజనేయులకు నా ఆశీస్సులు. ముఖచిత్రం రచించిన మిత్రులు శీలా వీర్రాజుగార్కి తమ సహకారాన్నందించిన మిత్రులు అప్పలరాజుగార్కి, సకాలంలో అచ్చువేసిన నాగార్జున ప్రింటర్సు అధినేత, మిత్రులు పి. వెంకటేశ్వరరావుగార్కి వారి సహచరులకు నా హృదయ పూర్వక అభివాదాలు. మిత్రులు, హితులు, శ్రేయోభిలాషులు, గ్రంథ కర్తలు, వ్యాసకర్తలు ఎందరో వాళ్ళందరికీ ముమ్మొంముగా ఓ వందనం.

—వి. వి. రాఘవమ్మ

# విషయ సూచిక

మొదటి ప్రకరణము:

వాల్మీకిరామాయణము 9
మొల్లరామాయణ రచనా వైఖరి 12
కవయిత్రి మొల్ల దేశము 14
కవయిత్రి కాలము 15
శైలి 17
రామాయణ రచనావశ్యకత 19
మొల్లరామాయణ రచనాప్రణాళిక 20

రెండవ ప్రకరణము:

ఇతిహాస నాయికసీత 22
పాత్రల భేదములు 23
రామాయణ కావ్య పాత్రల పరిచయము 25
సీతా ద్రౌపదులు 33

మూడవ ప్రకరణము:

సీత ఆభిజాత్యము 39
సీతాదేవి జన్మ వృత్తాంతము 46
పూర్వజన్మ వృత్తాంతము 49
వంశము తాత ముత్తాతలు 51
బాల్యక్రీడలు—విద్యా విషయములు 55
దానశీలముగల సీత 58
దాక్షిణ్యనిలయం 59
దైవభక్తి పరురాలు 60

నాల్గవ ప్రకరణము:

సీత సౌందర్య వర్ణనము 63

ఐదవ ప్రకరణము:

సీతాకళ్యాణము—స్వయంవరము 75
వివాహ వ్యవస్థ 80
వివాహ భేదములు 83
సీతాకళ్యాణము ప్రాజాపత్యము 85

ఆరవ ప్రకరణము:

సీతాదేవి సంసారిక జీవితము 92
కుటుంబ జీవన వృత్తము 101
అశోకవనిలో సీత 123

మరియు

ఉపయుక్త గ్రంథసూచి, తెలుగు గ్రంథములు, వ్యాసములు, నిఘంటువులు.

# శ్రీమద్రామాయణ కావ్యప్రాశస్త్యము కవయిత్రి మొల్ల

## మొదటి ప్రకరణము

## వాల్మీకి రామాయణము

భారతీయ సాహిత్యము నందేగాక విశ్వసాహిత్య వీధులలోను భారత రామాయణములు రెండును మహేతిహాసములుగా నిస్తుల ప్రశస్తిని బడసినవి. వ్యాస వాల్మీకి మహర్షుల ఉత్తమ ఆదర్శమునకును, ఉదాత్త దర్శనమునకును ఇవి ప్రతిరూపములు. గ్రంథ పరిమితిలో వాల్మీకి రామాయణము వ్యాస భారతములో సుమారు నాల్గవ వంతు. అవతార పురుషులలో ఉత్తముడును, ఉదాత్తుడును అయిన శ్రీరామచంద్రుని ఆదర్శ చరితమిందు ప్రపంచితమైంది. మహాభారతమున కృష్ణావ తార కథనమునకు ప్రాధాన్యము లేదుగాని ధర్మగ్లాని సంభవించినప్పుడు అవత రించిన గీతాచార్యులు ధర్మపక్షపాతియై ధర్మమునకు విజయమును చేకూర్చిన కథ వివృతమైనది. శ్రీరాము డుపదేశములను చేయలేదు. భారతీయ ధర్మములను ఆచ రణలో అనువదించి ఆదర్శమూర్తిగా ఆరాధింప బడుచున్నాడు. అందువలన ఆయనది అనుష్ఠానావతారము. కర్తవ్య విమూఢులైన జనులకు కర్తవ్య పాలన గూర్చి, కఠోరదీక్షను గూర్చి గీతా రూపమున ప్రవచించిన ప్రవక్త శ్రీకృష్ణుడు. అందుకే ఆయనది ఉపదేశావతారము. కాబట్టియే శ్రీరాము డాచరించినట్లాచ రింపుడు, శ్రీకృష్ణుడు చెప్పినట్లు చేయుడని పెద్దలు చెప్పుట సంభవించినది.

గీర్వాణ భాషలో మధురాక్షర సమన్వితమగు ఆది కావ్యమని ప్రశస్తి నందినది రామాయణ మహాకావ్యము. కుహూరావము నందలి తీరుతీయములు, సొంపు సోయగములు తమ ప్రతిధ్వనిలో నినదింపక పోయినను కోకిలననుకరింప నెంచుట లోకులకు కుతూహలము. వాల్మీకి కోకిల ననుసరింపనెంచుట కవి లోకము నకు ఆనందదాయకము.

'కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్

ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్'

అని వాల్మీకికి ముందుగ వందన మాచరించిన వారే అందరు. మూలము నందలి మేలిమి గుణములు అనుకృతిలో కన్పట్టుట మిక్కిలి అరుదైన విషయము అయినను వాల్మీకి యనంతరము, రామాయణ కథ పాలీ ప్రాకృతాది ప్రాచీన భాషల లోను, తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, ఒరియా, మరాఠీ, అస్సామీ మొదలైన భారతీయుల దేశభాషలలోను చిత్ర విచిత్రగతులలో మలుపులు తిరిగినది. కవులు, కళాకారులు, పండితులు తమ ఇచ్చవచ్చిన రీతిలో మూల కథాగతిని మార్చి వేసిరి. క్రొత్త క్రొత్త ఘట్టములను చొప్పించిరి. కొన్ని కొన్నిచోట్ల మూల కథా సూత్రముల నిసర్గ గుణము లందును ఎన్నెన్నో మార్పులను ప్రదర్శించిరి. ఇక జానపదుల రామాయణ కథనమున ప్రవర్తిల్లిన పరిణామము శతకోటి ప్రవిస్తరము. 'సీతమ్మ మా యమ్మ, శ్రీరాముడు మా యయ్య' అని జగజ్జననీ జనకులుగా తెలుగు జానపదుల విశ్వాసము.

క్రొత్త సత్యనారాయణచౌదరిగారు రామకథా వ్యాప్తినిగూర్చి "సంస్కృత వాఙ్మయమందేగాక, దేశ్యభాషలలోఁ గూడ అనువాదములుగా, అనుకరణములుగా స్వతంత్రములుగా ఎన్నో గ్రంథములు పుట్టినవి. పుట్టుచున్నవి. అనుచితమైన వస్తు వును పరిహరింప వచ్చునన్న పరిభాష చేఁదమకు రుచింపని ఘట్టములను సమగ్ర ముగా దీసివైచి కాలమునుబట్టి, దేశమునుబట్టి, సంఘమునుబట్టి అపూర్వ గాథలకు ఎన్నెన్నో మార్పులు కూర్పులు చేసి క్రొంగ్రొత్త కావ్యములు నిర్మించిన వారును గలరు." (1)

అని దెలిపియున్నారు. ఇన్ని మార్పులు, చేర్పులు జరిగినను మూలరామా

(1) రామాయణ రహస్యాలు, అవతారిక పు. 1

యణ కథ మాత్రము. చెక్కు చెదరక నిలిచి యుండుట విశిష్టము. అంతియేగాక ఈజిప్టు మొదలైన మధ్య ప్రాచ్యసీమలలోను, ఇండోనేషియా, మలేషియా మున్నగు దూర ప్రాచ్య భూములలోను శ్రీరామకథకు అగ్రస్థానము లభించినది. ఇట్లు రామ కథావ్యాప్తి ప్రశస్తులు భారతదేశమునకు మాత్రమే సీమితమైనవిగావు. దేశ దేశేతర భాషలలో ఉపలభ్యములగు గ్రంథములే ఇందుకు ప్రబలనిదర్శనము. 'పాఠ్యేగేయేచ మధుర'మ్మనియు, తంత్రీలయ సమన్విత'మ్మనియు పేరొందిన ఈ రామకథ ప్రాక్పశ్చిమ దేశములలో ఇంత వైవిధ్యమును, వైశిష్ట్యమును కలిగియున్నది. ముఖ్యముగా ఇది భారతీయులకు జీవనాడివంటిది. పిలయనగ భారతదేశ సంస్కృతి, సంప్రదాయములకు, నైతికమైన విలువలకు అనువైన ముఖ్య మూల సూత్రముల కిది కాణాచి వేదమునకు రూపకల్పనయే రామాయణమని వాల్మీకము.

ప్రకృతి పురుషుల ఆదర్శ జీవనమునకు ప్రతిబింబమై గార్హస్థ్య ధర్మ ప్రబోధితమైన సీతారామ కథలోని రమ్యత్వము ఈ కావ్యమున కింత ఖ్యాతి నార్జించి పెట్టినది. ఇది మహేతిహాసమే గాదు సమస్త శాస్త్రార్థ ప్రబోధితము కూడ ఎందు వలననగా మానవ జీవితమును తీర్చిదిద్దినది. అద్భుతమైన నీతిని, ఉన్నతాదర్శము లను, పవిత్ర ప్రణయమును, ఆత్మీయతాను బంధములోని లాలిత్యమును నిరూపిం చిన మహాకావ్యమై భారతీయ జీవనవాహినిలో అంత ర్లీనమై పోయినది.

కావ్యరూపముగానే గాక భాస, కాళిదాస, రాజశేఖరాది సంస్కృత కవుల చేతిలో రూపకముగా కూడ రూపుదాల్చినది. దేశభాషా కవులైన బుద్ధారెడ్డి, కంబడు, పంపడు, తులసీదాసు మున్నగు వారి చేతిలో ఎన్నో మార్పులను సంతరించు కొని నది. జానపద కవుల కలములలోని కథా విన్యాసములు, వన్నెచిన్నెలు ఎన్నతరము గానివి. తెలుగు నందలి ప్రాచీన రామాయణములలో భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము, నిర్వచనోత్తర రామాయణము, అర్వాచీన యుగముల నాటి గోపీనాథ రామాయణము, వావిలకొలను సుబ్బారావుగారి శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, జనమంచి శేషాద్రిశర్మగారి ఆంధ్ర శ్రీమద్రామాయణము ప్రసిద్ధము లైనవి. ఇందరి ప్రముఖ కవుల రచనలతో తుల్యమైనదిగా మొల్ల రామాయణము ఎన్నబడుట ఇందలి విశేషము. ఈమె కావ్యమును గూర్చి క్రొత్త సత్యనారాయణ చౌదరిగారు.

"భాస్కర రామాయణాదులలో కొన్ని ఘట్టములు రసవంతములే గాని

ఆ రచనలు వాల్మీకమునకు సమగ్రమైన ప్రమాణమైన అనువాదములుగాఁ గన్పించవు. మొల్ల వంటి కొందరు వ్రాసినవి అత్యంత మధురములేగాని సంక్షేపముగా, సంగ్రహముగా ఆ కథలు నడిచినవి" (1) అని చెప్పిన దానినిబట్టి ఈ కావ్యము వాల్మీకమునకు సమగ్రమైన తుల్యమైన అనువాదముగా నెంచవచ్చును.

## మొల్ల రామాయణ రచనా వైఖరి

తాళ్ళపాక తిమ్మక్క వంటి కవయిత్రులును తెలుగు సాహిత్య చరిత్రలో మనకు పరిచితులేగాని ఒక విశిష్ట స్థానమును అలంకరించుకొని నేటివరకు తెలుగు వారి నాల్కలందు వర్తించుచున్న నామధేయము మొల్ల కవయిత్రిది.

ఆంధ్ర కవయిత్రులలో విశిష్ట స్థానము నలంకరించిన ఈమె రామభక్తి పరతంత్ర. శ్రీరాముని తన ఆరాధ్యదైవముగా భావించి భక్తి భావ విలసితముగా కథను అల్లుకుపోయినదని ఈమె రచన చేసిన తీరు విశదపరచుచున్నది.

'ఈరామ చరిత మెప్పుడు
వారక విన్నట్టి వారు వ్రాసిన వారున్
గోరి పఠించిన వారును
శ్రీరాముని కరుణ మేలు నెందుదు లెలమిన్'

(యుద్ధ 1–136)

అని చెప్పిన ఫలశ్రుతినిబట్టి భక్తిభావ విలసితముగనే గాక సీతారాములిరువురకునుగల ప్రత్యేకతను స్ఫురింప జేసిన దనదగును. 'ఈ రామ చరిత'మను పదమును సిద్ధ సమాసముగా నెంచిన శ్రీరాముని చరిత్రమనియు, సాధ్యసమాసముగ చూచినప్పుడు 'ఈరామ' (రామ = స్త్రీ) అనునది లక్ష్మియను నర్థములో సీతా చరిత్రమనియు వ్యాఖ్యానింపదగియున్నది. మొల్లమ్మ దీనినిట్లు ఉద్దేశించినది ఇట రామ యనునది హరిహరా భేదముతో కూడినదై ఒప్పుచున్న పదమని పెద్దలు భాషించుట గలదు. 'రా' యనునది 'ఓం నమో నారాయణాయ' అను నారాయణాష్టాక్షరిలోను. 'మ' అనునది 'ఓం నమశ్శివాయ' యను శివ పంచాక్షరిలోను గల అక్షరములని పెద్దల వక్కాణ. 'బ్రహ్మ'యను పదము నందలి రెండక్షరములలోని ర, మ–లు కలియగా తారక బ్రహ్మమంత్ర రాజమైనదని మరికొందరి పాండితీ ప్రకర్ష. ఈ

(1) రామాయణ విమర్శ్యాలు, ప్రస్తావము, పు. 4

రెండక్షరము లేకమై తారకమంత్ర రాజరూపమై తదుపాసకులను తరింప జేసినది. 'తార యతి ఇతి తారకమ్' (తరింపజేయునది). అని దీని నిర్వచనము. శ్రీరామ నామ జపపరమైన 'ఓం రామాయనమః' అను మంత్ర రాజమునకు 'తారక మంత్ర' మని అన్వర్థ నామము. 'తారక మంత్రము కోరిన దొరకెను ధన్యుడ నైతిని ఓ రన్నా' అనియు, 'ఓ రామ నీనామ మెంతో రుచి ఎంతో రుచి ఎంతో రుచి'యనియు భక్తరామదాసు గంతులువేసి కీర్తించినాడు. ఆనంద కాననమని ప్రశస్తి వహించిన కాశీక్షేత్రములో మృతి నొందు జనులకు వారి మరణ సమయమున కాశీ విశ్వనాధుడు తారక మంత్రమును ఉపదేశించి తరింప జేయునని ఆచార్య పురుషుల విశ్వాసము.

వాల్మీకి కూడ శ్రీమద్రామాయణము కేవల మొక శ్రీరాముని గాథయే గాక సీతా చరితమును, పౌలస్త్యవధయును ఇందు అంతర్లీనమై యున్నదనుచు నిరూపించియున్నాడు.

> 'కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్
>
> పౌలస్త్యవధ మిత్యేవ చకార చరిత వ్రతః"
>
> (బాల 4-7)

రామా + అయనము అనుట వలన 'రామా' అనునది 'స్త్రీ'యను అర్థమున ప్రయోగింపబడినది అయన మనగ చరితము.

మొల్ల శివభక్తురాలు ఆమె నమ్మిన దైవము తారక మంత్రోపదేష్టయైన గోపవరపు శ్రీకంఠ మల్లేశ్వరుడు. కులదైవముతో పాటీ మెయు తారకమంత్రోపాసకురాలు. అను విశేషార్థమును లాగవచ్చును. మరియు 'శివభక్తిరతు'డైన కేసన పుత్రి, యయ్యును శ్రీరాముని మేరకు రామకథ చెప్పబూనితి ననుట హరి హరా భేదతత్త్వ నిరూపణమే.

> "చెప్పుమని రామచంద్రుడు ...."
>
> సెప్పించిన పలుకుమీదఁ జెప్పెదనే నె
>
> ల్లప్పుడు నిహపర సాధన
>
> మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుడు బుధుల్।
>
> (పీఠిక, 13)

అని బమ్మెర పోతన్న ననుకరించి తన రామాయణ రచనలోని ప్రత్యే

కతను వివరించిన దీమె. భక్తురాలుగ నిరూపించుకొను ఉద్దేశముతో కావ్యము చెప్పి నను సీతను రాముని సహచారిణిగ, పతివ్రతగ, ఆదర్శ స్త్రీగ నిరూపించుటలో కొరతలేని రీతిగ వర్ణించినది. భారతీయ సతీత్వమునకు మాతృత్వమునకు దర్ప ణము పట్టిన దనుటకు పీఠికా పద్యము లందుగల శ్రీవాణి గిరిజల వర్ణనమే ప్రబలో దాహరణముగ చెప్పవచ్చును.

[మొ. రా. పీఠిక 6–8]

## కవయిత్రి మొల్ల దేశము

మొల్ల ఆంధ్రదేశము నందలి నెల్లూరు మండలములోని నేటిరావూరి తాలూకా గోపవర గ్రామ నివాసిని. ఆమె తన కావ్యము నందిట్లు పలికినది.

"విఖ్యాతగోప వరపుశ్రీకంఠ మల్లేశు వరముచేత

నెఱిగ విత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి"

(పీఠిక-12)

"గురుడాతుకూరి కేసయ వరపుత్రిని మొల్ల యనగ వరలలినాదానన్"

(పైది॥)

"ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాదలబ్ధ గురు జంగమార్చన వినోదసూరి జన వినుత కవితాచమత్కా రాతుకూరి కేసనసెట్టి తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు" (బాల) అని వర్ణితమైన విషయము లన్నియు నెల్లూరిసీమ యందున్న గోపవర గ్రామవాసినియని, కేసన పుత్రియని గౌరీశ్వరుని వరముచే కవితల్ల నేర్చినదనియు, మొల్ల నామధేయ యనియు నీమెను పరిచయము చేయుచున్నవి.

"ఆంధ్ర కవులలో మధ్యకవులయందు పేర్కొనబడిన ఈమె ఆతుకూరి కేపన్న శెట్టి కుమారిత. ఈమె కులాలవంశ సంభూతయని పరం పరగా వాడుకవల్ల తెలియుచున్నది. కాని నిదర్శనములు లేవుగాన అట్లె చెప్పబడినది. నివాసము నెల్లూరి వద్ద పడగుపాడని యందురు ఆంధ్రకావ్యముల రచించిన స్త్రీలలో నీమెయె మొద టిది. తరువాత నివాసస్థానము నెల్లూరి మండలములోని గోపవరమని వాడుకగలదు. రచించినది ఆంధ్ర రామాయణము దీనిని మొల్ల రామాయణము అని అనుచు న్నారు" (1)

(1) ఆంధ్ర విజ్ఞానము Tulugu Encylopaedia ద్వితీయసంపుటం, పు-805

అను విషయములను మొల్ల నెల్లూరిసీమకు చెందిన ఆంధ్రకవయిత్రిగ కేసన్నపుత్రికగ కుమ్మరకుల సంభూతగ నిరూపించుచున్నవి.

నెల్లూరి సీమలో వర్ధమాన సమాజము-వారి ఆధ్వర్యమున ఏర్పాటు చేయబడిన మొల్లజయంతుల సందర్భమునందు డా॥కె. యన్. కేసరిగారు ఉపన్య సించుచు పలికిన పలుకులను మొల్ల నెల్లూరి మండల వాసినియనుటకెట్టి సందియము లేదు.

"ఈ సింహపురి శతాబ్దుల నుండియు కవితాకన్యకాట పట్టైయసదృశకవుల కొకరమై వెలయుచు వచ్చినది, వీరిలో మనమిట కవులనుగూర్చి ముచ్చటింప దలంచు కొనలేదు. కాని యితర కవిసార్వభౌములతోపాటు కవితా సౌరభ్యముచే నానందింప జేసిన మొల్లమాంబ జ్ఞాపకార్థమై యామె జయంతిని జరుపుచున్నారము. మొల్ల చిరస్మరణీయురాలై ఆచంద్రార్కముగ యాంధ్రులచే గౌరవనీయ యగుట కామె రచించిన రసోచితంబగు రామాయణకావ్య మొక్కటియే గదా!" (1)

అని మొల్లను ప్రస్తుతించిన విషయము లీమె నెల్లూరిసీమయందు పుట్టిన దని ఎన్నతరము.

## కవయిత్రి కాలము

మొల్ల తన కావ్యమునందు చేసిన పూర్వ కవిస్తుతి వలనను, పద్య రచనా వైఖరులను బట్టియు ఈమె 16వ శతాబ్దికి చెందిన కవయిత్రియని తెలియు చున్నది. కవులు, చరిత్రకారు లెందరో ఈ విషయమై వాదోపవాదము లెన్నియో చేసి యున్నారు. కందుకూరి వీరేశలింగంగారు తమ కవుల చరిత్రలో మొల్ల 16వ శాతాబ్దికి చెందినది చెప్పియున్నారు.

"ఈమె కృష్ణరాయల కాలములోని అల్లసాని పెద్దనాదుల నెవ్వరిని స్తుతియించి యుండుక పోవుటచే మొల్ల ఆ కాలమున కెంతో తరువాతది కాదని స్పష్ట పడుచున్నది. ఈమెకృష్ణరాయల కాలములోనే యున్నట్లు కథలనేకములున్నవి మొల్ల ఆ కాలము నందలిది కాదని సంశయించుటకు హేతువు లేవియు కానరానందు నను ఆ కాలపు కవులను స్తుతింప నందునను ఆమె శ్రీ కృష్ణదేవరాయల కాలము నందే యున్నదని నిశ్చయింప వలసియున్నది." (2)

---

(1) గృహలక్ష్మి 1935-36 పు. 893-914

(2) ఆంధ్రకవుల చరిత్రలు— పు. 58159

తరువాతి చరిత్రకారులును మొల్ల క్రీ. శ. 16 వ శతాబ్దియందే జీవించి యున్నట్లు నిదర్శనములతో నిరూపించి యుండుటచే ప్రస్తుతమునకు మొల్ల జీవిత కాలమును గురించి ఎట్టి సందేహములు, అపోహలు లేవనియే తోచుచున్నది. కొన్ని ఉదాహరణమున కింద తెలియ జేయుచున్నాను.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము ఆచార్య మామిపూడి వెంకటరంగయ్య ఆంధ్రవాఙ్మయ చరిత్రమున కాశీనాధుని నాగేశ్వరరావు, సమగ్రాంధ్ర సాహిత్యము ఆరుద్ర, హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్‌లో చెంచయ్య భుజంగరావులు, విక్రమ సింహపురి మండల సర్వస్వమున నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి, తెలుగు వాఙ్మయ సంగ్రహ చరిత్రలో కూర్మా వేణుగోపాలరావు, ఆంధ్రసర్వస్వమున మాగంటి బాపి నీడు, ఆంధ్ర విజ్ఞానమున ప్రసాద భూపాలుడు, కవితరంగిణి 9వ సంపుటిలో చాగంటి శేషయ్య, నెల్లూరిజిల్లా మాన్యూలునందు బాస్వెలుదొర, పూర్వకవుల చరిత్రమున, బొడ్డికూర వేంకట రంగకవి, దక్షిణహిందూస్థానపు కవుల చరిత్రలో కావలి వేంకటరంగస్వామి సారస్వత వ్యాసములు ద్వితీ. యందు పురిపండఅప్పల స్వామి ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహమున ఖండవల్లి లక్ష్మీరంజనం ఆంధ్ర కవయిత్రులలో ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, ఆంధ్రదేశము స్త్రీలు—అల్లాడి వైదేహి, అబలాసచ్చరిత్ర రత్నమాల ద్వితీ. భండారు అచ్చమాంబ, స్రవంతి జనవరి 72 మల్లాది వసుంధర భారతి అక్టోబరు 63 దేవరకొండ వెంకట కృష్ణారెడ్డి, భారతి, మార్చి 64 నిడదవోలు వేంకటరావు, భారతి డిశంబరు 63 వేదం వేంకటరాయశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, తురగా కృష్ణమూర్తి, భారతి ఏప్రిల్ 64 ముట్నూరి సంగ మేశం, ఆంధ్ర మహిళ మే 51, భారతి ఏప్రిల్ 64 శనగన నరసింహస్వామి ప్రభృతు లెందరో మొల్ల కవయిత్రి కాలనిర్ణయమై గావించిన వాదోపవాదములు మొల్లను 16వ శతాబ్ది కవయిత్రిగ నిరూపించుచున్నవి.

మరియు కావ్యమున మొల్ల వర్ణించిన తీరు తీయములు అష్టాదశ వర్ణనా మిళితమైన కావ్యరచనలు ప్రబలిన ప్రబంధ కాలమునాటిదని పట్టి ఇచ్చుచున్నవి.

సాకేత పురవర్ణనలు, కావ్యనాయికా పరమైన సౌందర్య వర్ణనలు దాహ రణములుగా కొనవచ్చు.

# శైలి

తెలుగు సాహిత్యమును తేనెవంటి తియ్యని మాటలతో ముద్దులొలుకు పద్యములతో రచించి పాఠకుల ముందుంచినది. కడు దీర్ఘములును కఠినములును సమాస భూయిష్ఠములును నైన శైలి తనకు నచ్చదనుచు పూర్వమున్న కావ్యములన్నియు సంస్కృత భాషా మిశ్రితములనుచు తన రచనలోని సారళ్య మేమిటో వివరించినది.

"మును సంస్కృతములఁ దేటగఁ
దెనిగిం చెడిచోట నేమి దెలియక యుండన్...."
"తేనెసోక నోరు తీయనయగురీతి
తోడ నర్థమెల్లఁ దోచకుండ...."
"కందువ మాటలు సామెత.
లందముగాఁ గూర్చి చెప్పనది తెలుగునకుం
బొందై రుచియై వీనుల
విందై మరి కానుపించు విబుధుల మదికిన్"

(పీఠిక 16, 17, 18)

అని చెప్పుటచే ఆంధ్రభాషాభి మానమును ప్రకటించుటయేగాక ఏరీతిగ రచన చేసినచో కావ్యము శైలీ మాధుర్యమును సంతరించు కొనునో స్పష్ట పరిచినది. శరవేగమున కథను నడిపించి శ్రోతల నానంద మానసులుగ చేసినది. కథ మిక్కిలి వేగముగ నడపించినను సాలంకారముగా, పాండితీ స్ఫోరకముగా, పాత్రౌచితికి భంగము రానిరీతిగ మలచినది. అంతి పదములతోకూడి అనల్పార్థ రచనా విభవముతో నొప్పుచు ప్రౌఢకవుల కావ్యముల సరసన నిలిపినది.

ఈ రామాయణము నీమె రచన చేయునాటికి రామకథ లోకమున సుప్రసిద్ధమై నెలకొనినది· కాని ఆంధ్రపాఠకుల అదృష్టమోయననీమె గ్రంధము విఖ్యాతి నందుట విశిష్ట విషయము. ప్రబంధ కావ్య నిర్మాణముతో రచనచేసి తొలి రామకథా రచయిత్రి యనిపించుకొనినది· ఈ విషయమును సమగ్రాంధ్ర సాహిత్యచరిత్ర ఇట్లు తెలియజేయుచున్నది.

"మహామహుల కావ్యాలే నష్టం అవుతూ వుండగా మొల్ల వ్రాసిన రామా యణం దొరకడం జాతి అదృష్టమే. తెలుగు భాషలో కవిత్వం చెప్పిన స్త్రీలలో ఈమె ద్వితీయురాలైన రామాయణ రచయిత్రులలో ప్రథమురాలు" (1)

ప్రశంసలు :- ఇట్టి ఖ్యాతి నార్జించికొనినను ఏలనో పూర్వకవుల స్తుతులలో మనకీమె నామము మచ్చునకైనను కనిపింపదు. ఏకామ్రనాథుడనుతొలి చరిత్ర కారుడు ఈమెను గూర్చి తన ప్రతాప చరిత్రలో పేర్కొనినట్లు సాహిత్య చరిత్ర కారుల యభిప్రాయము. నెల్లూరు మండలమున "గృహలక్ష్మి" కంకణ ప్రదానము నేర్పాటుగావించి జరుపుకొనిన మొల్ల జయంత్యుత్సవములలో మొల్లను గూర్చి పలువురు కవయిత్రులు, కవులు ప్రశంసలు చేసినట్లుగ గృహలక్ష్మిమాస పత్రికలు తెలియ జేయుచున్నవి.

మొల్లను శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారిట్లు ప్రశంసించిరి.

"శైవుని కూతురయ్యు నృపచంద్రుని శ్రీరఘురామ చంద్రుని
ద్భావమునన్ భజించియుఁ బ్రబంధము నాతనిపై రచించియున్
భూవలయంబునంగలుగు పుణ్య చరిత్రల నగ్రగణ్యయై
మావనితాళి కెల్లను యశంబగు మొల్లదలంతు నెంతయున్"

అనియు, శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు మొల్లను గూర్చి

"శ్రీరఘురామ పాదసరసీరుహముల్ మది నిల్పి భక్తి వి
స్తారచణత్వ మేరుపడ పద్దియముల్ రచించి కీర్తను
శ్రీరహిగాంచి మించిన విశిష్ట జనాదరణీయమున్ మహో
దారచరిత్ర మొల్లమ మృదూక్తుల వాకొన నౌనె యేరికిన్"

రతనమట్టుల స్త్రీలలో రహిజనించి
అన్యదుర్లభమైన శ్రీహరి కథలను
కబ్బము నొనర్చి సతులలో ఘనతగాంచె
భవ్యగుణపేటి మొల్ల మాంబావధూటి"

అని ప్రస్తుతించిరి. మరియు, శ్రీమతి కాళ్ళకూరి మహలక్ష్మి సుందరమ్మ

---

(1) సమగ్రాంధ్ర సాహిత్యము. 8వ సంపుటి పు. 110

గారు మొల్లను గూర్చి "కుమ్మరిమొల్ల యను లోక ప్రతీతి వలని నీమెను కులాల కుల సంభూతయని యే మనమును భావింతుము ఏ కులమైన నేమి?

ఈతకు లోతు లేదు జగదీశ్వరు నాజ్ఞకులాతి లేదు వి
ఖ్యాతికిరోత లేదు పరమార్థపు దృష్టికి జాతి లేమ" (1)

అని కడుసంతసముతో ప్రశంసించుట జరిగినది. శ్రీమతి కనువర్తి వరలక్ష్మమ్మ మొదలైన వారెందరో మొల్లను ప్రస్తుతించిరి.

మన్నెపల్లి రామకృష్ణరావు, డాక్టరు కె.యన్.కేసరి, దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి వంటి ప్రముఖుల ఆధ్వర్యమున జరిగిన ఈ జయంత్యుత్సవములలో నిట్లు మొల్ల ప్రశంసల నందుకొనినది.

## రామాయణ రచనావశ్యకత

ఆమె రచన చేయునాటికే శ్రీరామ కథ లోకమున ప్రసిద్ధి చెందినందున తాను మరల రామకథనే తన కావ్యవస్తువుగా స్వీకరించుటకు గల కారణమును మొల్ల ఇట్లు చెప్పినది. "ఆది రఘురాము చరితము

నాదరముగ విన్నఁ గ్రొత్తయై లక్షణసం
పాదమ్మై పుణ్యస్థితి
వేదమ్మై తోచకున్న వెట్టినె చెప్పన్.
రాజిత కీర్తియైన రఘురామ చరిత్రము మున్ గవీశ్వరుల్
తేజమెలర్పఁ జెప్పిరని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్పనేలనన్
భూజన కల్ప కంబగుచు భుక్తికి ముక్తికి మూలమైనయా
రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పుగల్గునే."

(పీఠిక 20, 21)

అని వితర్కించి మరల రామకథ చెప్పనున్నందుకు తగిన కారణమును చూపించినది. ఈమె శ్రీరాముని ధర్మ సింహాసనస్థుడైన ప్రభువుగనే గాక ముక్తి ప్రసాదించు దైవముగా నెంచిన విషయము తెలిసినదే. వారాంగనే పెంపుడు చిలుక చేత రామ నామమును ఉచ్చరింపజేసి తరించినది గాన రాముని కృపకు చదువులు ముఖ్యముగావని భక్తియే మూలమని యెంచి అట్టి శ్రీరాముని కథ గాక ఇతరమైన

---

(1) గృహలక్ష్మి మార్చి, 1935 పుటలు, 839-863.

దానినెట్లు రచింపగలనని తన రచనోద్యోగమును చక్కగా సమర్థించు కొనినది. భక్తి వినయములనే ప్రధానముగా ప్రకటించినది. (పీఠిక 23,24)

## మొల్లరామాయణ రచనా ప్రణాళిక

ఈమె కావ్యము సర్వతంత్రమై అనుపమాన సంక్షిప్తతకు కాణాచియైనది. ఆరు కాండల పరిమితమైన పూర్వ రామాయణము ఏడవ కాండమైన ఉత్తర రామాయణమును కలిసి వాల్మీకము ఇరువది నాలుగువేల శ్లోకములలో విస్తరింప బడినదని విజ్ఞుల యభిప్రాయము, మొల్ల సంక్షిప్త. రామకథా రచనకు పూనుకొనినది. పీఠికాభాగమును, ఆశ్వాసాద్యంత పద్యగద్యములను పరిహరించినచో మొత్తము ఎనిమిది వందల నలవదైదుగ కుదించినది. కథాంశములను దాదాపు ముప్పదియవ వంతునకు సరిపెట్టినట్లు లెక్క. అల్పాక్షరము లందనల్ప శిల్ప ధిషణత్వమును చూపినదనుటకు సుమారు రెండు వందల ఏబది వరకు కందములే కనిపించుచున్నవి. మిగిలిన కథా భాగముల నన్నింటిని నేర్పుతో సంక్షిప్తీకరించినది. ఇటువంటి సంగ్రహ రచనతో ఇతి వృత్తమును నిబద్ధించుట కనేక మార్గము లనుసరింప బడినవి. ప్రధాన కథకు భంగమురాని అనేక ఉపాఖ్యానములను, సన్నివేశములను, పాత్రలను మొల్ల పరిహరించుట జరిగినది.

శాంతాదేవి చరిత్ర, మంథర వృత్తాంతము, శ్రావణ కుమార చరిత్ర, దశరథ శాపకథనము, అహల్యాశాప వృత్తాంతాదులిందు కానరావు. స్వయంప్రభ, వేదవతి, ఇత్యాది పాత్రలు లేవు. విరాధ ఖరాదుల వృత్తాంతములు సంక్షిప్తపరచినది. శ్రీరామునితో, కౌసల్యతో, అనసూయతో సీత గావించిన సంభాషణలు తొలగించినది. ఇట్లు కథాంశములను చాల మేరకు తగ్గించుటకు ప్రధానాశయమైన సంగ్రహణమే కారణము కావచ్చును,

మరియు రామాదుల జనన కాల నక్షత్రములను మార్చుట (బాల 44) అడవిలోచె చెంతలు సీత పొందు మార్గాయాసమును చూచి జాలి చెందినట్లును శ్రీరాముడు సీతకు బంగరు జింక చర్మమును కానుకగాగొని వచ్చినట్లును(అరణ్య 47) (అరణ-3)కల్పించుట, సంపాతియను పక్షికులేంద్రుడు సీతాపహరణమును రామాదులకుతెలుపుట (సుం. 9) రావణుని పాతాళహోమము (యుద్ధ 11) కాలనేమి వృత్తాంతము వంటి అవాల్మీకాంశము లెన్నియో చొప్పించుట సమకాలీనమైన కావ్య

మర్యాదలైన ప్రబంధ వర్ణనలు మేళవించుట ఈమె కావ్యము నందలి విశిష్ట గుణములు. అనన్య సామాన్యమైన శైలితో కావ్యము రసౌచిత్యమునకు పాత్రమగు నట్లు చిత్రించుట ఆమె చాతుర్యమునకు, స్వతంత్ర భావ స్ఫోరకమునకు నిదర్శనము.

ప్రసిద్ధాలంకారికులు చెప్పిన కావ్య లక్షణములను సంతరించుకొనిన దనుట కందలి వర్ణనలే నిదర్శనము. పుర వర్ణన, సముద్ర వర్ణన, పర్వతవర్ణన సూర్య చంద్రుల ఉదయాస్తమయాది వర్ణనలు వెన్నెల రాత్రులు. చీకటి రేలు. వర్ణించి తదను గుణముగా వర్తించిన జార చోరాదుల వర్ణన, కౌసల్యాది కాంతల గర్భధారణ వర్ణన. శృంగార రస వర్ణనలు, విరహ వేదనలు వర్ష ఋతు వర్ణన మున్నగు అనేకాంశాములతో ఒప్పుచు ప్రబంధ కావ్యముగ చెప్పదగి యున్నది మహాకావ్యముగ తీర్చి ఆ యుగ ధర్మముల కద్దము పట్టినట్లు వర్ణించుట మొల్ల కుశాగ్ర బుద్ధికి పాత్ర చిత్రణా నిపుణిమకు నిదర్శనము.

# రెండవ ప్రకరణము

# ఐతిహాస నాయిక సీత

**పాత్ర శబ్ద నిర్వచనము :**

'పాత్రమ్' అను పదమునకు త్రాగుట, రక్షించుట, యోగ్యత అర్హత యను అర్థములు గలవు. 'పాత్రమ్' అనుదానికి ప్రాకృతమున 'పాతర' అని చెప్ప బడినది. సూర్యరాయాంధ్ర నిఘంటువు నందు.

"పాత్ర—పాతర వి. సం॰ పాత్రమ్ ప్రా. పాతర." (1)

పాత్రకత్తియ, పాత్రలాడు, పాతర కత్తె [పాత్ర కత్తియ] అను అర్థములేగాక పాత్రము, భాజనము అను అర్థము కానవచ్చు చున్నది.

"పాత్రకము సం. వి.అ.న. పాత్రము, భాజనము (2) మొత్తము మీద 'పాత్ర' యనగా "నాటక మందభినయింప దగిన నాయకాది నాట్యని యుక్త పురుషాదికమని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొను చున్నది.

దీనికి సంస్కృతమున 'భూమికా' యను పర్యాయ పదమును గలదు. నాట్యాధికృతమైన ఆయా వేషములను పాత్రలందురని అది భూమికా పర్యాయ పదమని హేమచంద్రుడు ప్రయోగించినట్లు శబ్ద కల్పద్రుమము తెలియ జేయు చున్నది.

"పాత్రాణి నాట్యే2ధికృతాః తత్స్వ ద్వేషాస్తు భూమికా"

ఇంగ్లీషు నిఘంటువులందుకు Character అనునది 'భూమికా' పర్యాయ పదమని తెలియుచున్నది.

Characters, s (Personage in a drama) (4) భూమిక అని 'మాని

---

(1) శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. 5వ సం. 308, 309 పుటలు

(2) పైది

(3) శబ్ద కల్ప ద్రుమము. పు. 535

(4) Monier Williams, A Dictionary English & Sanskrit, P. 98

యుర్ విలియమ్స్' అభిప్రాయము. మరియు దీనికి శీలము, వృత్తి, స్వభావము, గుణము, స్వరూపము, మర్యాద, గౌరవములను అర్థములను కలిగి యున్నదిగా వివరింపబడినది.

'ఎన్సైక్లోపీడియా బ్రిటానిక' 'Character' (పాత్ర అనుపదము) "కాల్పనికమైన లేదా నిజమైన వ్యక్తి యొక్క ముఖ్య లక్షణములను, గుణ విశేష ములను తెలుపునది యను అర్థమును సూచించు చున్నది.

Character (Kar'ik-ter), in literature a personage in a novel, short story drama, or poem, the 'Characte'r also denotes the essential qualities and personality traits of a fictional or real individual. The abitity to create compelling and believable Character is one of the literary artist" (1)

మరియు "Steavensions book of quotations" లో Character (పాత్ర) అను పదము ఒక వ్యక్తియొక్క స్వభావమును, నైతిక విలువలను నిర్ణయించిరూప గుణ శీలముల సముదాయమును తెలియజేయునదని చెప్పబడిన అంశము.

"The aggregate of features and traits that form the apparent individual nature or ethical quality" (2)

అని తెలియ వచ్చిన యనేకాంశముల వలన "పాత్ర" యనగా ఒక వ్యక్తి యొక్క ప్రవర్తనను లేక గుణ శీలములను పరిచయము చేయుపదమని చెప్పదగును.

## పాత్రల భేదములు

సాహిత్య జగత్తు నందలి పాత్రలను అనేక విధములుగా విభజింప వగును. స్థూలముగ వీనిని పురుష పాత్రలు, స్త్రీ పాత్రలనియు లేక ప్రధాన పాత్రలు అప్రధాన పాత్రలనియు, నామ మాత్రములనియు వర్గీకరణ చేయ వచ్చును. ఇవిగాక కావ్యేతి వృత్తములను బట్టి సజీవ, నిర్జీవ, దుష్ట, శిష్ట, సనామక, అనామక పాత్రాది భేదముల నెన్నంటినో తెలిసికొను అవకాశము గలదు. స్త్రీ పురుషులలో నున్న గుణావగుణముల నాధారముగా గొని భరతుడు ఉత్తమ,

(1) Ereyiopedia Britauica, Text Intex, p 290.
(2) Steabenson's book I quolations, p 234.

మధ్యమ, అధమ పాత్రలని విభజించే యున్నాడు. దశరూపక కర్త ధనంజయుడు పాత్రలకు చేసిన భాషా నిర్దేశమును బట్టియు ఈ విభజన అతని కంగీకృతమైన దగును. మరియు భరతుడు దివ్య, మానుష, దివ్యమానుషాది పాత్ర భేదములను నిరూపించి యున్నాడు.

ప్రధాన పాత్రలనగా కావ్య కథా నిర్మాణమునకు దోహదకారులైన ముఖ్యపాత్రలు. ఉదా॥ నాయికా నాయకాది వర్గము. సీతారాములు. అప్రధాన పాత్రలనగా కావ్యమున అల్పప్రాధాన్యము గలిగియున్నను కథను కొనసాగించుటకు దోహదము చేయునవి. శబరి, తార, శాంత, మొదలగు పాత్రలను ఉదహరింప వచ్చును. నామమాత్రములు కొన్ని గలవు. మాండవీ, ఊర్మిళా, శ్రుతకీర్తి వంటి పాత్రలు. కావ్యము సంపెట్టి ప్రాశస్త్యము వీనికి కల్పించబడదు. కాని, సన్నివేశము లతో, ముఖ్యపాత్రలతో ముడివడి యుండునట్టివి సజీవపాత్రలనగ కావ్యమునందుగల సంఘర్షణ సమావేశము లందు తమ స్వరూప స్వభావములను చక్కగా నిరూపించు కొని స్వయం ప్రకాశములై యుండు పాత్రలు. ఉదా॥ సీత, మండోదరి, అహల్య ఇత్యాదులు నిర్జీవములు, నిరుపయోగములైన పాత్రలు కావ్యము లందు అరుదుగా కనిపించునవి. రామాయణము నందిట్టి పాత్రలు శూన్యము గాదోచును కుంభకర్ణుడు చెప్పదగునేమో! దుష్టబుద్ధితో ప్రవర్తించి కావ్య కథాంశముల నూహ్యముగా చిత్రింపవలను పడుటకు పయోగకారులైన పాత్రలు, దుష్టపాత్రలు, మంధర, శూర్పణఖ మొదలగునవి. ధర్మమును సముద్ధరించుటకు బద్ధకంకణులై తదను గుణ వర్తనముగల పాత్రలే శిష్టపాత్రలు. అనసూయ, సుమిత్ర, అత్రి, వశిష్ఠాది పాత్ర లన్నియు ఇందులకు ఉదాహరణములు. నామము కలిగియున్నవి. సనామకములయి నచో నామరహితములైనవి అనామకములని తెలియుచునే యున్నది. నిగమశర్మ అక్క, అగస్త్యభ్రాతాదు లిందుకు ప్రబలోదాహరణములు. ఇట్లు కావ్యములు అనేక పాత్రల సమన్వయమై ఒప్పుచున్నవి.

కావ్య శరీరమునకు ఇతివృత్తము ప్రధానమని భరతుడు చెప్పినప్పటికి పాత్రలు కావని చెప్పరాదు. రెండును అవినాభావ సంబంధము గలిగియున్నవి. అందుచే ఒకదాని వలన మరియొక దానికి న్యూనత్వము కలుగునట్లు కావ్య రచన యుండకూడదు. శక్తిమంతము చలనశీలమునైన మానవుని పాత్ర చిత్రించుటకు నేర్పు చాల అవసరమని మన కావ్యము లెరుక పరచుచున్నవి రసౌచిత్యముతో నొప్పుచు కవి యొక్క ప్రతిభా పాండిత్యములకు నికషోపలముగా పాత్ర చిత్రింప

బడవలెను దేశ కాల పరిధులకు సన్నిహితత్వము కలిగిన భాషావిరూపణమును పాత్ర చిత్రణకు ఎంతేని అవసరము.

పాత్ర చిత్రణ మనగా పాత్రల భౌతిక, మానసిక స్వభావములు కథకు వన్నె పెట్టునవిగా, ముందుకు నడిపించునవిగా ఉండుట సామాన్య లక్షణము. ఒక కావ్యము చదువునప్పుడు ఆ పాత్రలు, పాఠకుని మనోనేత్రము ముందు స్పష్టమయిన రూపురేఖలతో ప్రత్యక్షము గావలెను. కవి అట్లు తన పాత్రలను పాఠకుల ముందు నిలిపినప్పుడద్దానిని సజీవ పాత్ర చిత్రణ యని ప్రశంస పొందగలదు. ప్రాచినేతిహాసములైన రామాయణ భారతము లందలి కథా వస్తువునకు నేటి జీవన పరిస్థితులకు సమాజ స్థితిగతులకు కొన్నివేల సంవత్సరములు అంతరమున్నను అందలి పాత్రలు నేటికిని సజీవ వ్యక్తుల వలె దర్శన మిచ్చుటకు ఆయా పాత్రల స్వరూప స్వభావ చిత్రణలే ముఖ్య కారణమని చెప్పుట కెట్టి సందేహమును లేదు. మానవులలోని సద్గుణములు, దుర్గుణములు, ఉద్వేగములు, ఆవేశములు, కక్షలు, కార్పణ్యములు, ఔన్నత్యములు బలహీనతలు ఆయా పాత్రల స్వభావములలో స్పష్టముగ రూపింప బడుటచేతనే రామాయణ భారత కావ్య పాత్రలు నేటికిని మానవ స్వభావములకు, ఆదర్శములకు, ప్రతిబింబములై నిలిచి యున్నవి. త్రికాల వేదులగు మహర్షులు వాల్మీకి వ్యాసులు వారి కావ్యములలోని పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసిరి. అట్టి ప్రాణ ప్రతిష్ఠలే నేడు పాత్ర చిత్రణయని వివరణచేసి విమర్శించి గుణ దోషములను పరిశీలించుట జరుగుచున్నది.

## రామాయణ కావ్య పాత్రల పరిచయము

శ్రీమద్రామాయణము బహు పాత్ర సమన్వితమై సంశోభిత మైనది, పాత్రల మనస్తత్వములను వివిధ దశలలో సునిశితముగ దెలియగోరిన వారికి రామాయణ కావ్యమొక పెన్నిధి. పరస్పర భావ సంఘర్షణలకులోనై దివ్య సందేశాత్మకములైన పాత్రలనేకములు మనకు గోచరమగు చున్న రామ చరితమిది.

వాల్మీకి రామాయణ పాత్రలను గూర్చి శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు రామాయణ మాంధ్రుల కాదర్శ గ్రంథము. అందలి ఉత్తమ పాత్రలన్నియు మన కాదర్శ పాత్రములే, రాముని వంటి రాజు, సీతవంటి భార్య, హనుమంతుని వంటి

బంటు, లక్ష్మణుని వంటి సోదరుడు, భరతునివంటి భక్తుడు, సుగ్రీవుని వంటి స్నేహి. తుడు, దశరథునివంటి కరుణామూర్తి ప్రపంచ వాఙ్మయములో నెందును సృష్టి కాలేదు." అని పలికిన పలుకులు ప్రత్యక్షర సత్యములు. నిత్య నవీనము, అనంత మునైన కాలవాహినిలో యుగములు గడిచినను మానవ సమాజమున ఆదర్శవంత ముగ నిలిచిన పాత్రలివి, మరియొక విశేషమేమన స్త్రీపాత్రల కెక్కువ అవకాశ మును కల్పించి చిత్రించినాడు వాల్మీకి. దాదాపు ముప్పది ఆరు వరకు స్త్రీ పాత్రల నిందు చూడవచ్చును. శ్రీరాముని కర్తవ్యోన్ముఖునిచేసి అతని ఖ్యాతిని భూనభోం తరాళములందు వ్యాప్తి చెందించినవి, ముఖ్యముగా ఈ స్త్రీ పాత్రలనుటకెట్టి సంది ముయలేదు. ఇంచుమించు స్త్రీ పాత్రలన్ని ఇట్టి ఉద్దేశ్యముతో చిత్రింపబడినవే.

శ్రీమద్రామాయణ కావ్యమునందు ధర్మోద్ధరణకై పూనుకొనిన నాయికా నాయకులిరువురును వారి మనో వృత్తుల కనుగుణమైన ప్రవర్తనల ద్వారమున లోకమున కాదర్శముగా నిలిచికావ్యమునకు వన్నెవాసి సంతరించిపెట్టిరి. "ధర్మమేవ జయతే" అని ధర్మమునకు జయము, అధర్మమునకు పతనము ఎట్లు సంభవించునో చక్కగా నిరూపించిరి. ఇటువంటి ధర్మసంస్థాపనము నందు నిరపరాధులైన వారికి నిష్కారణమైన నిందలు, బాధలు ఎదురగుటయేగాక భోగశాలులైన వారు త్యాగ శీలురుగాక తప్పదు. అని నిరూపించివారు. సీతారాములు, ముఖ్యముగా సీతతన పాతివ్రత్య ధర్మముచేత అధర్మము నెదిర్చి నిలుచుటకెట్టి కడగండ్లపాలైనదో రామా యణ కావ్యము చక్కగ నిరూపించినది. సీత రామాయణ కావ్యనాయిక కాని ఒక మహేతిహాసమును సృష్టించిన దివ్యమైన పాత్ర. "ధర్మాదర్థశ్చ కామశ్చనాతిచరామి" అనుచున్న ధర్మసూత్రాల వలన కష్టములలో నెందరో సాధుశీలుర వృత్తములు చిక్కుకొనినవి. ఈ విషయమును రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిట్లుచెప్పుచున్నారు. "ధర్మ సూత్రాలను దృఢంగా బిగించినప్పుడు నడుమ చిక్కినలిగిపోయే కోటానకోటి వ్యక్తులలో సీతమ్మకూడా ఒకతె!" "రామోవిగ్రహవాన్ ధర్మః" అని తెలిసినవారు రాముని ఏమి యనలేరేమోకాని "సీతాదేవి ఇందుచేత పడిన పాట్లు తలుచుకొంటే ఎవరికైనా కడుపు చుమ్మలు చుట్టి తీరుతుంది, మన అనుకంప అంతా ఆమె ప్రక్క మొగ్గుతుంది." అని పలికిన శర్మగారిమాటలు సత్యస్ఫోరకములు, శ్రీరాముడెంతటి మహానుభావుడైనా అతని ధర్మాచరణము వలన సీతకు కలిగిన దుఃఖములు ప్రజ లందరి సానుభూతిని ఆమెపై పునకి మరలించినవి. కాని ఆమె ధర్మాచరణ వైశి

1. రామాయణ విశేషములు - పుట : 14,

ష్ట్యమే ఆమె నంతటి ఉన్నత పథమున చేర్చినదనుట లోకవిదితము, సీత నిర్వ హించిన భూమిక దివ్య సందేశాత్మకమై ఆమెకు దైవత్వమాపాదించి పెట్టినది.

ఇట్లు ప్రధాన పాత్రలలో అగ్రగణ్యమైన సీత భారతీయ సతీత్వమునకు, మాతృత్వమునకు పెన్నిధియై గృహయజమానికి సర్వశుభముల నందించు గృహిణిగ ఆదర్శసతిగ, పుణ్య భారతములోని పూత చరితలలో మేటిగ సంగ్రహ రామకథ యైన "మొల్ల" కావ్యమునందెట్లు చిత్రింపబడినదో సునిశితపరిశీలనతో వాల్మీకముతో తులనాత్మకముగ నిరూపించుటయే ప్రస్తుతాంశము.

"ఇతిహాస ప్రదీపేన మోహావరణ ఘాతినా
లోకగర్భ గృహం కృత్స్నం యథా వత్సం ప్రకాశితమ్"

అనుటచే లోకవృత్తాంత కథనము భారతమైనందున ఇతిహాసముగ చెప్ప నొప్పును. కాని రామాయణము "ఇతిహ ఆస ఇతిహాసః" అనినట్లు గతించిన విష యములను దెలియ చెప్పుచున్నను కుటుంబ జీవన వృత్తమే ప్రధానముగా గలిగి వ్యక్తిగతమైన ధర్మప్రబోధము చేసినది. అందు ఇతిహాస లక్షణముల కన్నను కావ్యలక్షణములే యధికముగా నున్నవని విజ్ఞుల యభిప్రాయము.

"కావ్యం రామాయణం కృత్స్నమ్" అని వాల్మీకి చెప్పిన పలుకుల వల ననే ఇది కావ్యమని స్పష్టమగుచున్నదిగదా! ఇందు దృశ్య కావ్యపరమైన కథా గతులు, వర్ణనలు కాన్పించుచున్నవి. ఉదాహరమునకు సీతాకళ్యాణాధి ఘట్టములు శ్రవ్య కావ్యరచనా విధానముతో కూడిన వర్ణనలకు తావలము కాగా, పాదుకా పట్టాభిషేక, పట్టభంగాది కథనమంతయు దృశ్యకావ్య లక్షణలక్షితమైనది. అందు వలన రామాయణము ధర్మాధర్మ పరిరక్షణతో కూడినదై మహాకావ్యముగా రూపొం దినది. ఇక జరిగిపోయిన చరిత్రను వర్ణించినదిగా చూచినచో ఇతిహాసమే. పై యంశము వలన శ్రీమద్రామాయణ కావ్యమొక ఐతిహాసముగా కూడ చెప్పదగి యున్నది. ఇందలి నాయిక సీత ఇటు ఐతిహాసిక నాయికగా అటు కావ్యనాయికగా కూడ పరిచయ మగుచున్నది. ఈ లక్షణములే గాక మొల్ల తన సమకాలీనమైన సాహితీధోరణులను మేళవించుటచే ప్రబంధకావ్యనాయికగా చెప్పుకొను అవకాశము లేకపోలేదు.

---

1. తిక్కన తీర్చిన సీతమ్మ—సారస్వతా లోకము, పుట : 155
2. శ్రీమహాభారతే ఆది పర్వణి–1–94.

జరిగిపోయిన యథార్థ కథనమైనను మానవ ప్రవృత్తితోపాటు అతి మానుష చర్యల వర్ణనములు కలిగి యుండునది ఇతిహాసమేయని ఆర్యుల భావన. మానవుల కోరికలే కష్టములకు కారణము. తామాసించిన కోరికలను సాధించుటలో ధర్మ విరుద్ధములకు వెరువని మానవుడా సురప్రవృత్తి కలిగి యుండగ ధర్మానువర్తియైనవాడుదై వికశక్తి సంపన్నుడుగా నిరూపింపబడునప్పుడు ఏర్పడుచున్న సంఘర్షణలకు కూడ రామకథ ఉద్దేశింపబడి యున్నందున దీనిని ఇతిహాసమనుట కెట్టి అటంకములేదు. సముద్ర లంఘనము వారధి నిర్మాణము, సంజీవి పర్వతగ్రహణము రావణాది రాక్షసుల మంత్ర తంత్రాది యుక్తులు దివ్యాంశలతో కూడియున్నవి. ఎన్ని అతిమానుష చర్యలు గోచరించినను సామాన్య మానవుల ప్రవృత్తియే ఆసాంతము స్థిరమై నిలిచియుండుట ఇతిహాసము నందలి ఒక విశిష్ట గుణము. మానవుని హృదయములోగల రాగద్వేషముల వలన ఏర్పడిన నీతిని, అవినీతిని రూపుకట్టించుటయే ఇతిహాసము యొక్క ప్రధానధ్యేయము. రెండు భిన్న ప్రవృత్తులకు నడుమ ఏర్పడిన సంఘర్షణము రామరావణ సంగ్రామమునకు దారి చూపినది, ఇతిహాస లక్షణములు సంతరించుకొనినది. సాంసారిక జీవనౌన్నత్యముతో కూడినదై సంస్కృతీ సంప్రదాయబద్ధమైన సాంఘిక మర్యాదలను సమష్టి కుటుంబపు తీరుతెన్నులకు రూపకల్పనమై కావ్యత్వమును సంతరించుకొని రసానందజనకమై శాశ్వత కీర్తి ప్రతిబింబితమై ఒప్పుచున్నది రామచరితము.

ఆమె జీవితమావృత్తమే ఒక ఇతిహాసమును సృష్టించి చరిత్ర ప్రసిద్ధి గాంచుట సీతలోని గొప్పదనము.

అట్టి సర్వలక్షణ సంపన్నమైన ఐతిహాసిక నాయిక అయినసీతలో, కొన్ని కొన్ని సన్నివేశములందు కావ్యనాయికా లక్షణములు ద్యోతకమగుచున్నవి.

"సద్యఃపర నివృత్తి"తో కూడిన కావ్య ఫలితములను లాక్షణికులు దెలిపి యున్నారు. ఉపదేశాత్మకమైన ప్రయోజనమునకు ఐతిహాసిక నాయికయే పేరు వడసినది. లాక్షణికులు చెప్పిన స్వీయాది నాయికా భేదములను బట్టి చూచిన సీత 'స్వీయ' నాయికా లక్షణోపేత.

"సంపత్కాలే విపత్కాలే యాన ముంచతి వల్లభం
శీలార్జవ గుణోపేతా సా స్వీయా పరికీర్తితా"

అని భరతుడు స్వీయ నాయికను పరిచయ మొనర్చినాడు. కృష్ట సుఖాది ద్వంద్వము

లందు ఋజువర్తనము కలిగి సచ్ఛీల సద్గుణములతో నాథునిఅనుసరించి నడచుకొనిన స్త్రీ సీత స్వీయ నాయికా భేదముతో ఒప్పుచున్నది. వలదని వారించినను రాముని ముని వేషధారణను తాను కూడ స్వీకరించి వన గమనము చేసినది. ఉత్తమ స్త్రీ ప్రవృత్తికిది యొక నిదర్శనము. రామాయణ కావ్యేతిహాసము నందు. ప్రముఖ పాత్ర వహించిన స్త్రీమూర్తి.

కావ్యనాయిక శృంగార రస తపస్విని అట్టి రసానందములో మునిగినది కాదు సీత. కేవల కావ్యనాయిక అనలేము. పత్యనురాగాది జీవితానుభవములతో సీత ముగ్ధ, మధ్యప్రౌఢాది నాయికా భేదములన్ని పొందిన సంపూర్ణ వ్యక్తిత్వము, శక్తిమంతమునైన మూర్తి. స్వయం ప్రకాశము గల తన వ్యక్తిత్వమును జగద్వ్యాప్తమొనరించిన సీత ఐతిహాసిక నాయిక. ప్రౌఢత్వముతో తనలోని శక్తి యుక్తుల నన్నింటిని ప్రదర్శించినది జానకి. శాస్త్ర జ్ఞానమును, కావ్య లక్షణములుగా నిరూపితములైన గుణములను పుణికి పుచ్చుకొనినది. మరియు ఐతిహాసిక నాయికలలో అగ్రస్థానమును పొందినది. ఆమె తరువాతనే మరి ఏ కావ్య, ఇతిహాస నాయికలైనను ఎన్నదగినవారు.

శ్రీమద్రామాయణమున గల ప్రతి విషయము కూడా ఈమెను ఐతిహాసిక పాత్రగనే నిరూపించు చున్నవి. జన్మముచే దైవాంశము గలిగినది. జనకుని పుత్రికగ ప్రసిద్ధి నొందింది. రావణ మారణ సంగ్రామమునకు మూలాధారమైనది. ప్రతి నాయకునిచే అపహృతయై సంఘర్షణ సమావేశములకు ప్రధాన కారణమైనది. సీత. మరియు లోకోత్తర సౌందర్యము గలది. ఐతిహాసము నందలి ఇతివృత్త విస్తరణకు కారకురాలైనది. స్వధర్మ పాలనలో బద్ధకంకణమైనది. లోక ధర్మముల ప్రతిష్ఠించినది, ధీరాధీరయై స్వాధీనపతికయై నెగడిన సీత తరతరములలో అనుపమాన గుణాలంకార సంశోభితయై అసమానమైన శక్తి స్వరూపిణిగా పూజలందుకొనుటచే ఈమెను రామకథా రచయిత్రి మొల్ల కూడా ఐతిహాసిక నాయికగా సృష్టించినదనుట నిర్వివాదమైన మాట. అయోనిజయై పవిత్రత పరాకాష్ఠయైన ఈ క్షత్రియ కాంత దివ్యాంశతో ఒప్పుచున్నట్టిది.

సీత త్రిలోక సుందరియై వీర శుల్కముగ ప్రకటింపబడినది. శాస్త్రములను, ధర్మములను తెలిసిన వ్యక్తిగ వాల్మీకి పలుతావుల నిరూపించి యున్నాడు. ఏకపత్నీవ్రతుడైన రామునిచే ఆరాధింపబడిన సుగుణములు గలది. పతిపరాయణయై తాను తరించి అతనిని తరింజేసినది. శారీరకమైన సౌందర్యము అబలగా

పరిచయ మొనర్చుచున్నను అవసరమున్న తావుల యందు నైతికమైన మానసిక బలము ప్రదర్శించుకొని సబలగా నిరూపించుకొనినది. వ్యక్తిత్వము రూపురేఖలను మాత్రమే ప్రదర్శింపక గుణాగుణ స్వభావ ప్రకటన చేసినప్పుడే ప్రత్యేకతతో భాసించును.

అయోనిజమైన సీతకు గల అభిజాత్యమును వ్యక్తిత్వమును మనము 'మొల్ల రామాయణము'న తెలిసికొను అవకాశము చాల తక్కువగా గలదు. కొన్ని కొన్ని సన్నివేశములనే పూర్తిగ పరిహరించినది మొల్ల. మూల రామాయణము నందీమె వ్యక్తిత్వము మిక్కిలి ప్రకాశమానమైనది. అయోధ్యా కాండము నందీమె తన అత్త కౌసల్యతో సంభాషించిన తీరు. ఆమెకు గల లౌకికజ్ఞాన సంపదకు విచక్షణాయుతమైన మర్యాదలకు, ఆలోచనలకు, ధర్మాధర్మ ప్రసంగములకు తావలమై ఆమె వ్యక్తిత్వమునకు నికషోపలములైనవి. అరణ్యమున రావణునితో భాసించిన విధము ఆమె ధీరత్వమునకు దృఢ సంకల్పమునకు పవిత్రభావనలకు ఆలవాలము. మొల్ల ఈ సంభాషణలను సుందర కాండమున వర్ణించినది.

కావ్యనాయికగా కన్పించినను ధీర గంభీర ప్రవృత్తుల పోషింపబడి ఇతిహాస కావ్యనాయికల లక్షణములు రంగరించుకొనిన పాత్ర సీత. పతి వచనమును పెడచెవిని పెట్టి పట్టుదలతో వనవాస మేగినదిగాక తిరిగి పోయి లేదని [illegible] కోరి కష్టములు కొని తెచ్చుకొనినది మానవుని మనుగడలోగల ఒడుదుడుకులను అనుభవసారముగ ప్రజలకు ఎరుక పరచినది. ఉచితానుచితము లెరిగినది, గావుననే అత్తతో వినయముట్టి పడునట్లు మాట్లాడినను అడవికి రావలదనిన భర్తతో మాత్ర మట్లు పలుకలేదు, సమయస్ఫూర్తితో ప్రవర్తింప గల ఉచితజ్ఞత ఆత్మౌన్నత్యము గలది. కర్తవ్య ప్రబోధాత్మకములైన తావులందు కఠిన భాషణలు చేసి ధర్మపరిరక్షణకు పూనుకొనినది. పతి పరాయణయేగాని పతి చేతిలోని ఆట బొమ్మగాదని రుజువుపరచినదామె ప్రవర్తన. తన సతీత్వమును ఆదర్శవంతము జేసికొనినది.

సుఖములు కలిగిననాడు మాత్రము భర్తనుఆదరించి ఆపత్కాలమునందనాదరించుట గాదు. కష్ట సుఖములన్ని కలబోసిన భర్త జీవితమును పంచుకుని జీవించుటయే సతీ ధర్మములని ఆమె ఉద్దేశ్యము.

'అనన్యారాఘవేణాహం భాస్కరేణప్రభా' యథా అనినట్లుసూర్యుని చుట్టుకొని యుండు కాంతి పుంజము వలె తాను తన రాముని ఏ స్థితిలోను విడిచి ఉండలేనిది, భర్త జీవితములో భార్యకు గల భాగస్వామ్యమును నిరూపించుచు అడవికి

రావలదనిన రామునికి చక్కని హితోపదేశము చేసినది.చతురు పాయములతో రాముని ఒప్పించుయత్నములో కృతకృత్యురాలయినది.కొన్ని పట్టుల భర్తను ఈ సడించినది. రాముని యందభిమానమున్న వారికి భార్య నొక బానిసగ భావించు వారికీ మాటలు కర్ణ శూలములుగా దోపవచ్చును. ఇట సీతమ్మ ధైర్యస్థైర్యములతో కూడినరాజస ప్రవృత్తి, కర్తవ్యపాలన యందున్న ధర్మదీక్ష వాక్పటుత్వము ఆమె నొకఐతిహాసిక నాయికగ మనకు పరిచయము చేయుచున్నవి.

ఈ మాటలు రామునికే మాత్రమును బాధ కలిగింపక పోగా ఆమెను ప్రశంసించివాడు. ఆ మాటలు వినిన రామునికి రోషము కలుగలేదనా? కాదు. నీవు లేని స్వర్గము కూడా నాకు వలదనిన సీత తనతో ఇట్లు పలుకుటలోని అంతర్య మెరిగిన వాడు కాబట్టియే.

'నేదా నీం త్వదృతే సీతే స్వర్గో పి మమ2 రోచతే'

నీవు లేనినాడు నాకు మాత్రము స్వర్గము నందలి భోగములైనను రుచింప గలవా? అన్నాడు. వెంటనే తనతో అడవికి వచ్చుటకు సంసిద్ధురాలివి కావలసిన దని పలికి తన భార్య యనురాగమును అభినందించినాడు రాముడు.

ఇట్టి కఠినోక్తు లాడినను భర్తను కించపరచు నుద్దేశముతోగాదు. ధర్మము నతిక్రమింప జూచుచున్న రామునికి ధర్మమును ఉపదేశించుట మాత్రమే. రాజస, తామస ప్రవృత్తులతో అహంకార మమకారములను చాటుకొనెడి అవివేకపు లక్షణము కాదిది, ఆమె సాత్విక గుణసంపన్న, అందుకే అడవికి వెళ్ళనున్న కోడలితో అత్త కౌసల్య తన కొడుకును జాగ్రత్తగ చూడుమని పలుకుచు స్త్రీజనోచితమైన చిత్త వృత్తుల నెరిగించినవుడు ఈ ఆవేశకావేశములు ప్రదర్శింపలేదు సీత, ఆమె వినయ ముట్టినట్లు పలికి అత్తగారి అంత రంగములోని దుఃఖాగ్ని జ్వాలను చల్లార్చు చక్కని సంభాషణలు చేసినది.

భర్తకు దూరమైన భార్య జీవితము శోభాయమానము గాదని తాను తన భర్తను విడిచి యుండుట ఇష్టము లేనందుననే పతి వెంట పయనమైన విషయ మును గమనిముపుమని వినయముతో పలికినది. అనార్యులైన స్త్రీలు మాత్రమేభర్తను కష్టములందు వీడియుందురుగాని కుల స్త్రీ అట్లు చేయదనుచు అనార్యులైన స్త్రీలతో తనను పోల్చవలదని అర్థించినది గాని అత్తగారి మీద మెత్తని పులి వలె పంజా

విప్పలేదు. ఈ హృదయౌన్నత్యము జానకిలోనే గాని మరి యే ఇతర నాయికలో చూడగలము.

మొల్ల స్వీయనాయికా లక్షణ సంపదతో ప్రకాశించుచున్న సీత ప్రవర్తనలకు అవకాశమునే కల్పింపలేదు. వాల్మీకము సీత హృద్గత భావములకు నీరాజనము పట్టినది. బహుశ మొల్ల కవయిత్రి కాలము నాటికి సమాజమున స్త్రీ మూర్తికి గల ఉన్నత భావములను నిరూపించు బుద్ధి నశియించి యుండినదేమో కవులలో. మొల్ల "కవయిత్రి" అయి కూడ సామాజిక వ్యవస్థను ధిక్కరించు ధైర్యము లేనిదై స్త్రీకి సమానత్వమును కల్పించి వ్యక్తిత్వమును నిరూపించు ప్రయత్నము చేయలేదు. సీతాదేవి హృదయౌన్నత్యమునకు పడికట్టు రాళ్ల వంటి ప్రసంగములున్న ఈ సన్నివేశమును చిత్రించు అవకాశమునే కల్పింపలేదు. అయినప్పటికి భర్త ఆంతర్యమెరిగి ప్రవర్తించిన ఇంగితజ్ఞానము కలది యని సూచించి వదలినది.

"శ్రీరామచంద్రుడు రాజ్య చిహ్నంబులు త్యజించి జటా విభూతి వల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై, యున్నంత లక్ష్మణుండు భవాపుత్రికయును దోడం జనుదేర" (మొల్ల "రా" అయోధ్య "కాం" 30)

అని అయోధ్యాకాండమున గల ఈ సీత సంభాషణ నిట్లు సూచించుటలో సంక్షిప్తత గణనీయమేమో గాని సీతాపాత్రచిత్రణ కిది తీరని లోటును కలిగించిన రచన యనవచ్చును. ఆమె వ్యక్తిత్వమునకు ప్రాధాన్యము నీయక ఆమెను పతివాల్లభ్యగ నిరూపించినది. త్యాగశీలగా పరిచయ మొనర్చినది.

## సీతా ద్రౌపదులు

జనక రాజ పుత్రికి ద్రౌపది వలె సంభాషించు ధీరత్వముగాని సంభాషణా నైపుణ్యముగాని లేదని కల్పించిరి రామలింగా రెడ్డిగారు.

"సీతయు ద్రౌపది వలె లోక హృదయహారిణి అయినను ఇంటి దీపము. జగజ్జ్యోతి గాదు. సభలకు బోదు. అట్టి వానిలో ప్రసంగించుటకు శక్తి రక్తి లేని గృహిణి. వాదప్రతివాదములకు సంఘర్షణ ప్రతిఘటమునకు అననుకూల; వచన శైలికి ఆమె పనికి రాదు. శుద్ధ పేలపిండి. బెల్లపు ముద్ద. అల్లము లేదు ఆమె నిర్మాణములో, మిరియము లంతకు మున్నే లేవు."

అని విమర్శించిరి. వారికి ద్రౌపది యందున్న మమకారమట్లు పలికించి యుండునని దోచుచున్నది. ఇద్దరూ క్షత్రియ కాంతలే. ఇద్దరూ అయోనిజలే. ఇద్దరు

వరమ పతివ్రతలే. మహేతిహాస నాయికలే. కాని ఇద్దరి మధ్యలో గల భేదమే పై విమర్శల కాస్కారమన వచ్చును. సీత సాత్విక చిత్తవృత్తి కలది. అహంకార, గర్వాతిశయములతో కూడిన రాజసమును ప్రదర్శించుకొనిన ప్రవర్తనలు ఈమెలో కనిపించవు. రాజస వృత్తితో అటనట గావించిన సంభాషణలున్నను అవి కర్తవ్యో దేశములైన కఠిన భాషలుగానే ఎంచతగినవి గాని పతిని ధిక్కరించి తన అధిక్య మును నిరూపించుకొను ప్రసంగములు కావవి. అడవికి కొనిపొమ్మని అర్థించినది గాని ద్రౌపది వలె తన పతులను ఆజ్ఞాపించినట్లు లేదు. ద్రౌపది సౌగంధిక పుష్పములను కొనితమ్మని భీమునితో పలికిన పలుకులు చూడుడు. ఎంతటి రాజస ముట్టిపడుచున్నదో. నయనముల కింపొదవించిన ఆ ఉత్పలములు తనకు చాల లభించిన ఎంత బాగుండునను తలంపులో భీమసేనుని చూచి.

"ఇట్టి కుసుమంబులు కడుం బెక్కులు కావలవదే 1 యని కుటుంగటం గలవేని దెచ్చి యిచ్చి నాకు మనః ప్రియంబు సేయుము"2 అని ఒక మహారాణి వలె ఆజ్ఞాపించినది గాని మమతానురాగములు గల భార్య లాలనవలె గాని, అభ్యర్థన వలె గాని యున్నదా?

మొల్ల కావ్యమున బంగరు లేడిని అభిలషించిన సీతాదేవి మనో గతాభి ప్రాయములు కనిపెట్టిన రాముడే స్వయముగ బయలుదేరినాడు బంగరు జింకను భార్యకు కానుకగా నిచ్చుటకు.

"అని కనుగొన్న మున్ని, జన్నంబుల మన్ననంబులు"

.... .... .... ...."

—మొల్ల 'రా' అరణ్య 'కాండ' 30.

అని పలికిన పలుకులలోననే జానకికి, పాంచాలికి గల భేదము విశద మగుచున్నది. మొండి పట్టుదలతో భర్త నువేధించుటగాని ద్రౌపదివలె అజ్ఞాపించుట గాని చూడము. తన భార్య ఆంతర్యము నెరిగిన రాముడే దానిని కొనితెచ్చి ప్రియ సతికి సమర్పింప బూనుటలో గల అనురాగ వాత్సల్యములు ప్రకటింపబడినవి, ఒకరి హృదయమును మరియొకరర్థము చేసికొని ఆదర్శవంతమైన జీవితమును గడిపిరి. అట్టువంటిది వారి ప్రణయ జీవితము.

---

1. పంచమి, పుట : 74.
2. భారతము, అరణ్య -: 3-311.

వాల్మీకమున గూడ సీత ఇప్పట్టు బంగరు జింకను కొనితెమ్మని ద్రౌపది వలె పతి నాజ్ఞాపించలేదు. ఆ మృగము యొక్క రూపురేఖలు ముదము కూర్చు చున్నవని దానిని బట్టిదెచ్చిన, ఆ యందచందములను అయోధ్యలో కౌసల్యాది అత్తలుచూచి వినోదింపగలరని దానినేదో విధముగ కొనితెమ్మని ప్రియోక్తులతో కార్యాచరణకు పూనుకొనునట్లు చేసినది. ఇరువురి ధ్యేయముకూడ కోరిన వస్తువును కొంగున మూట కట్టుకొనుటయే. కాని ఇద్దరి సంభాషణా వైవిధ్యము వలన సీతయే మిక్కిలి నేర్పుగలదిగా నెన్నతగును.

సీతకు సభలలో మాట్లాడు నేర్పు లేదనినారు రెడ్డిగారు. సభలకు వెళి ప్రసంగింపలేదు. కాని రాముని అరణ్యగమనమును అనుగమించినప్పుడామెలోని సుగుణములు చూచి సభలోని ఆర్యజనులందరును ప్రసంగించునట్లు ప్రవర్తించినది. మాటలకంటె చేతలు గొప్పవేగదా! మిరియపుగింజ ఆకారములో నల్లదనము గలిగి అంతర్యములో ఎంతయో ఘాటు కలది. జానకీరాముల ప్రణయమును అంత ఘాటైనదని నిరూపితమే.

మరి ద్రౌపది అటనట పతులను ధిక్కరించి అనాదర దృష్టితో పలికిన పలుకులును గలవు. అందుకే ధర్మరాజొకపరి ఆమె నిట్లు వారించుట జరిగినది.

.... .... నాథుల దూరంగ రాదు వినుము.
.... .... .... ....” 1

అని మరియు,

“పలువోకల బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపుచాడ్పున నిచటం (2)
.... .... .... ....”

అని మందలింప వలసిన అగత్యమేర్పడినది. కాని సీత మాత్రము అటు వంటి స్థితిని కల్పించుకొనలేదు. సభలకు పోదు, సంభాషణలు చేయదు. దానివలన ఆమెకు వచ్చిన అనర్థమేమిగలదు? అవసరమున్న తావుల సంభాషణలు చాతుర్య ముతో చేసినది చాలదా? వాక్పారుష్యములో, ప్రౌఢత్వముతో ప్రవర్తించి అందరిలో మందలింపులు పొందు అవకాశము నామె తెచ్చుకొనలేదు. ఆత్మీయతాను బంధ ములతో, ఆత్మజ్ఞాన వికాసముతో వసిష్ఠాది ఆర్యజనుల యొక్క, అనసూయాది పరమ పతివ్రతల యొక్క, భరద్వాజ, అత్రిమున్నగు మహర్షుల యొక్క మన్న

1. భారతము, విరాట పర్వము–1–109.
2. పైది, విరాట పర్వము-2-148.

నల నందుకొన గలిగిన సంభాషణలు చేసినది. ఆమెలోని వినయాది సద్గుణములే ప్రశంసా పాత్రములు, జనకరాజపుత్రీ! సెభాష్ అనిపించినవి.

అల్లము, మిరియము లేదా మెలో అనినారు రెడ్డిగారు రావణాది దూత లతో సంభాషించిన తీరులోగల రాజస ప్రవృత్తి, ఆ మాటలకు గల వాడి బాణ ములుకుల వంటిదనుట నిర్వివాదము. ఎవరితో ఏపట్టున ఎట్లుభాషింపవలెనో బాగు నెరిగినది కాబట్టియే చురకలవంటి మాటలతో రావణుని గుండె లదరగొట్టినది.

ఈమె శుద్ధ పేలపిండి, బెల్లపుముద్దఅనిన సర్. సి. ఆర్, రెడ్డిగారీమెను సమగ్రముగా అర్థము చేసికొనిరనియే చెప్పవచ్చు. పేలపిండికి అ బెల్లపు ముద్ద జత పడినపుడది పేలవముగా గాక రుచి మధురమైన పదార్థముగా మారునుగదా! సంవ త్సరములో ఒక్కసారి మాత్రమే మన కంటికి కనిపించు తినుబండారమది. ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు మాత్రమే తయారుచేయు తినుబండారమిది. మిగిలిన పండుగ లన్నిటిలో తినిన వంటలే తిరిగి తినుచుండుట ఎల్లరెరింగిన విషయము. ఒకప్రత్యేక మైన వ్యక్తిత్వము గలిగి యున్నది సీత యనుట కింతకంటె ప్రమాణమేమి గలదు? తమకు తెలియకుండగనే రెడ్డిగారీమెను చక్కగ ప్రశంసించి యుండిరనుట యుక్తి సహము.

పతిని గౌరవించి గౌరవింపబడినది సీత. ద్రుపదరాజ నందనవలె ఆజ్ఞా బద్ధులను చేసికొని కనుసన్నల నాడింపలేదు. భర్తను కార్యసాధనకు పూన్చి కర్తవ్య పరాయణుని చేసినది సీత. ద్రౌపదివలె అహంభావముతో ప్రవర్తింపలేదు. సీతా ద్రౌపదులిద్దరును శక్త్యంశ సంభవులుగా చెప్పబడినను కేవల ఐతిహాసిక నాయికగా కాక కావ్యనాయికా లక్షణములతో ఒప్పుచు సీత మానవ సమాజమునకు మిక్కిలి సన్నిహితమైనది. ద్రౌపది కేవలము ఐతిహాసిక పాత్రయే. కాబట్టియే, ఇంటికొక సీత వెలసినది. నేటివరకు భారతీయుల హృధయములలో భద్రాసన మలంకరించినది సీతయే.

పతి అంతర్యము నెరిగిన ఇల్లాలుగా ఆ సతి కా నలంకేగినది. భర్తగాని, బంధువులుగాని ఆమెనుగూర్చి చేసిన నిర్ణయము కాదిది. తనకున్న భోగములన్ని టిని త్యాగముచేసి పతిని అనుసరించినదియనగా అంతకంటె భర్తయే ఉన్నతుడని ఆ త్యాగశీల భావము.

"సదా శాంతా సదా శుద్ధా
గృహచ్ఛిద్ర నివారిణీ"

అనినట్లు నిత్యనిర్మల శాంతచిత్తాను వర్తినియు స్వామి చిత్తయు నిరంతర శుద్ధాచార సంపన్నయునైన సీత కైకేయి వలన గలిగిన గృహచ్ఛిద్రములను దొలగింప భర్తవెంట కారడవులకు ప్రయాణము కట్టినది. వాల్మీకమున కూడ ఆమె నెవరును అడవికి వెళ్ళమని నిర్దేశింపలేదు. తనను వెంటగొని పోనొల్లని రాముని అభిప్రాయ మెరిగినదై తాను వెంట నున్నందువలన ఆ రామునికి గలుగు సుఖ శాంతులను, గౌరవాదరములను. గుర్తింపచేసి అత్తమామలను మెప్పించి పతిని నొప్పించి గడసరి తనముతో అడవికి బయలుదేరి వెళ్ళినది. ఈ కథాంశముల వలన తెలియదగు సీతాదేవి వ్యక్తిత్వము అపూర్వమైనది, వీనిని సమగ్రముగ దెలిసికొను నవకాశము మొల్ల సంక్షిప్తీకరణ వలన కుంటుపడినది.

"సీతా సత్యాచ రుక్మిణీ", అని లక్ష్మీసహస్ర నామ స్తోత్ర కదంబమున మహాదేవులలో నొకతెగా సీత ప్రస్తుతింపబడుట గమనించినచో ఆమె దివ్యశక్తి యనదగినది.

"ప్రణవ ప్రకృతి రూపత్వాత్స సీతా ప్రకృతి రుచ్యతే" (1)

అని "అకార ఉకార మకార నాదబిందు కళాతీతములు అను సప్తాంగ యుక్తమైనది ప్రణవము. అట్టి ప్రణవ రూపము సీత" అని అధ్యాత్మ రామాయణము తెలియజేయు చున్నది.

సీత యనగ ప్రకృతి. అనగ శక్తి. ఉత్కృష్టమైన సృష్టి చేయునది ప్రకృతి, యని అధ్యాత్మ రామాయణము.

"ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టి వాచక సృష్టౌ
ప్రకృష్టా యాదేవీ ప్రకృతి సా ప్రకీర్తితా (2)

శ్రీరాముడు పురుషుడు. అనగ చిత్తు. శక్తి స్వరూపిణియైనది సీత. స్వాతికోపాసకుల చూపులో నీ చిచ్ఛక్తులకు రెండింటికిని సమాన ప్రాధాన్యము గలదు, చిచ్ఛక్తుల సమైక్యరూప చిత్రణమే రామాయణమని నిరూపించినది ఈ రామచరితము.

"ప్రణి పాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా"

—వాల్మీకి.. రామ. సుందర. కాం. 46-27.

---

1. అధ్యాత్మ రామాయణము, పుట: 48, 49
2. పైది — పుట, 46

అనిన వాల్మీకి వాక్కుల వలన ఆమె దేవీత్వ ప్రతిపాదనమే గాక దయాదాక్షిణ్య నిలయగ నిరూపింపబడినది. మాతృ వాత్సల్యమునకు మాతృక. ధూర్తుడైన రావణుని పై కూడ కరుణ చూపించి రక్షింపబూనినదై తన భర్త కరుణాలుడు కాన అతనిని శరణువేడి ప్రాణములు దక్కించుకొనమని సలహానిచ్చిన క్షమాగుణసంపత్తు ద్రౌపదిలో లేదు. ఆమె జుట్టుపట్టి ఈడ్చిన కురు కుమారుని, సైంధవాది ధూర్తులను పరిమార్చు వరకు ప్రతీకారముతో ఎదురు చూచినది.

మొల్ల మాత్రము ఈ సన్నివేశమునందు సీతలో నిట్టి దయాదాక్షిణ్యములు చూపింపలేదు. ధూర్తుడైనరాక్షసేంద్రునిదురాగతములుమన్నించుటలోక క్షేమా. త్పాతకమని ఎంచినదిగ సీతను వర్ణించినది. అందుకే ఆమె చేత ఇట్లు పలికించినది

"అరూఢ ప్రతిమాన విక్రమ కళాహంకార తేజో నిధిన్

.... .... .... ...."

—మొల్ల . రా. సుందర.—67.

ధీరాతి ధీరయై ప్రౌఢవచో ప్రగల్భ్యయై నిర్జన వనమందాతని నిట్లు ధిక్కరించుట యనగ సామాన్య మానవకాంతగ గాక శక్తి స్వరూపిణిగ నెన్నబడినది. ఇట మొల్లమ్మ స్త్రీ హృదయ భావనలను చక్కగ నిరూపించినది.

సీత మానవ మాత్రురాలు కాదు. ఆమె ఒక దివ్యశక్తి అను విషయమున విశ్వనాథవారి వాణి ఇట్లనుచున్నది.

"In this Ramayana, the first word may be either in the masculine or in the feminine, If it is in the feminine, it may not simply mean a women. It mean also the Go-ddes of affluence as it is given as on of the thousand names of the Goddess."

ఎందరో కావ్య, ఇతిహాస నాయికలలో ఏ కొందరికీ దక్కని ఖ్యాతిని ఈమె దక్కించుకొనుటయే ఈ పాత్రకున్న వైశిష్ట్యము. శక్తిని, స్ఫూర్తిని అందిచునట్టిది భార్యయనుటకు, సీతారాములు, పార్వతీ పరమేశ్వరులు, వాణీహిరణ్యగర్భులు-ఈ ద్వంద్వ సమాసములో ముందున్న శబ్దాన్ని పట్టి రెండో పదానికి లౌకి

కము, అధ్యాత్మికమూ అయిన శక్తి స్ఫూర్తి కలుగుతుంది. కాదని వక్ర మార్గాన నిల్చి ఎదిరించే ప్రబుద్ధులకు 'నమోవాకం' ప్రశాస్మహే' 2 అని చెప్పబడిన విషయముల వలన కూడా ప్రకృతి పురుషునికి శక్తిని ప్రసాదించునది యని వ్యక్తమగుచున్నది.

1. What is Ramayana to me, Page : 22.

2. భారతి, 1985, జూన్-పుటః80.

# మూడవ ప్రకరణము

# సీత అభిజాత్యము

## సీత ఎవరు?

ప్రకృతి పురుషులైన సీతారాములను విచ్ఛిక్తుల సమైక్య రూప చిత్రణముగ రామాయణము పరిచయము చేయుచున్నది. కాని, తామసోపాసకులు సాధారణముగ శక్తి పూజారతులు. వారికి చిత్తు అప్రధానము. వారి చూపులో శక్తియే సర్వశక్తి మంతము. రావణాది రాక్షసులు తామసోపాసకుల కోవకు చెందినవారు, అందుకే అయ్యగారిని వదిలి అమ్మగారిని వాంఛించినాడు రావణుడు. శక్త్యుపాసకుడైన ఈ శాక్తేయుడు బ్రహ్మగారికి స్వయాన ముని మనవడు. పౌలస్త్యుని మనుమడు. విశ్ర వసుని పుత్రుడు అనగా నాలుగు వేదములను గురుముఖముగ చదివినవాడు. అతడే గాదు, లంకలోగల రాక్షసులెల్లరు వేదాధ్యయనపరులని రామాయణమే రుజూవు పరుచుచున్నది. సీతాన్వేషణ తత్వర మతియైన హనుమ పలికిన పలుకులే ఇందుకు ప్రబలోదాహరణములు.

'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహేగృహే' అని సుందర కాండమున ఆంజనేయుడు నిరూపించి యున్నాడు. దీనిని బట్టి లంకావాసులైన రాక్ష సులందరు నిత్యాగ్నిహోత్ర విధుల నిర్వర్తించు వేదాధ్యయన సంపన్నులని విదిత మగుచున్నను, దయాసత్య శౌచములు లోపించిన కారణముగ రాక్షసుల వేదాధ్య యన తత్పరత వట్టిలోక విడంబనముగా, భసిత క్షిప్తాజ్యముగా కన్పట్టుచున్నది. అనగా దయా సత్యశౌ చరహితుల స్వాధ్యాయముగాని. శాస్త్ర పరిచయము కాని, వేదాధ్యయనము వలన కలిగిన బ్రాహ్మణత్వము గాని సమర్థింప వీలు కానివని విమర్శకుల అభిప్రాయము. అట్లే శూర్పణక, ఈమె రావణుని సోదరి అమ్మగారిని ఆవలికి నెట్టి అయ్యగారిని వాంఛించినది. అనగా శక్తిని వదలి చిత్తుము చేపట్ట తలంచినది. విచ్ఛక్తుల అవినాభావ సంబంధము వలన ఈమె కోరికయు అప హాస్యము పాలయినది. ఈ సత్యదర్శన నిరూపణమే రామాయణము నందలి సీతా దేవి పాత్ర చిత్రణము.

ఉపనిషత్తులు సీతారాములను పరతత్వ రూపములుగ శక్తిమంతులుగ వర్ణించి యున్నవి. సీతోపనిషత్తునందు సీతమ్మ తత్వ నిరూపణము చేయుపట్టున దేవతలతో నిట్లుసెలవిచ్చినట్లు కలదు—

"దేవా హవై ప్రజాపతి మబ్రువన్‌తా సీతాని కిం రూపమితి. సహూవాహన ప్రజాపతి:— సా సీతా ఇతి మూల ప్రకృతి రూపత్వాత్ సా సీతా ప్రకృతి: స్మృతా వణవ ప్రకృతి రూపత్వాసా సీతా ప్రకృతి రిత్యుచ్యతే—సీతా ఐతి త్రివర్ణాత్మాసాక్షన్మాయా మయినా భవేత్".

అని ప్రకృతి స్వరూపిణిగా సీతను అభివర్ణించినది. ఈ శక్తిత్వమునే దేవీభాగతము ఇట్లు నిరూపించుచున్నది గాయత్రీ రూపమే సీతగా మూర్తిభవించినది.

"మందా హిమవతః సృష్టే గోకర్ణే భద్రకకా
చిత్రకూటే తథా సీతా వింధ్యే వింధ్యాధి కారిణీ.
.... దేవీభాగవతము

గాయత్రీ పటలమందలి అష్టోత్తర శతనామములలో సీతను గూర్చి—
"శుభ్రాంశ వాసా సుశ్రోణీ సంసారార్ణవతారిణీ 160 సీతా
సర్వాశ్రయానంధ్యా సఫలా సుఖదాయినీ వైష్ణవీ విమలా
క్లాల్హామహేంద్ర మాతృ రూపిణీ"

మరియు దేవీభాగవత కర్త 12వ సం. 6 వ అధ్యాయమున గాయత్రీ నామావళిని నిర్దేశించుచు, "జాత రూపమయీ జిహ్వా జానకీ జగతీ జరా (57 శ్లో) దండకారణ్య నిలయా దండినీ దేవ పూజితా మానవీ మధుసంభూతా మిథిలాపుర వాసినీ" (124 శ్లో), రామచంద్ర పదాక్రాంతా రావణచ్ఛేదకారిణీ (137 శ్లో), వ్యాసప్రియా వర్మధరా వాల్మీకి వరసేవితా (144 శ్లో),"1. అని రామాయణ రహస్యములందు చెప్పబడిన విషయములు సీతాదేవి పరాశక్తి స్వరూపమును స్పష్టము చేయుచున్నది.

వాల్మీకి మహర్షి సుందరకాండమున అశోక వనమునందు ధ్యాన సంలగ్న మానసయైన సీతను వర్ణించుచు.

---

1. షోడశి — పుట: 18.

"కృశాం మలిన దిగ్ధాంగీం విద్యాం ప్రతిపదీమివ"

—వాల్మీకి 'రా' సుందర 'కాం' 15-35.

పాడ్యమినాడు ప్రారంభించిన విద్యవలె సీత కృశించిపోయి యున్నదని నాడు కవి. 'విద్యా' అను శబ్దము పరాశక్తి అర్థమును తెలియజేయునది. విద్యాయై నమః అని లలితాసహస్ర నామము. మరి ప్రతిపత్తు నాటి విద్య యనగ పరాశక్తి యని సౌందర్య లహరి విదితము చేయుచున్నదని గుంటూరు శేషేంద్రశర్మగారు—

"షోడశ నిత్యానాం ప్రకృతి భూతాః కకారాదయఃతాశ్చ
షోడశ నిత్యాః శుక్ల ప్రతిపదమారభ్య పౌర్ణమాస్యంత
తిథి రూపాః కృష్ణ ప్రతిపద మారభ్య అమావాస్యం తతిథి
రూపాః తా ఏవ చంద్ర కళాభిదానాః చంద్రకళావే వప్రతిపాదిత
తిధయ ఇతి సుప్రసిద్ధాం"

అని వ్యాఖానించిరి.

సీతను గూర్చి వాల్మీకి పలికిన మాటలలో,

"ఆమ్నాయా నామ యోగేన విద్యాం ప్రశిథిలామివ
దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్"

....వాల్మీకి 'రా' సుందర 'కాం' 15 సర్గ

అనునప్పుడును 'విద్యా' శబ్దమునకు మంత్ర తంత్రాది విద్యలను అర్థమున ప్రయోగింపబడినది. పరాశక్తి యొక్క ప్రతిపత్తు కళయే 'విద్యాం ప్రతిపదీమివ' అనుట కర్థము శర్మగారి ఊహ సీత శక్తి సామర్థ్యములను నిరూపించుచున్నది.

"సీతకు ఈ చంద్ర కళోపమానము బహుళముగా చేయపడినది. అది పునరుక్తి గాదు. ఆమె పరాశక్తి యని సూచించుటకే. 5. స. 26. శ్లో. సుందర కాండమున "అవ్యక్తరే ఖామివ చంద్రరేఖా"అనబడినది. అవ్యక్తరేఖయే ఆత్మకళ. వ్యక్త అనగానే ఈ శాస్త్ర విషయము చప్పున స్ఫురింపవలెను. అది పరిభాష కనుకే అవ్యక్తాయైనమః" అని లలితా సహస్రనామము :

---

1. షోడశి - పుటః 18.

"కామయే త్వాం విశాలాక్షీ బహు మన్యస్వమాం
ప్రియే సర్వాంగ గుణ సంపన్నాం సర్వలోక మనోహరే"
—వాల్మీకి 'రా' సుందర 'కాం' 20-3.

అని రావణుడు సీతను వాంఛించినప్పుడు వాల్మీకి చెప్పిన పలుకులును.

తదున్నసం పాండుర దంత మవ్రణం
శుచిస్మితం పద్మ పలాశలోచనం
ద్రక్ష్యే తదార్యా వదనం కదాన్వహం
ప్రసన్న తారాధిపతుల్య దర్శనం"
వాల్మీకి. రా. సుందర, కాం—13, 68.

అని సీతాన్వేషణకై వెడలిన ఆంజనేయుడు నిన్నెన్నడు కనుకొనెదనో అని తపించి పోయిన సందర్భమున కవి ప్రకటించిన భావములకు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ గారు కుండలినీయోగ విద్యయే సీత యనియు. సుందరకాండయే కుండలినీ యోగ మని నిరూపించియున్నారు. [చూ. షోడశి. పుటలు 41—84 సుందరకాండ కుండలినీ యోగమే) సీతాదేవిని అగ్నిరాముని కప్పగించునప్పుడు. 'రక్తాంబర ధారిణీం' అని ప్రయోగించిన పదము ఈమె దేవీతత్వమును నిరూపించుచున్నది.

"తరుణాదిత్య సంకాశః తప్తకాంచన భూషణామ్
రక్తాంబర ధరాం బాలాం నీలకుంచిత మూర్ధజామ్"
వాల్మీకి, రా. యుద్ధ. కాం. 121-3.

అని వాల్మీకి పలుకుటచేత లోకకళ్యాణార్థమె జన్మించిన ఆదిపరాశక్తి అపరాంశయే సీత.

ఈమె నొక పరతత్త్వముగా తాత్త్వికులు నిరూపించినను సామాన్యులైన భారతీయులీమె నొక ఆదర్శ స్త్రీమూర్తిగ. ఐతిహాసిక నాయికగనే ఎంచినారనదగును. భారదేశ గృహిణులకు గొప్ప ఆదర్శమును అందించి ఉజ్వల మణిదీపముగ భాసించు చున్నది. దయాసత్యములందు, నియమ నిష్ఠాపాలనమునందు, శౌర్య ధైర్యము లందు, సాహసౌదార్యములందు మార్గదర్శియై జీవిత రంగస్థలమున మానవుని పాత్రయేమో చక్కగ నిరూపించినది జానకి. పతిసేవా పరాయణత్వము, ధర్మైక దీక్షనాన్యతో దర్శనీయములైనవి. అట్టి నిరూపమానశీల విభముతో భరత భూమిని భాగ్యవంతము చేసినది.

అనుకూలవతియైన అర్ధాంగిగా షట్కర్మయుతమైన కార్యాచరణలతో ముగ్ధాది నాయికా భేదములతో ఆదర్శవంతముగా జీవించినది. దానినే పరమాశయముగా నెంచినది. సమాజమునకు తన ప్రవర్తన వలన ధర్మ ప్రబోధము గావించి నెనరు పూవుల నివాళులందు కొనినది.

"అహల్యా ద్రౌపదీ సీతా తారామండోదరి తథా
"పంచ కన్యాః స్మరేత్ నిత్యం సర్వపాప ప్రణాశనీః"

అన్నట్లు పతివ్రతలు, ఆదర్శసతులెందరో ఉన్నను ముందుగా తాంబూలము తానే అందుకొనినది. రాజపుత్రియైన సీమె రామాయణ కావ్యరాజమున రాజపత్ని కూడ. "ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి రూపాత్రిగుణాత్మికైవ" అని రామాయణ సారోద్ధారము. 'సకార ఈకార తకార' ములు కలిసి ఏర్పడిన పదము సీత. 'సీత, అను పదమునందు 'సత్యమ్' అను వాచకమున్నదని శ్రీవావిలికొలను సుబ్బారావుగారిట్లు వ్యాఖ్యానించి యున్నారు.

"సేతు వనగా నడ్డగించునది యని యర్థము చేయరాదు. ఏటికో సముద్రమునకో యీ యొడ్డుననున్నవారిని నా యొడ్డున చేర్చుటకు సాధనమైనదని యర్థము గ్రహింపవలెను. దేని సాహాయ్యమున మర్త్యుల మర్త్యులగుదురో యది సతియం. సీతేయం అనుచో నీ యర్థమునే గ్రహింపవలెను. సకారము మీది ఈకారము, తకారము మీది ఏకారము దీయగ సతి యం అని ఏర్పడును. సేతువు చేయు కార్యమే గదా పురుషకారమైన లక్ష్మి సీత చేయునది."2 అని చెప్పిన మాటలు సీతయనగా సంసారార్ణము నుండి యజమానుని తరింపజేయునదని స్పష్టము.

శక్తిమంతమే గాదు ఈ నామము మిక్కిలి పవిత్రమైనదిగా కూడా చెప్పబడియున్నది. గీతామకరందమునందు 'సీతా' అను పదము గీతాశాస్త్రమునకు గల పేర్లలో ఒకటిగ వర్ణింపబడినది.

"గీతా, గంగాచగాయత్రీ సీతా సత్యా సరస్వతీ
బ్రహ్మ విద్యా బ్రహ్మవర్ణీ త్రిసంధ్యా ముక్తి గేహినీ"

'సీతా' అనెడి నామము ఈమెకు అన్వర్థమై యొప్పుచున్నది. 'సీత' యనగ నాగటి చాలు వంటి సక్రమమైన నడవడిక గలది యని అర్థము. జనకుని వంశీయులకు

---

1. రామాయణ సారోద్ధారము, ఉ. కాం. తృ. స. 41.

2. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, బా. కాం. పుటః 637, 38.

ధ్వజము పై సీరము గుర్తుగలదు. అందుచే వారు సీరధ్వజులు. యజ్ఞార్థమై జనకుడు భూమిని దున్నినపుడు సీరాగ్రము వలన భూమి నుండి లభించిన బంగరు పెట్టి యందున్న సీతను జనకుడు పుత్రికగా పొందినాడు. సీరాగ్రము నుండి తాను పొంది నాడు కావున ఈమెకు 'సీత' యనెడి నామకరణము చేసినట్లు విశ్వామిత్రునితో జనకుడు చెప్పియున్నాడు.

"అథమే కృషతః క్షేత్రం లాంగలాదుద్ధితా మయా
క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా"

—వాల్మీకి. రా. బాల. కాం. కాం. 67–13.

మిథిలేశ్వరునకు మిక్కిలి ప్రీతికరమైనదీ నామమని స్పష్టమగుచున్నది. జనక పుత్రి కగా వృద్ధిచెంది జానకియైనది.

ఇక వాల్మీకేతరములైన కథాచిత్రణముల వలన ఈమె కింకను అనేక నామధేయములున్నట్లు విశదమగుచున్నది. మొల్ల రామాయణమున మైథిలికి ఆమె ప్రయోగించిన నామములు అవి ఏర్పడిన విధమును గమనింతము.

**సీతకు గల పేర్లు :**

ఉత్తములైన నాయికా నాయకుల నామధేయములు కావ్యపురాణేతిహాసము లను బట్టి నిష్పన్నములగు చుండును. అనగ తల్లి, తండ్రి, భర్త, దేశ, గోత్రాదు లను బట్టి నిరూపింపబడును.

ఉదా : ఆత్రేయి (అత్రిముని పుత్రి), ద్రౌపది (ద్రుపదరాజ తనయ), పార్వతి (పర్వత నందన), ఆగ్నేయ (అగ్నిభార్య), ఇంద్రాణి (ఇంద్రుని రాణి), బ్రాహ్మీ (బ్రహ్మ ఇల్లాలు) శర్వాణి (శంభుని గృహిణి).ఆంధ్రీ (ఆంధ్రదేశపు స్త్రీ), భార్గవి (భృగు గోత్రజ), ఇట్లే కర్ణాటి, ఘూర్జరి మొదలైన సాధారణ నామములును ఏర్పడుచున్నవి.

**తల్లి పేర నేర్పడినవి :**

అవనిజ [అరణ్య 46], అవనీతనూజాత [యుద్ధ. 116], అవనీతనూ భవ [అరణ్య—40], ఉర్వీతనయ [సుందర-91], ఉర్వీనందన [బాల. 78], ధరణీసుత [బాల. 59]; అయోధ్య—81, ధరాతనూజ [యుద్ధ 3-113], ధాత్రీపుత్రి

[అరణ్య-30], భూపుత్రిక [అయోధ్య-30], భూమిపుత్రి [యుద్ధ 3–118], భూమి [అరణ్య–30], భూమినందన [అరణ్య], 62, సుందర–101], భూవనితాజాత [సుందర–31], వసుధాసుత [అరణ్య–48]. వసుమతీ తనయ [యుద్ధ 3–112] ఇత్యాదులు.

తండ్రి పేర వెలసినవి:

జనకజ (సుందర- 3,9), జనకతనయ జనక రాజతనయ (అయోధ్య–49, సుందర- 117), జనక నందన (అయోధ్య-42, కిష్కింధ–9, యుద్ధ-2-82), జనకరాజనందన (అరణ్య–61), జనకక్ష్మాపతి నందన (అరణ్య-66), జానకి (కాండాది. కాండాంతములు మరియు కిష్కింధి–26. 27, సుందర–82, 245, 247), యుద్ధ- 1-93. 3–1, 124, 137, 138) మొదలగు నామములు తండ్రి పేరు మీదుగ తెలియవచ్చును. భర్తపేర ప్రసిద్ధి నందిన వాడుకలు:

ఇనకుల వల్లభుని దేవి (సుందర–81). రఘువల్లభుదేవి (సుందర-228). రామచంద్రుని దేవి (సుందర–10, 40), రాముని సతి (సుందర–203, యుద్ధ-11). అని సీతాపరమైన పద ప్రమోగములు గలవు.

దేశ సంబంధి · వైదేహి (సుందర-78).

రాజధానీ నగర సంబంధి : మిథిలాధీశు కుమారి (సుందర-84).

ఈమె అయోనిజ జనకుని యజ్ఞవాటిలో లభించిన విషయము మొల్ల ప్రత్యేకముగ నిరూపింపలేదు. కాని "ధరణీసుత" యని (బాల-50) అని చెప్ప బడుటచే నీమెసీరాగ్ర సంజాతగ ఎరుకపడుచున్నది. అన్వర్థమైన నామము సీత యనునది మొల్లకు మిక్కిలి ప్రీతికరమనుటకు సీతా పద ప్రయోగమును అనేక పట్టుల ప్రయోగించుటయే కారణము.

సీత: బాల-59, 70, 81, 82-అరణ్య-5, 40, 51, 56, 57, 60, 63, 66, 89, కిష్కింధ–22, 24, 24" సుందర–9, 24, 39, 42, 43, 57, 58, 68, 82, 85, 90, 125, 210, 222, 243, 248) యుద్ధ–15, 12, 13, 16, 17, 18, 24, 29) యుద్ధ–3-119) మొదలగుచోట్ల సీతా పద ప్రయోగములుండుటచే మొల్లకు 'సీతా' అనెడి నామమత్యంతా మోదమైనదని ఎన్నదగును. మొత్తము కావ్యములో 'సీత' అను పదమును దాదాపు ఏబది తడవలు ప్రయోగించుటయే దీని కుదాహరణము.

"ఈమె మాతులుంగ యను ఫలము వలన కలిగినది గాన మాతులుంగి యనియు. పద్మాక్షుడను రాజపుత్రి గాన పద్మ యనియు అగ్నియందున్నది గాన అగ్ని గర్భ యనియు, రత్నరాజిలో దాగినందున రత్నావతి యనియు పిలువబడు చున్నదని" ఆనంద రామాయణము పేర్కొన్నది. ఎవ్వరెన్ని పేర్లు పెట్టినను జగత్ప్రసిద్ధి నందినది "సీతా" నామమే.

"పుష్పములెన్ని యున్నను మల్లెకు గల మధుర పరిమళము మల్లెదే. సంపెకు గల సౌరభము సంపంగదే. అల్లే నాగటి చాలున దొరికిన బాలకు కావలెనని కోరి యెవరెన్ని పేర్ల నెట్లు పెట్టుకున్ననేమి? ఆ "బాలిక"కు 'సీత' యను నామమే రూఢమై పోయినది. సీత యను నామము జిహ్వాగ్రమున నిలువగనే యొడలు పులకరించును. మనసు మయూరమై నటనము సాగించును. తదితర నామములన్నియు నాయా యర్థములకు సంకేతములుగా నాయా సన్నివేశములలో మాత్రమే యుపయుక్తమగు చుండును. సీత యను పేరు మాత్రము సన్నివేశముతో గాని, పెనపైచుకొని యున్న ప్రత్యేకార్థముతో గాని సంబంధము లేనిదాని వలె సహజ నామమైనట్లుగ యొప్పారుచుండును."1

అని పలికిన కల్లూరి చంద్రమౌళిగారి పలుకు లెంతయో సమంజసములై ఒప్పుచున్నని. నాగేటిచాలు నుండి పైకి లేచి జనక చక్రవర్తి ముద్దు బిడ్డయై లోకమున అందరి మన్ననలకు జానకి పాత్రురాలయినది. పేరులో నున్న గొప్ప దనమును ఆచరణలో నిరూపించుకొనినది జానకి.

## సీతాదేవి జన్మవృత్తాంతము

సీతాదేవి జన్మ విషయములను మొల్ల తన కావ్యమున చాల సంక్షిప్తమొనర్చి సూచనా మాత్రముగ వర్ణించినది. ఈ సూచన సరిపోవునని ఆమె విశ్వాసము. తాను రచన చేయు నాటికే రామకథ లోకమున ప్రసిద్ధముగ నెలకొన్నది గదా! తన రచనా ప్రణాళిక కిట్టి సంక్షిప్తీకరణ మెంతేని అవసరము. సీతమ్మ జన్మ కథనము ఇతరమైన రామాయణములో మార్పులు చెందియున్నవి. మొల్ల వాని నాదరింపక వాల్మీకి కావ్యముననే మిక్కిలి సన్నిహితముగా చిత్రించి చూపినది. అందుకే సీతను సీరోద్భవగా పలికినది—

---

1. సీతామహాసాధ్వి, పుట : 21.

"ధరణీ సుతయగు సీతకు
పరిణయ మొనరింప జనక పార్థివు డిల."
—మొల్ల 'రా' బాల 'కాం—55'

కావ్యకథనమునకు తగినంత వరకే స్వీకరించి మిగిలిన యంశములను పరిహరించినది. పూర్వజన్మ వృత్తాంత కథన మెక్కడ ప్రస్తావింపలేదు. అయోని జగ మాత్రము నిరూపించినది. సీతా కళ్యాణ సందర్భమున జనకుడు వధువును వరుని కప్పగించునప్పుడు "తన కూతు సీతను శ్రీరామచంద్రునకు" (మొల్ల రా. బాల. కాం. 82) అని చెప్పినందున జనకుని ఔరస పుత్రిక వంటిదని స్పష్ట పరిచినది.

యుద్ధకాండమున విభీషణుడన్నకు నీతిగరపునప్పుడు సీతాదేవిజీవితౌన్నత్య మును గూర్చి ఆమె శక్తి సంపదలను గూర్చి సూచించుట జరిగినది.

"శ్రీరామచంద్రు డాది నారాయణుండు సీత యాదిలక్ష్మి. వానరబలంబు బృందారక సందోహంబు గావున నీవు శ్రీరామచంద్రున కెదిరి జయంబుగొనుట కడింది కార్యంబు" (మొల్ల. రా. యుద్ధ. కాం. 1-24] అని పలికిన పలుకుల వలన సీతాదేవి లక్ష్మ్యంశయైన ఒక దివ్యశక్తిగ నిరూపింపబడినది, ఈ విధంగా కథాంశ ములను ఆకళింపుతో సాధ్యమున్నంత వరకు నేర్పుతో కుదించినది.

'సీత' జననమును గూర్చి వాల్మీకి తన కావ్యమునందు పలువురు వర్ణించి చెప్పుట జరిగినది. జనకుడు స్వయంవరము చాటినప్పుడు రామలక్ష్మణులతో కలిసి విశ్వామిత్రుడు మిథిల కరుదెంచినాడు. అతనితో జనకుడు తన పుత్రి అయోనిజ కావున ఆమెను వీరశుల్కముగా ప్రకటించితినని విల్లెక్కిడిన సత్వసంపన్నునికే కూతు నిచ్చెదనని పలికి సీతాజన్మ వృత్తాంత మెరిగించెను. మరియు అరణ్యమున ఇదే విషయమును సీత చేత అనసూయకు వినిపింపజేసినాడు.

"మిథిలాధిపతి ర్వీరో జనకో నామ ధర్మవిత్

.... .... ....

పాంసు కుంఠిత సర్వాఙ్గీం జనకో విస్మితో 2 భవత్"
—వాల్మీకి. రా. అయోధ్య. కాం. 118-27, 29

శాస్త్రోక్తరీతి యజ్ఞార్థమై జనక చక్రవర్తి భూమిని దున్నుచు క్షేత్రమున బీజములు చల్లుచున్నప్పుడు ఆ నాగటి చాలునందు ధూళిధూసరితమై యున్న నేను

అతనికి లభించుటచే మహానందముతో అతని బిడ్డవలె ఆదరించినాడని జానకి పలికినది. పైన చెప్పిన అంశమునే పలుతావుల వాల్మీకి వర్ణించి యున్నాడు. ఎన్నిమార్లు చెప్పినను దీని సారాంశము సీత ధరణి నుండి సముద్భవించుటయే. కాబట్టి దీనిని మొల్ల ఒక్క ముక్కతో చెప్పి కావ్యాంశములు సంక్షిప్తీకరించినది. సీత దైవాంశము గలదని వాల్మీకియు చెప్పియున్నాడు. రావణుని పీడ భరింపలేని ఇంద్రాది దేవతాతతి బ్రహ్మను చేరి అందరు కలిసి ఆ పరమేశ్వరుని స్తుతించి హిత మొనరింపుమని వేడినప్పుడు వారికి రాక్షస భయంకరియగు స్త్రీ ఉద్భవింపబోవుచున్నదని అభయమిచ్చినట్లు యుద్ధకాండ వర్ణనము.

"ఉత్పత్స్యతి హితార్థం వో నారీ రక్షో భయావహా
ఇత్యువాచ మహేశస్తు మమ చేతని నిష్ఠితః"

అను దానిని బట్టి, మరియు అటనట కానవచ్చెడి వాల్మీకి వర్ణనము నందలి ఉక్తుల బట్టియు సీత ఒక దేవ్యంశ సంభూతురాలు అని నిరూపింపతగును. చెర నుండి సీతను విడిపించిన శ్రీరాముడు ఆమెను తానొల్లననుచు —

"నహిత్వాం రావణో దృష్ట్వా దివ్య రూపాం మనో రమామ్"

— వాల్మీకి. రా. యుద్ధ. కాం. 118-24

నీవు దివ్యమైన రూపము గలదానవనినాడు.

ఆంజనేయుడు సీతాన్వేషణ సమయమున ఆమెను కానక, కష్టములు పెలుచై ఆమె ఏ యగ్నియందో దూకి ఆత్మహత్యకు పాల్పడి యుండునని భావించి వెంటనే తిరిగి ఇట్లనినాడు —

"అథవా చారు సర్వాంగీ రక్షితా స్వేన తేజసా
ననశిష్యతి కళ్యాణీ నాగ్నిరగ్నౌ ప్రవర్తతే"

— వాల్మీకి. రా. సుందర. కాం. 55-22

ఆమెను అగ్ని దహింపదు. ఆమె అగ్నిసదృశ యనినాడు. మరియు, సీత యగ్ని ప్రవేశము చేసినపుడు బ్రహ్మాది దేవతలట చేరిరి. ఆ సమయమున బ్రహ్మ సీతారాముల అవతారతత్త్వము నిట్లు నిరూపించి యున్నాడు -

"సీతాలక్ష్మిర్భవాన్ విష్ణుర్దేవః కృష్ణః ప్రజాపతిః
వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుం"

— వాల్మీకి. రా. యుద్ధ. కాం. 121-28

అని వర్ణింపబడిన విషయములవలన సీత రాక్షస వధార్థమై రామావతారము నెత్తిన సాక్షాద్విష్ణునకు పత్నియైన లక్ష్మీదేవిగ స్పష్టపడుచున్నది. బ్రహ్మ ఆ విషయములు రాముని కెరుక పరచుట చేత సీతారాములు మానవ మాత్రులుగనే వ్యవహరించినట్లు తెలియనగును. కాని వారి దివ్యాంశ నిరూపించుటకై కావ్యమున కవి చేసిన ప్రయత్నమున కంటె ఆదర్శమానవులుగ చిత్రించుటయే వాల్మీకి ముఖ్యోద్దేశమని స్పష్టపడినది.

## పూర్వజన్మ వృత్తాంతము

సీతను ఒక దివ్యాంశగ, మానవులలో ఆదర్శ మహిళగా వర్ణించిన వాల్మీకి వలెనే మొల్ల కూడ నిరూపించినది. ఇక ఆమె పూర్వజన్మ వృత్తాంతాదులు చెప్పక పోయినను కలిగిన లోపము లేదని ఆ వృత్తాంతములు మొల్ల పరిహరించి యుండును. వాల్మీకమున సీత పూర్వజన్మ వృత్తాంత కథనములు యుద్ధకాండ, ఉత్తరకాండము లందు వర్ణితమైనవి. (చూ. ఉత్తర. కాం. 17, 51, సర్గలు). రావణ వధార్థమై లంకయందే రావణుని పుత్రికగ జన్మించి మిథిలా తీర భూములకు చేరి కాలకర్మములు కలిసి వచ్చిన తరువాత తిరిగి లంక చేరి రావణుని అతనిని పరిమార్పించిన లోక కళ్యాణిగ వర్ణితము. హిరణ్యకశిపుని పరిమార్చుటకై అతని ఇంట పుత్రునిగా ప్రభవించిన ప్రహ్లాదుని వంటిది సీత.

"సీతా మండోదరీ గర్భ సంభూతా చారు రూపిణీ
క్షేత్రే జాత వయస్యస్య రావణ స్సరఘూత్తమ"

— దేవీభాగవతము-40, అధ్యాయము.

అని దేవీభాగవతమున గల శ్లోకార్థమును పై విషయమునకును బలకముగా నున్నది. సీత మండోదరి గర్భసముద్భవగ దెలియుచున్నది. మేధా దక్షిణామూర్తి గారు వైదేహి అను వ్యాసమున -

"పితా యస్త్వాం దుహితర మధిష్కన్
క్షమయా రేతః సంజగ్మానో నిషించత్
స్వాధో2 జనయద్బ్రహ్మ దేవా
వాస్తోష్పతిం వ్రతపాం నిరక్షతన్"

అని ఋగ్వేదము నందు సీత జన్మము చెప్పబడి యున్నదనుచు పలికిన పలుకులు ఇందులకు ఉపబలకముగా దోచుచున్నవి.

సీత కుశధ్వజుడను వాని పుత్రిక వేదవతిగ నున్నప్పుడు రావణుడామెను చూచి కామించెను. ఆమెచేత తిరస్కృతుడై ఆమెను అవమానింపగ ప్రతీకారేచ్ఛతో లంకానగరము నందే అతని అంతము చూచుటకై సీతగ పుట్టినదని రామాయణ సారోద్ధారము.

— (బాల. కాం. పుట- 400, 401).

"ఏషావేద వేదవతీ నామ పూర్వమాసీత్కృతే యుగే
ఇత్యారభ్య వేదవతీ ధర్షితా రావణానేతికం శప్త్వా"

వేదవతిన్ని కురులుపట్టి ఈడ్చినాడీ దూర్తుడు. ఆ ఘోరపరాభవమును సహింపక వానిని తెగటార్చుటకై పంతము పూని అంతమొందించినదని స్పష్టమగుచున్నది. అశోకవనిలో ఆమె తన నిడుపారు కురులను విరబోసికొని ఒక తపస్విని వలె కన్పించుట మనకు విదితమే. కురులుపట్టి ఈడ్చిన కురురాజనందనుని చీల్చి చెండాడు వరకు ఆ కురులను ముడువనేరనని అవమానాగ్నితో జ్వలించిన ద్రౌపది కూడ ఇట్లే పలికిన విషయము విజ్ఞులకు దెలిసిన విషయమే. ఐతిహాసిక నాయికయైన సీతావరముగా ఇట్టి కథలు వర్ణించి చెప్పుటలో మొల్లమ్మకు శ్రద్ధలేదు.

"కృతేయుగే వేదవతీ కుశధ్వజ సుతా శుభా
త్రేతాయాం రామపత్నీచ సీతేతి జనకాత్మజా"

అని దేవీభాగవతము (16 వ అధ్యాయము) సీత పూర్వజన్మమున కుశధ్వజ పుత్రిక అని స్పష్టపరచుచున్నది.

ఆనంద, అద్భుత, విచిత్ర రామాయణములలో నీమె జన్మము చిత్రకథలతో చిత్రితమైనది. బౌద్ధ, జైన, మరాఠీ రామాయణములందలి వింతలు, విడ్డూరములుగ దోచెడివి. బంగరుపెట్టెలో జనకుని యజ్ఞశాలలో దొరికిన సీత జన్మవిషయమున ఏకీభావము లేదనుచు సురవరం ప్రతాపరెడ్డిగారు. 'జనకస్య కులేజాతా దేవ మాయేవ నిర్మితా' అని వాల్మీకి చెప్పిన విషయములనే తాము అంగీకరించెదమని ఆమె జనకుని ఇంట ప్రభవించినదని దెలిపియున్నారు?

ఈ వ్యాఖ్యానమును మరి ఎట్లు సిద్ధాంతీకరించిరోగాని వాల్మీకము నందు

సీతయే స్వయంగా అనసూయతో తాను భూమి నుండి జనకునికి లభించితినని చెప్పి యున్నది. కాబట్టి సీత జనకుని వంశమందు పుట్టినదిగాదు. అతడు చక్రవర్తి 'రత్న హారీతు పార్థివః' అని అతని రాజ్యము సందతనికి లభించిన భూపుత్రి సీత అతని ఔరస పుత్రిక యనుటకు శాస్త్రములెట్టి ఆటంకమును చూపి యుండవు. అందువలన సీత జనకుని యింట అడుగుపెట్టి జానకిగా జగములకు పరిచయమయినది. అనుటకెట్టి అభ్యంతరములేదు.

## వంశము తాత ముత్తాతలు

'మొల్ల' తన రామాయణము నందు సీతాదేవి జన్మ విషయములు తప్ప అభిజాత్యపరమైన ఇతర వివరములుగాని, బాల్య జీవితమునందలి క్రీడా విశేష ములుగాని చిత్రింపలేదు. వాల్మీకము నందీ విషయములు తెలిసికొను అవకాశము లెక్కువ. సీతను స్వయంవర వేదికపై మాత్రము పరిచయ మొనర్చినది మొల్ల.

జనక చక్రవర్తి గారాబు బిడ్డ జానకియని లోక విశ్రుతమే. ఆమెకు ఆ మహారాజు వంశమర్యాదలన్ని వర్తించుననుట కెట్టి సందియము లేదు. మిథిలా నగరాధీశుని కడకు రామాదుల కళ్యాణపు వేడుకలు జరిపించుటకై దశరథ మహీ పాలుడు వచ్చియుండెను. కులీనులైన నాయికా నాయకుల వంశక్రమములు వివరించెడి ఆచారము నాడు గలదు. జనకుడు కన్యాదాతగ వాల్మీకము నందు తన వంశ వృత్తాంతము వివరించి యున్నాడు. అతని మూలపురుషుడు. వంశమునందలి ప్రముఖులు పరిచయమైన దానిని బట్టి మిథియను చక్రవర్తి మిథిలానగర స్థాపకుడు' ధర్మాతుడు బలశాలి అయిన నిమి కుమారుడీతడు. మిథియను నాతడా వంశములోని మొదటి జనకుడుగా నెన్నబడినవాడు, (ఇతనికి జనకుడను పేరుగలదు) జానకిని పెంచి పెద్దచేసినవాడు హ్రస్వరోముని కుమారుడు. హ్రస్వరోముడు స్వర్ణరోముని కుమా రుడు. కుశధ్వజుడు జనకుని తమ్ముడని తెలియవచ్చుచున్నది. దీనిని బట్టి చంద్ర వంశజుడైన జనకుడీమె తండ్రి.

వాల్మీకమును బట్టి జనకుని వంశక్రమము :

హ్రస్వరోమునికి మనుమరాలు, స్వర్ణరోమునికి మునిమనుమరాలు యని వాల్మీకము విశదము చేయుచున్నది.

'మహారోమ్నస్తు ధర్మాత్మా స్వర్ణరోమా వ్యజాయత
స్వర్ణరోమ్ణస్తు రాజర్షేర్హ్రస్వరోమావ్యజాయత

1, రామాయణ విశేషములు—పీఠిక పుటః7,

తస్య పుత్రస్య ద్వయం బజజ్ఞే ధర్మజ్ఞస్య మహాత్మనః
జ్యేష్ఠో2హ మమతో భ్రాతా మమ వీరః కుశధ్వజః

....　　　　....　　　　....

వాల్మీక. రా. బాల. కాం. 71-3-5, 12, 131.

మహారోముడు
|
స్వర్ణరోముడు
|
హ్రస్వరోముడు
|
జనకుడు | కుశధ్వజారు

సీతారామ కళ్యాణ వైభవము గ్రంథమున.

"చంద్ర వంశ క్షత్రియ జాతయు గౌతమ గోత్రజయునగు సీత సూర్య వంశీయ వశిష్ఠ గోత్రజుడగు శ్రీరామచంద్రుని కన్ని విధముల తగినదే యగును. కావున స్వీకరింపుమని ప్రార్థించుచున్నాము." అని వశిష్టాదులతో జనకపురోహితుడు శతానందుడు సీతారామ కళ్యాణ నిశ్చితమునకు ముందుగా ప్రసంగించుట జరిగినది. దీనిని బట్టి చంద్రవంశ క్షత్రియ కన్యగ, గౌతమ గోత్రజగ స్పష్టమగుచున్నది.

'అంగీరసుడును, అయాస్యుడును, గౌతముడుననెడి త్రయార్షేయ యుక్త గౌతమ గోత్రమందవతరించినద'ని వీరి అభిప్రాయము.

తండ్రి : సీత తండ్రి జనకుడు, జనకనామధేయులు మనకు పురాగాథలలో పలు పురు కానవచ్చుచున్నారు. సీరధ్వజ. ధర్మధ్వజ, దైవరాతి, ఖాండిక్యాది జనక నామములు తెలియవచ్చున్నవి. ఇందరిలో సీతమ్మ తండ్రి ఎవరు? అను సందేహ మొదవుట సహజము వాల్మీకి రామాయణాంతర్గతములైన విషయములు సీరధ్వజ జనకుడే సీత తండ్రి యని స్పష్టము చేయుచున్నవి. హ్రస్వరోముని తనయుడైన జనకుడు తనకు వంశానుక్రమముగా శివధనువు ఎట్లు సంక్రమించినదో చెప్పియున్నాడు.

"దేవరాతి ఇతిఖ్యాతో నిమేషనిమేష్ఠో మహీపతిః

....　　　　....　　　　....

—వాల్మీకి. రా. బాల. కాం. 66—9, 10.

---

1. శ్రీసీతారామ కళ్యాణ వైభవము, పుట—41.

దేవరాతుని తరువాత ధనువు తనకెట్లు లభించినదో జనకుడు దెలపియున్నాడు. తల్లి; భూగర్భము నుండిలభించిన సీతజనకునితనయగ విఖ్యాతి నందినది. భూమిజ భూపుత్రి, అవనీ తనయ. వసుమతీ తనయ ఇత్యాది నామముల వలన భూదేవి సీత తల్లి యని విదితమగుచున్నది. ఉత్తరకాండమున సీత భూవివర ఘట్టమునందు సీత తన తల్లిని ప్రార్థించి ఆమె ఒడిలో తన తలదాచుకొని దుఃఖించినది.

శ్రీమద్రామాయణమున చెప్పిన విషయముల బట్టి జనకుని పెద్ద భార్య సీతను పెంచిన తల్లియని చెప్పవచ్చును. అనసూయతో సీత,

"అనపత్యే న చ స్నేహాదంక మారోప్యచ స్వయమ్

.... .... .... ...."

—వాల్మీకి. రా. అయోధ్య. కాం. 118–30–33.

అనిన మాటల వలన సీతాదేవి సంతానహీనుడైన జనకునికి యజ్ఞభూమి యందు లభించిఅతని పెద్ద భార్యచే మిక్కిలి ఆత్మీయతానురాగములతో పెంచబడినదని స్పష్ట మగుచున్నది. పెద్దభార్య యనుటచే జానకి తల్లిని అనామకముగా పరిచయము చేసి నాడు వాల్మీకి.

ఈమె తల్లి పేరు స్పష్టముగాదు. సీత వివాహ శుభ కార్యములందును ఈమెను పరిచయము చేయలేదు వాల్మీకి.

వాల్మీకేతర రామగాథలలో మనకు లభ్యములుగా నున్న కథాంశములలో సీతాదేవి తల్లి పేరు తెలియవచ్చు చున్నది.

"జనక భామ దిశి సోహ సునయనా

హిమగిరి సంగ జనీజను మయనా"

అని గోస్వామి తులసీదాసు చిత్ర కూటము నందున్న సీతను చూచి వచ్చుటకై జనకుడు అతని భార్య సునయన అడవికి బయలుదేరినట్లు వర్ణించినాడు, సునయనా దేవి సీతతల్లి అని తెలియుచున్నది. కొన్ని జానపద గేయములందును సునయన యని తెలియవచ్చు చున్నది.

ఆనంద రామాయణమును బట్టి సీత తల్లి సుమేధయని తెలియుచున్నది. వివాహానంతరము అత్తవారింట్లకు బయలుదేరుచున్న కొమార్తెల నుద్దేశించి ఆనంద రామాయణములో.

'ఆ సుమేధ వారి నందర దగ్గర చేర్చి చెక్కిళ్ళులను ముద్దు పెట్టుకొని సముత్సాహ వచనాళి వారి బుజ్జగించె కూరిమి మెయి" అన ఉన్నది.

వాల్మీకేతరములలో సునయన, సుమేధ యనియు, వాల్మీకమున జ్యేష్ఠ భార్యయనియు తెలియ వచ్చుటచేత బహుభార్యలు గల జనకుని జ్యేష్ఠ భార్యపేరు స్పష్టముగా తెలియరాదు.

తోబుట్టువులు : తోడబుట్టువు లనగసోదరీ సోదరులు. ఈమె అయోనిజయై కనకుని ఇంట పెరిగినది. అతని ఔరస పుత్రికగ ఆదరింపబడినది.

"వీరశుల్కాం మమ సుతాం సీతాం సురసుతోపమామ్
ద్వితీయా మూర్మిళాం చైవ.... .... ...."

వాల్మీకి. రా. బాల. కాం. 71-13.

అని విశ్వామిత్రునితో జనకుడు పలికినందున సీతకు ఊర్మిళ చెల్లెలుగ స్పష్టపడు చున్నది. సీతాదేవి దొరికి నప్పుడకడు అనపత్యుడని సీత చెప్పియున్నది. మొల్ల తన కావ్యము నందు 'తన కూతు సీతను శ్రీరామచంద్రునకును తన తమ్ముడు కుశధ్వజుని కూతులగు మండవ్యూర్మిళా శ్రుతకీర్తులను భరతలక్ష్మణ శత్రుఘ్నులకు' ను ఇచ్చి వివాహము చేసినాడని చెప్పినది. (మొల్ల. రా. బాల. కాం. 82) దీనిని బట్టి ఊర్మిళ కుశధ్వజుని పుత్రిగ దెలియవచ్చు చున్నది. వాల్మీకేతరములైన రామ కథలిందుకు దోహదములై యుండుడు.

సీతకు లక్ష్మీనిధియను తమ్ముడు గలడని రామాయణ సారోద్ధారమున దెలియవచ్చునంశము.

"సుమేధాయై దదౌరామో ఫలమేకం సమాగతే
తద్భుక్త్వాతు సుమేధాపి ప్రసూతా వత్సరే సుతం
లక్ష్మీనిధీతి తన్నామ జనకః కృతవాన్ స్వయం
తత్ఫలస్యచ నామాధి రామాభిధ మభూ త్తతః"

సీతా వివాహానంతరము శ్రీరామునిచే సుమేధకు ఈయబడిన ఒక ఫలమును భుజించిన పిమ్మట సంవత్సరమునకు ఆమెకు లక్ష్మీనిధి యను కుమారుడు కలిగెనని దెలియుటచే జనకుని పుత్రుడు జానకి తమ్ముడతడని చెప్పవచ్చును.

# బాల్యక్రీడలు

ఈ విషయములు మొల్ల రామాయణమున దెలియరావు. సంక్షిప్తమే అన్నింటికి ప్రధానముగా నెన్నతగును. వాల్మీకియు తగు శ్రద్ధ చూపలేదని దోచును. ఆనంద, అద్భుతాది రామచరితలలో సీత చిన్ననాటి బాల్యక్రీడల వివర్జితముగా కాన వచ్చును. జానపదగేయ రామాయణములు సీతాపరమైన ప్రతి అంశమును గొప్పగా చిత్రించినవని చెప్పవచ్చును. శివధనువునుసీత చిన్ననాటనే చిటికెన వ్రేలితో అవ లకు నెట్టి అటనున్న బంతిని సీత ఆటలాడుట జనకాదులను ఆశ్చర్యమగ్నులను చేయుట అనునది లోకప్రసిద్ధిబడసి యున్నట్టిది.

# విద్యా విషయములు

మొల్ల రామాయణమున విపుల వర్ణనలు లేకపోయినను కొన్ని అంశ ములను బట్టి ఈ విషయమును దెలియవచ్చును.

"తనకు కావలియున్న రాక్షసకాంతల వలన విని చింతాక్రాంతయై
.... .... .... .... వైశ్వానర భగవానుడు సల్లనయ్యె"
—మొల్ల·రా,సుందర,కాం· 220

అని ఆంజనేయుని తోకకు రాక్షసులు నిప్పు ముట్టించినప్పుడు జానకి అతనిని కాపాడు యత్నము చేసినది ఇది ఆమె విద్యావంతురాలనుటకు నిదర్శనము సమయస్ఫూర్తి, ప్రత్యుపకార బుద్ధికలది, ఉచితానుచితము నెరిగినది, రావణుని శపించుటకు తన పాతివ్రత్య మహిమను వెచ్చింపలేదు. పాత్రమెరిగి దానమిచ్చుట ఆమె నేర్చునకు తార్కాణ ఆంజనేయుడామెను మూపునకొని పోగలనని నప్పుడు-

"నీవంత వాడ వగుదువు
.... .... ...."
'దొంగిలి కొనిపోవ దగునే దొరలకు నెందున్...."

మొల్ల. రా. సుందర. కాం. 129, 121.

అని చెప్పుట ఆమె లౌకిక జ్ఞానమునకు నిదర్శనము. ధర్మములు దెలిసినది. చక్కని హితోపన్యాసములీయ నేర్చినదని చెప్పదగును.

వాల్మీకమున సీత గావించిన ఇట్టి సంభాషణల నెన్నింటినో ఆధారములుగా కొనవచ్చును. సంధ్యావందన మాచరించినట్లు.

"తతస్తు జల శేషేణ లక్ష్మణోఽవ్యక రోత్తదా
వాగ్యతా_స్తే త్రయ స్సంద్యాం సముపాసత సంహితా"
—వాల్మీకి. రా. అయోధ్యా. కాం. 87–18.

అని చెప్పబడిన అంశము లీమె గాయత్రీ మంత్రాదులు నేర్చినదిగా పరిచయమగు చున్నది.

"అహం త్వతి మనుశ్చైవ వానరశ్చ విశేషతః
వాచంచో దాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్...."
—వాల్మీకి. రా. సుందర. కాం. 30-16,

సీతాన్వేషణ సమయమున హనుమ ఆమెను చూచిన తరువాత తానామెతో ఏ భాషలో మాట్లాడిన బాగుండునో గదా అని ఆలోచించినప్పుడు ఆమెకు సంస్కృతాది భాషల పరిచయమున్నదని స్పష్టమగుచున్నది.

"అయం వ్యాఘ్రి సమీపేతు పురాణోధర్మ సంహితః
ఋక్షేణ గతః కోస్తితం ని బోధ ప్లశ్లోవంగమ్"

వాల్మీకి. రా, యుద్ధ. కాం, 113-4.

సీతను వేధించిన రాక్షసాంగనలను చంపుట కాతని కనుజ్ఞ యొసగమని హనుమ అడిగినప్పుడు అతని ప్రయత్నమును వారించి పురాణము లందలి ఉపాఖ్యానములు వినిపించినది. అపకారులకునైన ప్రత్యుపకారమే చేయవలెనని సూచించినది

"త తశ్శుభతరే తూణీ ధనుషీ చాయ తేక్షణా
దదౌ సీతా తయోర్భ్రాత్రో ఖడ్గేచ విమతాతతః"
—వాల్మీకి. రా. అరణ్య. కాం. 8–18, 19.

"అయం ధర్మస్సు సూక్ష్మేణ విధినాప్రాప్యతే మహాన్
నివృత్తే నతుశక్యోఽయం వ్యసనా త్కామ జాదిహ...."
—వాల్మీకి. రా. అరణ్య. కాం. 9–9-15.

రామాదులు శరభంగాది ఋషుల ఆశ్రమములయం దున్నప్పుడు ధనుర్భా

ణములుదాల్చి రాక్షసులను సంహరింపబోవుటకై సన్నద్ధులైరి. ఆ విషయ క్రూరుడైనను మన జోలికి రానంత వరకు వానిని దండించు అధికా వరులైన వారికి లేదని ధర్మోపదేశముచేసినది సీత. ఇటువంటి వియనేక బుద్ధి సూక్ష్మతకు ఉదాహరణములుగా నెన్నవచ్చును.

విదేహ రాకుమారి ధరించిన పాత్ర, ఆమెకు గల కుశాగ్రబు పూర్వక కర్మాచరణలు ఆమెనొక విద్వాంసు రాలుగనే స్పష్టము చేయుచ తల్లిదండ్రుల శిక్షణతోపాటు పెరిగిన వాతావరణము కూడ వ్యక్తి హ సంస్కార దోహదములని కేవలము విద్యలు నేర్చిన మాత్రముననే లౌకిక ఆలవడదని ఈమె చరిత్ర చాటుచున్నది.

"పురాయుగేషు నారీణాం మౌంజీ బంధన మిష్యతే
అధ్యపనంచ వేదానాం సావిత్రీ వచనం త దా"

అని వైయాకరణ సిద్ధాంత కౌముది పేర్కొనుచున్నది. దీనివలనపూర్వ యుగములందు స్త్రీలు గాయత్రీ మంత్రములు నేర్చుటయేగాక మౌంజీ బంధనములు ధరించి వేదాధ్యయనములు నేర్చిరని, జపతపముల కర్తలు గలవారని తెలియు చున్నది.

చిరుతప్రాయమున విద్యలు నేర్చిన వారిని సద్యోవధువు లనెదరు. ఆ తరువాత కొందరిని బ్రహ్మవాదినులని పిలిచెదరు. "సద్యోవధువులకు ప్రార్థనలు యజ్ఞయగాదికముల కవసరములైన వేదాది మంత్రములను నేర్పెదరు. అట్టి వారిలో కౌసల్య, తార, సీతలు పేర్కొనదగినవారు. 1. అని తెలియవచ్చు విషయముల వలన సీత విద్యావంతురాలనుట నిస్సంశయమైన మాట. విద్యలు నేర్చుకొనినేర్పిం చినది గూడ.

బ్రహ్మజ్ఞాన విలసుడైన జనకుని ఆత్మజగ జానకి ప్రశంసింపదగిన పాండిత్యము గలది. వైష్ణవీయశక్తియే సీతయనుచు రామాయణ సారోద్ధారము వివరించుచున్నది.

"ఏవం సతి తదా దేవీ ప్రేషయా మాస శైలజా
.... .... .... ....
స్త్రీ ధర్మాన్ శ్రావయా మాస కన్యా ధర్మాంశ్చ వైష్ణవీ.2

(2)

బ్రహ్మాది దేవతలు రాక్షసుల పీడలు భరింపలేక విష్ణుని ప్రార్థింపగ తాన యోధ్యలో దశరథాత్మజుడుగా పుట్టెదనని యోగమాయయే సీతగా పుట్టునని పలికెనని శంకరుడు పార్వతికి తెలిపెను. "వైష్ణవి"యను తన శక్తిని కాత్యాయిని సీతనావేశింపమని పంపినదట. వైష్ణవి యోగినియై అట్లే సీతను చేరి స్త్రీ ధర్మముల నుపదేశించినదని ఎరుక పడుచున్నది.

"జనకస్య గృహే సాక్షాద్బ్రహ్మ విద్యా జనిష్యతి
బ్రహ్మ విద్యాసహాయోఽహం భవతాం కార్యసిద్ధయే"

అనియు విష్ణుదేవుడు వారలతో చెప్పెను. బ్రహ్మవిద్యయే సీతగా పుట్టి రావణ వధార్థము తనకు సహాయపడునని ఎప్పుడు ఆ బ్రహ్మవిద్యను రావణుడా సించునో అప్పుడు తానాతనిని సంహరింపగలనని వాగ్దానము చేసినట్లు రామాయణ సారోద్ధారము.

"నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో నవ్రతం నా ప్యుపోషణం
పతిం శుశ్రూషతేయే నతే నస్వర్గో మహీయతే
వైవాహికో విధిస్త్రీణాం సంస్కారో వైదిక స్మృతః
పతిసేవా గురౌ వాస్తోగృహాస్త్రీఽగ్ని పరిక్రియా"

అని మనుధర్మ శాస్త్రము స్త్రీలబుద్ధి వికసమునకు వివాహమే ప్రధాన కారణమను చున్నది. స్త్రీలకు యజ్ఞయాగాది క్రతువులతోగాని, ఉపవాసాది దీక్షలతో గాని పనిలేదు. పతి శుశ్రూషలతో కూడిన వివాహ విధియే వైదిక సంస్కారమని, గురుకుల విద్యాభ్యాసమని గృహకృత్యములే అగ్ని కార్యములని చెప్పుట వలన పతివ్రతా నుశీలయైన సీత పండితురాలనుట కెట్టి సందిగ్ధము లేదు.

## దానశీలము గలది సీత

'పూజకొద్ది పురుషుడు దానంకొద్ది బిడ్డలని' భారతీయుల భావన. సత్కార్మాచరణ పరులు దానధర్మములు పాలించుట మానవత్వ నిరూపణమనదగును. (పాత్ర మెరిగిన దానమే సుమా!) సీతారాములు అడవికి బయలుదేరు ముందుగ బ్రాహ్మణుల

1 రామాయణ కాలంలో భారతీయ సంస్కృతి, పుటలు 219, 220.

2. రామాయణ సారోద్ధారము. బాల. ద్వి.భా. 12 సర్గ 60-64.

సత్కరించినట్లు వాల్మీకము పేర్కొనుచున్నది. 'యథా శక్తిదాన్నేనా సర్వభూతాని' అని శాస్త్రములు చాటుచున్నవి గదా!

శ్రీరాముడు సుయజ్ఞాది బ్రాహ్మణుల పూజించిన పిమ్మట సీత రామునితో చెప్పి సుయజ్ఞుని భార్యకు తార హారాదులిచ్చినది.

"సుయజ్ఞం తదోవాచ రామస్సీతా ప్రచోదితః
హారం చ హేమ సూత్రంచ భార్యాయై సౌమ్య హారయే
.... .... .... ....
పర్యంక మగ్ర్యాస్తరణం నానారత్న విభూషితమ్
తమపీచ్ఛతి వై దేహీ ప్రతిష్ఠాపయితుం త్వయి"

—వాల్మీకి. రా. అయోధ్య. కాం. 32-6-9.

శ్రేష్ఠములైన తారహారములను, భుజకీర్తులను, కుండలములను, బంగరు మొలత్రాడును మాత్రమే గాక చక్కగా అలంకరించిన పర్యంకమును గూడ సీత సుయజ్ఞుని భార్యను పిలిపించి దాన మొసగినది. సీతారాము లిరువురును కలిసి సుయజ్ఞునికి ప్రదక్షిణ లాచరించి బ్రాహ్మణాశీర్వాదమును గైకొనిరి. 'సతిలేని దానము పతిలేని స్నానము' నిరుపయోగము లంటున్నవి కావ్యములు. అత్తమామల ఆశీర్వాదములు గొనుట సీతాపతి యొక్క వినయ శీలమునకు తార్కాణములు. 'సస్త్రీకో ధర్మమాచరేత్' అనుచున్న శాస్త్రమును వీరిరువురును ఆచరణలో పెట్టిరి.

## దాక్షిణ్యనిలయం:

'సత్యం వద ధర్మం చర' అను శ్రుతి ప్రమాణబద్ధ వాక్యములకు ఆకరమైన విశుద్ధ చారిత్రము గలది సీత. ఆమె ధర్మములను బాగుగ నెరిగినది.

"అథాబ్రవీ త్తదా సాధ్వీ సీతా సర్వాఙ్గ సుందరీ
.... .... .... ...."

—వాల్మీకి. రా. సుందర. కాం. 42—8-10.

రావణుని ఆజ్ఞగొని రాక్షసాంగనలు సీతను చేరి దండించిరి. హనుమతో మాట్లాడుచున్న విషయములు పసిగట్టిన రాక్షసులు అతనిని బాధించి, చంపగలరని

దెలిసినందున అతనిని రక్షింపదలచినది. అందుకే సీతో మాట్లాడు వాడెవడని అడిగిన వారికి అతడెవరో తనకు తెలియదని, రాక్షసులు మాయలు నేర్చినవారు కాబట్టి రాక్షసుల మాయలు రాక్షసులకే ఎరుక అన్నట్లు ధైర్యముతో పలికినది. "ప్రాణ విత్త మాన భంగంబు" లందు బొంకవచ్చని కావ్యములు నిర్దేశించు చున్నవిగదా" సూక్ష్మగ్రాహి సీత యట్లు పలికి అతనికి ప్రాణదానము చేసినది. మరియు.

"పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ
కార్యం కరుణమార్యేణ నకశ్చిన పరాధ్యతి"

—వాల్మీకి.రా.యుద్ధ.కాం.116-44

హనుమంతుడు రాక్షస స్త్రీలను వధించెదనని పలుకగా పాపులపైనను శిక్షింపరాదనుచు, అది వారి దోషముగాదని, స్వామిభక్తి పరాయణులైన సేవక ధర్మములు నిర్వహించిరని విశదీకరించి వారిని చంప వలదని వారించుట ఆమె దాక్షిణ్య గుణమునకు ప్రమాణము. "ప్రియ వాదీచ భూతానాం సత్యవాదీచ రాఘవ"

(వాల్మీకి.రా.అయోధ్య.కాం, 2-321)

అను రాముని ఇల్లాలు సీత. అయినప్పటికి శ్రీరాముని కంటె సీతమ్మకే మిక్కిలి కరుణ కలదనుటకు.

"నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి నను బ్రోవమని చెప్పవే" అనిన సంకీర్తనాచార్యుని మాటలు ఉపబలకముగా నున్నవి.

## దైవభక్తి పరంపరాలు

నిత్య దేవతారాధనలు, దైవభక్తి, పాపభీతి గలది జానకి, అని వాల్మీకము.

"పతిసంమానితా సీతా భర్తా రమ సితేక్షణా
పుర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః
వరుణః పశ్చిమాశాం ధనేశ స్తూత్తరాం దిశమ్"

—వాల్మీకి.రా.అయోధ్య.కాం. 16-21-24.

శ్రీరాముడు అతని తండ్రి జరుపబోవు పట్టాభిషేకమునకు బయలుదేరు

వప్పుడు సీత అష్టదిక్పాలురు అతనిని రక్షించునట్లు ప్రార్థించినది, ఇలవేల్పులకు పూజలు సల్పినది. పట్టాభిషేకము జయప్రదమగుటకు భర్తతో కలసి అనేక ఉప వాసములు చేసినది. అరణ్యమున నున్నప్పుడు.

"మధ్యంతు సమను ప్రాస్య భాగీంధ్యాస్త్వ నిందితా
వై దేహీ ప్రాంజలిర్భూత్వాతాం నదీ మిదమ బ్రవీత్"

—వాల్మీకి.రా.అయోధ్య.కాం. 52-89-91.

"యదా చరిత కర్మాణి శుభం వాయ దివా2 శుభమ్
....          ....          ....          ....
కాళిందీ మధ్య మాయా సీతా          ....          ...."

—వాల్మీకి·రా.అయోధ్య.కాం· 55-19-21.

తాము చేయుచున్న అరణ్యవాసము జయప్రదముగా ముగించుకొని తిరిగి అయోధ్య చేరినతో గంగా, కాళింది, నదీమ తల్లులకు మద్యమును, మాంసాశనమును నివేదనలు పెట్టగలనని, లక్షగోవులను, అన్నవస్త్రములను భూమిసురులకు దాన మీయగలనని మ్రొక్కినది.

యమునా నది సామీప్యమునను, గంగా తీరమునను గల వట వృక్షాదులను చూచి ఇట్లే మ్రొక్కినది.

"నమస్తే 2 స్తు మహావృక్ష పారయే న్మేపతిర్వ్రతమ్
కౌసల్యాంచైవ పశ్యేయం సుమిత్రాంచ యశస్వినీమ్
ఇతి సీతా 20 జలిం కృత్వా సర్వ గచ్ఛాద్వన స్పతిమ్"

—వాల్మీకి.రా.అయోధ్య·కాం. 55-25

"వివృద్ధం బహూ భిర్వృక్షై శ్యామం సిద్ధోప సేవితమ్
తస్మై సీతాంజలిం కృత్వా ప్రయుంజీతా శివశ్శివా:"

—వాల్మీకి·రా·అయోధ్యా.కాం. 55–7.

కాళింది యొడ్డున గల పెద్ద శ్యామ వృక్షమును చూచి సీత మ్రొక్కినది. తన భర్త వనవాస దీక్ష నిర్విఘ్నముగా ముగించుకొనునట్లు, భర్తతో గలసి

సుఖముగ అయోధ్య చేరి కౌసల్యాది అత్తలను చూచి ఆనందించునట్లు వరమిమ్మని వేడినది. ఇట్లు ప్రతిక్షణము తన భర్తకూ తన వంశమునకు ఉన్నతిని ఆశించి ప్రతిగుట్టకు చెట్టుకు మ్రొక్కినది. ఈ మాటలు కార్యదీక్షతో కూడిన దృఢ సంకల్పమునే గాక దైవము మీదగల విశ్వాసమును, భారత సతి యొక్క చిత్త స్వభావమును ఎరుకపరచుచున్నవి. స్త్రీ సహజ భావనలకు, మానవ నైజగుణములకు ప్రమాణములుగా నున్నవి. ఈమె కార్యాచరణలు మానవుడెంత గొప్పవాడైనను విధి చేతిలోని కీలుబొమ్మయని నిరూపించుచున్నవి.

# నాలుగవ ప్రకరణము

# సీత సౌందర్య వర్ణనము

## స్త్రీ, సౌందర్య - వర్ణనా పద్ధతులు :

"Women in Valmiki" అను గ్రంథమున సీతారామమూర్తిగారు సీత సౌందర్యమును గురించి,

'Sita is not of this world at all. She is a denizen of the Heavenly Abode, nay the Divine Mother Herealf. She choosen to come into this world, If only to set an example to women kind insimple living, high thinking and noble going. She is the crown-gem of unexcelled brilliance, among women of all clines and of all times." 1

అని చెప్పిన పలుకులు సీత సౌందర్యము దేశకాల స్థితులను అధిగమించి ఎల్లరి హృదయములను రంజింప జేయునట్టిదని నిరూపించుచున్నవి. భౌతిక సౌందర్యమునే గాదు, ఆమె మనస్తత్వ నిరూపణమును చేయుచున్నవి.

"సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్
సుందరే సుందరం కావ్యం సుందరే సుదరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరమ్"

"సుందర కాండను నందభివర్ణితుడగు రాముడు సుందరమైనవాడు, కథ సుందరమైనది, సీత సుందరమైనది. వనము సుందరమైనది. కావ్యము సుందరమైనది, హనుమ సుందరమైనవాడు, మంత్రము సుందరమైనది. సుందర కాండము కానిదేమున్నది" అని కావ్యపాఠకులు రామాయణ కావ్యరాజమునకు హృదయస్థానీయ

1. Women in Valmiki, Page : 128.

మైనది. సుందర కాండమని చెప్పుటకు వెనుకాడరు. 'సుకరాం ఉదన్తి సుందరః' అని సౌందర్యమున కర్థము. హృదయాహ్లాదకరమై, నయనానంద సంజనకమైన ప్రతి వస్తువు సౌందర్యముతో కూడినది. ఎక్కడ గలదీ సౌందర్యము? 'విశ్వాతి సాయి సుభగత్వాత్' అని శంకరుల వారనినట్లు చరాచరమైన ప్రకృతి యంతయు సౌందర్యోపేతమైనదే.

అయినను సౌందర్యాతిశయముగ ఒప్పుచు మిక్కిలి అహ్లాదమును కలిగించెడిది స్త్రీ మూర్తి సౌందర్యమని సుభాషిత రత్నభాండారము.

"జ్యోత్స్నేవ నయనానందః సురేవ మదకారణమ్
ప్రభుతేవ సమాకృష్ట సర్వలోకా నితంబినీ" 1

కన్నుల విందొనర్చు వెన్నెల వలె, మనస్సున కాహ్లాదమొదవించు నమృత ఘటిక వలె, సర్వజనాకర్షకమై ప్రభువువలె శక్తి సంపన్నమైనది స్త్రీ యని అర్థము. అటువంటి పరిపూర్ణమైన సౌందర్యమునకు ప్రతీక సీత. బాహ్యాంతరములైన సౌందర్యమునకు సీత తరువాతనే ఎవరినైన చెప్పవలెను. సహజసిద్ధమైన ఆమె సౌందర్యమునకు తోడు ఆమె గుణ శీలములు తోడై ఆ సౌందర్యము లోకారాధ్యమైనది. సాధారణముగ కులము, సౌందర్యము, విద్య, ఐశ్వర్యము అన్నియు ఒకేచోట రాశీకృతమై యుండవు. ఏకడనైన యున్నచో జనులు దుర్మదాంధులై ప్రవర్తించుట లోక సహజము. వజ్రమునకు వన్నె పెట్టిన రీతి జానకికి తన అభిజాత్య సంపదతో పాటు సుగుణ సంపదగూడ తోడైనది. ఈమె బాహ్యాంతరములైన సొబగులు ఒకదానితో ఒకటి పోటీ పడివవని చెప్పిన యుచితమై తోచును.

స్త్రీలకు బాహ్యసౌందర్యముకన్నను అంతరమైన సొగసులే మిక్కిలి కీర్తి దాయకము. శ్రీ శ్రీనివాసానంద స్వామి భౌతిక, మానసిక సౌందర్య గుణములను గురించి వివరించిన విషయములు సీతాదేవికి చక్కగ అన్వయింపదగినవి.

"ఆత్మ సౌందర్యమన పాతివ్రత్యము, భగవద్భక్తి, పాపభీతి, పెద్దల గురువుల యెడ పూజ్యభావము, మిడిసిపాటు తనములేకుండుట, నమ్రత, అణకువ, భయభక్తులు కలిగియుండుట, స్వధర్మ నిర్వహణము, త్రికరణ (కాయిక వాచక మానసిక) పారిశుద్ధత, ఆత్మనిగ్రహము, క్షమ, ప్రసన్న హృదయము, ప్రశాంత చిత్తము, పవిత్ర పరోపకారశీలములు కలిగియుండుట, ప్రాపంచిక కలిమిలేమి, కష్ట

1. సుభాషిత రత్న భాండాగారము, స్త్రీ ప్రశంసా ప్రకరణము.

సుఖాది ద్వంద్వములలో సహనము, ప్రేమ, కనికరము, దయ, మున్నగువాటి సమ్మిశ్రితమైన దైవిక లక్షణముల యొక్క యతిశయించిన సొబగే.ఇదియే అంతర్య మూర్తిత్వమన బరపగు (Inner Personality) బాహ్య సౌందర్యము కృత్రిమము (Artificial) లేదా స్వాభావికమై యుండనోపును." 1

జానకిదేవి యందున్న ఈ సౌశీల్య, సౌందర్య, సౌభాగ్య, సౌమనస్య సౌహృదయములు ఆమె నొక విలక్షణ పాత్రగ పేర్కొనుచున్నవి. భూజాతమైన ఈ బంగరు, శలాక సద్ధర్మపరుడైన జనక చక్రవర్తి యనెడి స్వర్ణకారుని చేతికి చిక్కి చిత్రమైన, అనుపమానమైన అమూల్యమైన విలువలనెడి నగిషీలను సంతరించుకొని స్వర్ణ సీతయైనది. 'మొల్ల' రామాయణ కావ్యము నందు వర్ణితమైన ఈ సౌందర్యమును మూలముతో తులనాత్మకముగ పరిశీలించి వివరించుటయే ఈ ప్రకరణము యొక్క ప్రధానాంశయము.

కావ్యనాయికా సౌందర్యమును వర్ణించుటలో రెండు పద్ధతులను అలంకారికులు సూచించి యున్నారు. స్త్రీ మూర్తి యొక్క భౌతిక సౌందర్య వర్ణనము చేయునప్పుడు దేవతా స్త్రీ వర్ణనమైనచో నఖశిఖ పర్యంతమును, మానవ కాంతను వర్ణించు పట్టున కేశాదిపాద పర్యంతమును వర్ణింపవలయునని నియమము లేర్పరచిరి. రామాయణ కావ్యనాయిక సీత ఆదిలక్ష్మి అవతారాంశమే అయినను, ఇందిరతో సమమగు సుందరిగా భావింపబడినను రామకథానుసారముగ పరికించినప్పుడు ఆమెనొక మానవ మాత్రురాలిగానే నిరూపించినట్లు విదితమగుచున్నది.

సీతా సౌందర్య వర్ణనలో మొల్ల వాల్మీకి వర్ణనా పంథానే అనుసరించినట్లు స్పష్టమగుచున్నది. మొల్ల రామాయణము నందు సీతాదేవి చిన్ననాటి జీవిత వృత్తాంతమునకు గాని, ఆమె హృదయమును తెలిసికొను భావనలకు గాని అవకాశము చాల తక్కువ. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండములలో సీతాదేవి పాత్ర ప్రవేశమున కన్నను ఆమెను గురించిన సూచనలే ఎక్కువ యని చెప్పవచ్చును. పై కాండములందు సీతాదేవి భౌతిక సౌందర్య వర్ణనము (Physical appearance) ఇతర పాత్రలచే చేయించినది. ఆమె అంతర్యము నెరుంగుటకు సుందర యుద్ధ కాండములే ప్రధానముగా పరిగణింపదగినవి. సీతాదేవి మానసిక సౌందర్యము (Mantal Make up) నకు సీతారావణుల, హనుమత్సీతల సంభా

1. శ్రీలకు సౌభాగ్య సందేశము, శాంతి, 1961 పుట : 746.

షణలు తార్కాణము. ఈ రెండు కాండములలో సీత చిత్తవృత్తిని అద్భుతముగా రూపుకట్టించి, వర్ణమిళిత చిత్రము వలె ప్రదర్శించినది. జానకి లోకోత్తర సౌంద ర్యము నతి గడుసుదనముతో, వ్యంగ్యార్థ భాషణములతో చమత్కారముగ వర్ణించినది.

"అకామినీ స్వయంవరము (బాల–65), పంకజ నేత్ర సీత (బాల–70), పద్మగంధి (సుందర-248), పుష్పవిలాసనాస (అరణ్య–54), మంజులవాణి (సుందర-73), రాకేందుబింబానన (సుందర–72), రుచిరాంగి (అరణ్య-52), సుగుణ భావోపేత (సుందర–39), హరిమధ్య (అరణ్య-54)." మున్నగు పదము లెన్నియో సీతాపరముగా ప్రయోగింపబడి ఆమె సౌందర్యసమీక్షను తెలియజేయు చున్నవి. రమణీ, సుంతీద, మున్నగునవి గాక, వదతి, భామినీ, ప్రేయసీ మొదలగు స్త్రీ సామాన్య వాచకముల నెన్నింటినో మొల్ల జానకి పరముగా ప్రయోగించిన పదములు గలవు.

వాల్మీకము నందును, 'మదిరేక్షణే' (అయోధ్య- 30-40), 'విశాలే విమలే' నేత్రే రక్తాంతే కృష్ణతారకే' (అయోధ్య–46, 18), 'సమవిభక్తాంగీమ్' (సుందర–17- 0), 'నీల నాగాభయావేణ్యా' (సుందర–15, 75), 'సుభ్రూమ్' చారుస్మితా, శతపత్ర నిభేక్షణే పూర్ణచంద్రాననా, కలభాషిణీ, మంజులభాషిణీ, సుశీలా, సుజాతా, మొదలగు పదము లెన్నియో ఆమె భౌతిక దేహ వర్ణనా పరముగా నుపయుక్తములు. ఇందలి పదముల ఆవృత్తి వలన సీతా సౌందర్యాతి శయము నిరూపింప బడుచునే యున్నది.

అట్లే 'సీతాం సీమంతినీవరామ్' (అయోధ్య 16-40), 'వైదేహీ చాపి తత్సర్వం నశుశ్రావ తపస్వినీ' (అయోధ్య -26–3), 'పతే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణీ' (అయోధ్య 26-20), 'కళ్యాణీం వనం ముని నిషేవితమ్' (అయోధ్య 26–29), 'ఏవం ముక్తాతు వైదేహీ ప్రియార్హా, ప్రియవాదినీ' [అయోధ్య 27–1], 'సర్వథా సదృశం సీతే మమస్వస్యకులస్యచ .... త్వమతి శోభనమ్'[అయోధ్య–30–41], మొదలగు అనేకపదములు సీతా మానసిక సౌందర్య వర్ణనవసరముగా వాల్మీకి ఋషి ప్రయోగములు కానవచ్చుచున్నవి.

## సీతాదేవి తికభౌ సౌందర్య వర్ణనము

మొల్ల తన కావ్యనాయికను ప్రవేశపెట్టుచున్నప్పుడే ఎందరో రామకా

రులు కోరుకొనదగిన చిన్నది ఆ సీత అని తెలియుటకై స్వయంవరము చాటించి నప్పుడు వివిధ దేశాధీశులైన రాజులను వర్ణించు సందర్భమున.

"వచ్చిరకామినీ స్వయం వరమునకు"

— [మొల్ల 'రా' బాల 'కాం' 65.

"ఈ పంకజనేత్ర సీత నరపాలకులార"

— [వై ది–70]

అని సీతను పాఠకులకు పరిచయము చేసినది. అయోధ్యను వీడి అరణ్యమునకు బయలుదేరి వెళ్ళు సీతారాములను చూచి అనాగరికులు, అటవికులునైన చెంచెతలు సీత సుకుమార లావణ్యములను, ఆమె పడుచున్న మార్గాయాసమును చూచి మిక్కిలి జాలి చెందిరి.

"ప్రతి వసియించుదెట్లో రతి రాజ సమానుల వీరి నేల యినా"

— [మొల్ల 'రా' అరణ్య 'కాం'–3].

"నడువ నేరని కొమ్మ యడుగులు సొక్కలై

— — — —

— — — —

మనసులో జేవ యూతగ జనెడు వేళ"

—(వై ది-4)

శిరీషకుసుమ పేశల గాత్రి సీత అసూర్యంపశ్యమైన రాజాంతఃపుర వాసిని నడక అలవాటులేని కారణముగ ఆమెకు అరణ్యమునందు కలిగిన క్లేశమును చిత్రించి చూపిదిన మొల్ల కరకు నేలమీద నడచుటచే మిక్కిలి సున్నితమైన ఆమె పాదములు బొటమరించి నడుచుటకు బాధను కలిగించినవి. సుకుమారములైన ఆ చేతుల వ్రేళ్ళ నెత్తురు క్రమ్మి కెంపులు తాపించినట్లున్నవి, పెనుగాలికి సుడివడిన లేత తీగ చంద మున శరీరము నందు చేవ తరిగినది. పున్నమినాటి వేకువ కనుపించు చంద్రుని కాంతి చందమున ఆమె మోము కళలు తప్పినవి, చిగురు పెదవు లెండినవి. అని నప్పుడు పద్మముల బోలు పాదములు, కెంపు వర్ణముగల అరచేతులు. లేతీగ వంటి మేను, చంద్రుని వంటి మోము అని పాదాది కేశ పర్యంతమైన వర్ణనము స్పష్ట మగుచున్నది. ఈమె నొక దివ్య స్త్రీమూర్తిగ చెప్పదల్చినది మొల్లయనుట కీ

విషయము లనుదాహరణముగా గొనవచ్చును. ఆ ముగ్ధ స్నిగ్ధ సుకుమార లావణ్యములను మొల్ల ముగ్ధ మనోహరముగా చెప్పినది. నిసర్గ సుందరము, అనురాగ పదిలములైన భావములివి, అడుగడుగున తన భర్తను ఆసరాగా గొని, నిట్టూర్పులతో, చెట్ల నీడలయందు నిలచి మార్గాయాసము తీర్చుకొనిన సీతను కన్నుల కట్టించినది, మొల్ల స్త్రీ హృదయము నందలి రమణీయ, భావములివి. రుచి మనోహరములు, ఔచితీ స్ఫోరకములు.

అరణ్యకాండము నందు శూర్పణఖ చేసిన "సీతా సౌందర్య వర్ణనము" సీతమ్మ సౌందర్య సమీక్షకు నికషోపలము. విశేషమేమనగ శత్రువు, వికారి, రాక్షసి, కర్కశహృదయ, అసూయ గల స్త్రీ కూడ సీతా సౌందర్య విభ్రమ విలాసములకు విస్తుబోయి కొనియాడిన తీరు గణనీయము. శ్రీరామ లక్ష్మణుల దగ్గరకు పోయి వారిచే అవమానింపబడిన శూర్పణఖ సరగున తన అన్న రావణుని కడకేగి అవనిజ అంద చందములు రావణుని హృదయస్థమగునట్లు వర్ణించినది. ఆసౌందర్య పరాకాష్ఠమును మొల్ల రుచి మనోహరముగా తీర్చిదిద్దినది.

పరకాంతారతుడగు రావణునకు సీతా సౌందర్యమునూ గూర్చి శూర్పణఖ వివరించు ఘట్టమును మొల్ల అయిదు పద్యములలో నిరూపించినది.

"ఆ రాము భార్య విభ్రమ
మే రాజ తనూజలందు నెరుగము విని మున్
.... .... .... ...."

"కన్నులు గలువలో కాము బాణంబులో
తెలివిగా నింతికి దెలియ రాదు
.... .... .... ...."

"కలదో లేదో యనుచును
బలుమరు నెన్నడుము జూచి పలుకుదురితరుల్
.... .... .... ...."

"షట్పదంబుల పైకి సంపెంగ పువ్వుల
జలజాతముల పైకి జందమామ

"బంగారు నీరునిలుపున

బొంగారుచు నుండ సజుడు వోసిన మాడ్కిన్

....    ....    ....    ...."

—(మొల్ల 'రా॰అరణ్య.కాం.21–25)

రావణునితో శూర్పణఖ సీతా తనూ విలాస విభ్రమములు నిరూపించిన ఈ సందర్భమున మొల్ల సీతాదేవి రూపురేఖలను మిక్కిలి ఆశ్చర్యజనకములుగ, నూత్న భావ విలసితములుగ వర్ణించుట విశిష్ట విషయము.

ఇరువది ఒకటవ పద్యము నందు ధారుణి లోపల భామినులు అరసుణకి సాటిరారనియు. ఆ రాము భార్య విభ్రమమేరాజతనూజలందు ఎరుగమని శూర్పణఖ ప్రస్తావించినది.

ఇరువది రెండవ పద్యము నందు సీతా లావణ్య విభ్రమములు అతిసాధారణములైన కవి సమయముల దృష్టితో రెండేసి ఉపమా ద్రవ్యములను స్వీకరించి కేశాదిపాద పర్యంతమైన సీతాదేవి భౌతికసౌందర్యము (Physical appearance) అభివర్ణించినది.

ఆమె కన్నులు కలువలో కాము బాణములో అన్న విచికిత్సకు హేతు భూతములైనవట, ఆమె పలుకులు కిన్నెర పలుకులో చిలుకల పలుకులో ఏర్పరుప లేమని సూచించినది. ఆమె నెమ్మోము అద్దమో, అమృతాంశు బింబమో స్పష్టపరుప లేమని సంభావించినది. ఆమె పయోధరములు చక్రవాకములో, స్వర్ణ కలశములో అన్న భ్రాంతి కలుగునని చెప్పినది. విశాలమైన ఆమె కేశపాశములు నీలములో, తుమ్మెదలగుంపో తెలియలేదని తేటతెల్లము చేసినది, ఆమె జఘనమువులిన తలమో, మన్మథుని వివాహవేదికయో యను సంశయము కలుగునని వివరించినది.

ఇరువది మూడవ పద్యమున అస్తినాస్తి విచికిత్సాహేతువైన ఆమె నెన్నడుమును బలిమికి, కలిమికి ఉదాహరణమైన ఆమె జఘనమును తనివితీర వర్ణించినది మొల్ల.

ఇరువది నాలుగవ పద్యమున సీతాదేవి అవయవములలో పదువారింటిని గూర్చి పదునారు ఉపమా ద్రవ్యములతో ఉపమించి క్రమాలంకార రీతిలో ప్రబంధ ఫక్కిలో సంధానించుట గమనింపదగినది. ఈ పద్యములో "అలక, నాసికా. కరా,

నన, చరణ, స్వనములు, వర పయోధర, మధ్యోష్ఠ, వచన, బాహు, గమన, హాసాక్షు, లూర్వారు," అను పదునారు అవయవములును కవి సమయోదిష్టములై పరస్పర శత్రుభావము కలిగిన ఎనిమిది జంటల ఉపమా సామగ్రితో సీతా సౌంద ర్యమును అద్భుతముగ, చమత్కార చారువుగా, మొల్లమ్మ వర్ణించినది.

"అలకలు నల్లని తుమ్మెద రెక్కలవలె, నాసిక సంపెంగ పూవ్వువలె, కర్ణములు పద్మమువలె ఆననము చంద్రబింబమువలె చరణములు చిగురాకులవలె. కంఠ స్వరము పిక స్వనములవలె, పయోధరములు ఏనుగు కుంభస్థలములవలె, నడుము సింహ మధ్యమువలె, పెదవులు దొండపండువలె, పలుకులు చిలుకల పలు కులవలె, బాహువులు తామర తూడులవలె నడకలు హంసగమనమువలె, నవ్వులు పండు వెన్నెలవలె.అక్షులు చకోరములవలె, ఊర్వులు సవనంబువలె, నూగారు పాప తేనివలె అమరి ఉన్నవని సీతాదేవి అవయవముల పొందికను అసౌందర్య పరా కాష్టను మొల్ల మిక్కిలి రమణీయముగా వర్ణించి చెప్పినది. ఏ ఇతర గ్రంథము లందును ఈ చమత్కారము లేదేమో! ఇతిహాసిక నాయికయైన సీత వాల్మీకము నందును కావ్య నాయికా లక్షణలక్షితమై ఒప్పుచున్నది. స్త్రీ కర్తృకమైనను జానకీ సతి భౌతిక సౌందర్యమును నిరూపించుటలో కావ్యనాయిక నొకవింత రచనా విన్యా సముతో అలంకారిక రచనా మర్యాదలతో వర్ణించి చెప్పుట సమకాలికమైన ప్రబంధ కావ్యముల ప్రభావమేనని నిస్సంశయముగా చెప్పనొప్పును.

శూర్పణక సీతా సౌందర్యము నెంత వర్ణించినను తనివితీరక మరియు ఆ రాము భార్య విభ్రమ మేరాజతనూజలందు లేదనియు, రావణునిలో ఉత్కంఠను పెంచుటకై,

"బంగారు నీరు నిలువున

— — — ...."

....(మొల్ల. రా. అరణ్య. కాం. 25).

అని ఎంత వర్ణించినను కొంత మిగిలిపోయినదేమోనని భావించి ఒక్క ముక్కలో మొత్తము సోయగమును తెలిపినది. శృంగారమనెడి బంగారమును కరగించి సృష్టి కర్త సీతగా పోత పోసినాడనినది. ఇట్లు సీతాదేవిలోగల మేలిమి గుణములను పదారు వన్నెల పసిడిగ భావించి స్వర్ణసీత ప్రతిమను మనముందుంచి షోడశకళా వరి పూర్ణయైన జానకిని పరిచయము చేసినది. కేశాది పాద పర్యంతమైన ఈ వర్ణనము వలన సీత మానవ మాత్రురాలుగ చిత్రింపబడినదని. చెప్పవచ్చును. 'కావ్యసంపద

క్రియల క్రమము....'లేవియు ఎరుగునని చెప్పినను ప్రౌఢ ప్రబంధ రచనా విన్యాసముతో నొప్పుచు మొల్ల పాండితీప్రకర్షకు నిదర్శనముగా నున్నది.

శ్రీరాముడు సీతాదేవిని పర్ణశాలయందు కానక పలవించు సందర్భమున మరియొక పర్యాయము సీతా సౌందర్యమును నిరూపించినది మొల్ల.

"నీ దృగ్విలాసంబు నెఱి నభ్యసించెడు
గురుకుచ గానవే హరిణ విభుడ

....  ...  ...  ...

...  ...  ...  ..."

మొల్ల. రా. అరణ్య. కాం—52

"ఘనసార భూజంబ కానవే నీ వంటి
గంధంబు గలయట్టి కరటి యాన

...  ...  ...  ...

...  ...  ...  ..."

—వైది-53.

మరియు 'వనజాస్య, కలకంఠి, హరిమధ్య, సుదతి, ఏణాక్షి, ఎలనాగ వామాక్షి, ఇభయాన' (అరణ్య—55,56) అను పదములలోను సీత భౌతిక వర్ణనము చేసినది. పై పద్యము నందు దృగ్విలాసమునకు హరిణము. మంజులాలాపమునకు సికము, నెమ్మోము సత్కాంతికి రోహిణీశుడు, ధమ్మిల్లమునకు అళికులము, స్తనములకు చక్రవాకములు. నెన్నడకు హంసము క్రమముగా ఉపమా సామగ్రిగా స్వీకరింపబడినవి. ప్రాతబడ్డ కవి సమయములను పాటించినను వానిని ఆవిష్కరించిన తీరు హృదయాంగమముగా గన్పట్టుచున్నవి.

తరువాతి పద్యమునందు కర్పూరమునకు గల కమ్మదనము వంటిగంధము గల కరటియానను. గదళీ తరువు వంటి అందమైన తొడలుగల దానిని, మీనములు వంటి నేత్రములుగల దానిని, సంపెంగ వంటి నాసికగల దానిని, లతవంటి కరములు గలదానిని, కంబు కంఠముగల దానిని పోకచెట్టు ఫలముల వంటి నల్లని జడగల దానిని నూత్నమైన కుంద మొగ్గల వంటి దంతముగల దానిని పరిచయము చేసినది. పురుష కవులవలె నిట్లు మొల్ల 'స్త్రీ' అంగాంగి వర్ణన చేసినది. కావ్య

మున సమయము దొరికిన అన్ని తావులందు జానకి అతిలోక సౌందర్యమునకు అద్దము పట్టుటకే అట్లు వర్ణించినది.

సీతా సౌందర్యమును చూచి మదనుని తాపమున కోర్వజాల ననుచు దుష్టుడైన రావణుడు పలికిన పలుకులలో ఆమె భౌతిక దేహ వర్ణనమును వర్ణించినది.

"నీ కన్నుల సౌభాగ్యము

.... .... ...."

"సురకాంతల్ సరిరారు యక్షసతులున్ సూటింప గారారు కి

.... .... .... ...."

"వ్రీడయలంకారముగా

.... .... .... ...."

—మొల్ల. రా. సుందర. కాం. 55, 56, 57.

జానకి కన్నులలో, కుచములలో, కరములలోగల సౌందర్యము దేవతాస్త్రీలలోగూడ లేదనినది, సురకాంతలు, యక్ష సతులు, కిన్నెర భామలు, గరుడ గంధర్వ స్త్రీలందరు కూడ ఆమెతో సాటి వచ్చువారు కాదని నాడు రావణుడు. నిను బోల్చి చెప్పుటకు నాకు ఉపమానములే కరువైననవనినాడు. మరియు మృదు భాషణములు చేయగలది. బేడిసలవంటి కన్నులు గలది, మంచి దంతములు గలదియని పలికినాడు రాక్షసేంద్రుడు ఇట్లు ప్రత్యంగ సౌష్టవమును పదే పదే వర్ణించుట వలన సీతాదేవి అతిలోక సౌందర్యమును, రూపయౌవనములును స్పష్టీకరించుట జరిగినది. 'వ్రీడ యలంకారముగా మాటాడుమనుటచే కులస్త్రీకి సిగ్గే సింగారమని రుజువు పరచినది.

వాల్మీకియు ఈ సందర్భమున—

"శుభాం రుచిర దంతోష్ఠీం పూర్ణ చంద్ర నిభాననాం
ఆసీనాం పర్ణ శాలయాం బాష్ప శోకాధి పీడితాం
— — — —"

—వాల్మీకి. రా. అరణ్య. కాం. 46-11-22.

అని సీత సౌందర్యమును త్రిలోకము లందెచ్చటను చూడలేదని రావణుడు పలికినట్లు వర్ణించినది. కేశాదిపాద పర్యతంముగా సాగిన వర్ణనమును సీత నొక మానవకాంతగ నిరూపించినది.

యుద్ధకాండమున శ్రీరాముడు మరణించినట్లు రాక్షసులు తెలిపిన సందర్భమున.

"ఊచుర్లక్షణినో యే మాం పుత్రిణ్యా విధవేతిచ

.... .... .... ....

—వాల్మీకి.రా.యుద్ధ.కాం.48-2-12

అని సీత పలికిన పలుకులలో ఆమెను వాల్మీకి వర్ణించిన తీరు మానవ కాంతాచిత్రణముగా రుజువు పరచుచున్నది.

కోమలమైన సీత శరీరావయములను, జానకి హృదయ సౌకుమార్యమును అశోకవనిలో హనుమ చూచిన సందర్భమునందు మొల్లమ్మ చక్కగా ప్రకాశవంత మొనర్చినది. కష్టములలో కరిగిపోయిన ఆమె రూపమును, వర్ణించునప్పుడామెలో గల పావిత్ర్యము నివురు గవిసిన నిప్పుమాదిరి, మట్టిలోని మాణిక్యము వలెనున్నదని నిరూపించినది. క్రూర రాక్షస గణమధ్యమునందున్న దీనాతిదీనమై పతి వియోగానల దందహ్యమానసమైన ఒక తపస్వినిని వర్ణించిన తీరు అమోఘము. ప్రశంసావహము.

"పతి బాసినట్టి యాపదకంటె బలువూరు
వివిధ మాయల చేత వేగి వేగి

.... .... .... ....
.... .... .... ...."

—మొల్ల.రా.సుందర.కాం-41

దీనా తిదీనమైన అబల ఆర్తనాదమును స్త్రీ కర్తృకమైనందుననే ఇంత రమ్యముగా వర్ణించినదేమో అనిపించును. కావ్యము రసానంద జనకమగుటకు కావలసిన కీలకముల నెరిగి రచించినది మొల్ల.

పతి ఎడబాటు వలన కలిగిన ఆపదలను మించినవి రాక్షస మాయలు, కాగా, ఆ భయంకర కష్టములందు దిక్కుతోచనిదై మదిలో విచారించుచున్న దానిని ధూర్తులైన ఆ రాక్షసుల దుర్భాషలకు కన్నీరు మున్నీరుగా శోకించుచున్నదానిని, రామా! రామా! అని నాథుని నామమునే మదినెంచి ఒక యోగిని వలెనున్న దానిని అంజనేయుడు చూచెను. ఏరు లోపలనున్న కెరటములు ఏరును విడిచి వెళ్ళనిరీతి, ఎన్ని ఉప్పెనలెగసి పడినను కడలి యందున్న నీరు కట్ట దాటి ప్రవహింపనట్లు,

ఎన్ని విపత్తులు, ఎదురైనను సీతాసతిలో భర్తయందున్న అనురాగము పదిలమై, పవిత్రమై భాసించినది. సీతాశీల విభవమును హనుమ శ్రీరామునికి తెలియజేయుచు,

"కంటిన్, జానకి బూర్ణచంద్ర వదనన్ గళ్యాణి నా లంకలో—"

—మొల్ల.రా.సుందర.కాం-245

కళ్యాణ గుణములు గల దానిని నిరసన వ్రతముతో కృశించినను పూర్ణచంద్రుని కాంతివంటి ముఖము గలదానిని చూచితిననెను.

"కట్టిన వస్త్రంబు కట్టుకొంగే తక్క
జీర్ణించి పోయిన చీర తోడ
.... .... .... ....
.... .... .... ...."

—మొల్ల.రా.సుందర.కాం.246

జీర్ణించిపోయిన వస్త్రము గలది, చెక్కిట చేర్చిన చేయితో చింతిల్లుచున్న దానిని ఒడలంత బూడిద కొట్టికొనినట్లు మలినమై, కన్నీటితో తడిసియున్న శరీరము గల దానిని, నిడుపారు కురులు సడలిపోయి నిరతము నిరశన వ్రత నియమము గల దానిని క్రూరరాక్షసీ గణమధ్యమున భీతితో నున్నదానిని, రామ నామము జపించుచు ప్రాణములు నిలుపుకొనియున్న దానిని హనుమ, సీతమ్మ చెప్పినట్లు శ్రీరాముని హృదయము ద్రవించునట్లు కరుణరస భరితముగ వర్ణించి చెప్పియున్నాడు. ఈవర్ణనము శృంగార నైషధమున హంసదౌత్యము నందు చెప్పబడిన "కంటిన్ రమణిన్ పల్లవపాణిన్ రాకేందుబింబాననన్ అస్తి నాస్తి విచికిత్సా హేతుశాతా దోదరిన్" అను పలుకులను తలపించుచున్నది,

పతి వియోగముచేత కుందుచున్న సీతాసతిహృదయమునందున్న పవిత్ర భావనలకు దర్పణమీ వాక్యములు. అమెకష్టముల కడలిలో మునిగి తీరము కనరాని దూరము నందున్నను పాతివ్రత్య ధర్మములను వీడక, పతినిష్ఠయై, కంటిలో వత్తులు వేసికొని వెలుగును వెదకికొనుచు ఆశయనేమకానితో మార్గమును గవేషించుచున్న విధమును, రావణాది దుష్టుల మాతృభావనతో మన్నించిన తీరును సీత మానసిక సౌందర్యమునకు తార్కాణములు. ఈ హృదయ లాలిత్యము పలుతావులందుమనము దర్శింపవగును, ఈదేవిని అందలమెక్కించిన శీల విభవము నిట చక్కగ వర్ణితమైనది. "వరిష్టాసర్వనారీణా మేషాచదివిదేవతా" (వాల్మీకి.రా.యుద్ధ.కాం.118-11) అని వల్మీక సంభవుడు పలికిన పలుకులెట్లు సంభవములగును.

# ఐదవ ప్రకరణము

# సీతా కళ్యాణము

## స్వయం వరము:

స్వయం వరమనగా వరుని స్వయముగా వధువు ఎంపిక చేసికొనుట. ఇది రెండు విధములుగా మనకు తెలియవచ్చుచున్నది. వధువు తానే స్వయముగా తనకు నచ్చినవాని మెడలో దండవేసి భర్తగా స్వీకరించుట. ఉదా. నలదమయంతులను పేర్కొన వచ్చును. ఏలయనగా పేరునకు స్వయంవరమనియే గాని చాల కావ్యములందు వధువునకు వర నిర్ణయమున ప్రాముఖ్యమునుగానరాదు. తండ్రిచే వీర్యశుల్కగా ప్రకటింపబడి తనకు నచ్చినను నచ్చకున్నను తన తండ్రి యభీష్టమున కనుగుణముగా నడచుకొని వధువు వరుని మెడలో పూలదండ వేసిన కావ్యనాయికలే మనకు చాలమంది కనిపించుచున్నారు. ఇదియే రెండవ పద్ధతి. ఈరెండవ పద్ధతి ప్రకారము సీతా స్వయంవరను జరిగినట్లు రామాయణ కావ్యము తెలియ జేయుచున్నది. అయోనిజయైన తన పుత్రికకు తగిన వరుని సంపాదింపవలెనను దృఢ సంకల్పము తోడనే తన కొమార్తెను వివాహ మాడగోరిన వారెవరైనను సరే "శంకరు చాపమెక్కిడిన సత్త్వఘనుండగు వానికిత్తునీ పంకజనేత్ర సీత...." (మొ.బాల.70)అని ప్రకటించియున్నాడు· కాబట్టితండ్రి యభిమతము నెరవేర్చుకొను యభిప్రాయమునే ఇది తెలియ జేయుచున్నది. కొమార్తెల నట్లు సత్వ సంపన్నుడైన వానికి ఈయదలంచియేనాడు వరుని ఎన్నికకై స్వయం వరములు చాటియుండిరని తెలియును·

ద్రుపద రాజనందన ద్రౌపది కూడ వీర్యశుల్కగ ప్రకటితమైనది· పాంచాలా ధీశుడు యాజ్ఞసేనియైన తన పుత్రికకు తగిన సామర్థ్యము కలవానిని భర్తగా బడయగోరి మత్స్యయంత్రమును గొట్టిన వానికే ద్రౌపదినిచ్చి వివాహము చేయుదునని ప్రతిన బూనినాడు.

ఇట్లే శమంతమణికై భల్లూకేశ్వరునితో పోరుసల్పిన శ్రీకృష్ణునకుజాంబవంతుడును, నీలాపనిందా నిరాసము నిమిత్త ము సత్రాజిత్తును తమ తమ కొమార్తె

లతో పాటు మణిని గూడ బహూకరించుట వీర్యశుల్కముగ నెంచదగిన యంశములు. శ్రీకృష్ణుడిట్లు తన అష్టభార్యలలో చాలమందిని వీర్యశుల్కలుగనే స్వీకరించినట్లు తెలియవచ్చును. మిత్రవిందను గూడహరి వీర్యశుల్కముగా స్వీకరించుట జరిగినది,

"భూరమణులు సూడగ హరి-వీరత జేకొనియె మిత్రవిందను." కోసల దేశాధీశుడు నాగ్నజిత్తు తన కొమార్తె నాగ్నజితిని పెండ్లియాడ గోరిన వారికొక యుంకువ చేసియుండెను.

> "వాడి కొమ్ములు గలవాని వీర గంధంబు సోకిన గాలు త్రవ్వెడి వాని
> నతి మదమత్తంబులైన వాని"

గోవృషంబుల నేడింటి గూర్చి తిరిగి - బాహుబలమున నెవ్వడు పట్టికట్టు నతడు కన్యకుదగు వరుండనిన. 2

నాగ్నజిత్తుతో శ్రీకృష్ణుడు కన్యాశుల్కాదులము కామని పలికెను. కాని నాగ్నజిత్తు మరల,

> "ఉష్ణాంశుండు తమంబు దోలుక్రియనీవు గ్రాహవాక్షోణిలో
> .... .... .... .... ...."3

అని హెచ్చరించుట జరిగినది.

వెంటనే కృష్ణుడు ఆ యేడు వృషంబుల వీరశార్దూలముకైవడి నెదిర్చి అణచివేసి రాజపుత్రికను చేపట్టును. అట్లే లక్షణయను అష్టమ భార్యను కూడ స్వీకరించెనని చెప్పుటకామె తండ్రి మత్స్యయంత్రము నుంకువగాజేసి చాటిన స్వయంవరమే సాక్షి.

> "ఈ సాయకంబు నారిం బోసి వెసన్ మత్స్యయంత్రమున్ ధరగూలన్.
> వేసిన శౌర్యధురీణుని-నాసుత వరియించునని" 4

పై విషయములన్నియు పూర్వయుగములలో గల స్వయంవర, కన్యాశుల్కాది ఆచార సంప్రదాయములను వ్యక్తము చేయుచున్నవి. "నేటికిని భారతదేశమందలి ఆటవికులలో వివాహకాల మందు పెండ్లికూతురు అమ్మ పై విడిచిన బాణమును పెండ్లి కుమారుడు తేగలిగితే వానికా బాలికనిత్తు"రని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు

---

1. పోతన భాగవతము. 10.ఉ-125. (3) పైది -137.
2. పైది -126. (4) పైది -1083,84

రామాయణ విశేషములను గ్రంథమున తెలిపియున్నారు. "చెట్టులెక్క కలవా ఓ నరహరి పుట్టలెక్కగలవా" అను మాటలు కొండకోయ జాతులలో ఈ యాచార ములున్నట్లు ఎరుకపరుచుచున్నవి.

"ధరణీ సుతయగు సీతకు

.... .... ...."

— మొల్ల 'రా' బాల 'కాం-59'

మొల్లమ్మ తన కావ్యనాయికను మొట్టమొదటసారిగ స్వయంవర వేదిక పై నునిచి పాఠకులకు పరిచయ మొనర్చినది. వాల్మీకము వలెనే స్వయంవర సన్నా హములు వర్ణించినది. శంకర చాపమును ఉంకువగా ప్రకటించినాడు జనకుడు.

"కొంతక సావధాన మతి గూర్చి వినుండిదె మత్కుమారికై

.... .... .... ....

— మొల్ల 'రా' బాల. కాం-70

తన కొమార్తెకు జనకుడు వివిధోజ్వలమైన ధనము నుంకువగా జేసెనని, శివధనువును ఎక్కుపెట్టగల సాహస్యము గలవానికే సీత నిచ్చెదనని తెలుపుట వలన సీత భూపుత్రికయై నందున అయోనిజయైన ఆమె అభిజాత్య సంపదకు తగిన సత్వసంపన్నుని ఎంపిక చేయదలచినాడు జనకుడని తెలియుచున్నది. మొల్ల కూడ అట్టి ఔచిత్యముతో స్వయంవర విషయములు చాటి చెప్పినది. వివిధ దేశపు రాజులు ఆ వింటిని చూచి తల్లడపడి తమలో తాము వితర్కించుకొని వెనుదిరిగి పోవుదు బరుల నొమ్ములు తమకేల దక్కునని విచారించిరి. కారణ జన్మురాలు సీత రామునికే తగినది యని, ఆమెలోని ప్రత్యేకతను చక్కగ నిరూపించినది మొల్ల. ధనువు దునిమినప్పుడు ఆ పెళపెళారావమునకు జనక విశ్వామిత్రులు రామలక్ష్మణులు తక్క మిగిలిన వారందరు మూర్ఛ మునిగిరని వాల్మీకము. కాని మొల్ల తన కావ్య నాయికనంత బేలగా వర్ణింపలేదు. ముగ్ధయై నునుసిగ్గులతో అట పూదండబట్టి అవనత వదనయై నిలిచిన ఆమె శ్రీరాముడా ధనువు దునిమినంతనే ధీరముగ నిలిచినట్లు మొల్ల వర్ణించినది.

"ధనువు దునిమినంత ధరణీశ సూనులు

.... .... .... ...."

— మొల్ల 'రా' బాల. కాం-81

---

1. రామాయణ విశేషములు, పుట: 168.

వీరాధివీరులందరు శ్రీరాముడు విరిచిన శివధనువును చూచి సిగ్గుతో తలలు వంచగా చిన్నారి సీతమ్మ మేను పెంచినదట. సీతను ధీరయైన నాయికగ నిరూపించినది. కాని వాల్మీకమున జానకి సంబరపడినదో లేదో గాని జనకుడు మాత్రము ఉప్పొంగిపోయినాడు. అతని ఆనందము అర్ణవమైనది. ఎంతో కాలముగ అతడెదురు చూచిన కోరిక సిద్ధించి, ప్రాణతుల్యయైన పుత్రికకు చక్కని వరుని పొందగలిగితినని హాయిగా నిట్టూర్చినాడు.

"జనకా నాంకులే కీర్తి మాహరిష్యతి యే సుతా
.... .... .... ...."

—వాల్మీకి 'రా' బాల 'కాం—67' 21, 22.

తాను చాటిన స్వయంవర ఫలితమును పొందితిననెను. తనకెన్ని భోగభాగ్యము లున్నను సాధుశీలము గల కొమార్తె వలన కలిగిన కీర్తి యనెడు ధనమే శాశ్వత మైనదని, ఇతర సంపద ఏదియు తనకు చెందినది గాదని భావించెనని శ్రీమదాంధ్ర వాల్మీకము చెప్పుచున్నది.

"అనంతం బత మే విత్తం యస్సమే నాస్తికించన
మిథిలా యాం ప్రదీప్తాయాం నమే కించిత్ప్ర రహ్యతే"

కులశీలములున్న కొమార్తె వలన వంశము నందు ఇరువది యొక్క తరముల వారు ఉద్ధరింపబడుదురని శ్రుతి వాక్యప్రమాణము.

"కులం తార యతే తాత సప్తసప్త సప్తచ" 1

అందు వలననే తన కొమార్తె వివాహ విషయములో సకాలమునకు తగిన వరుని పొంది వివాహము చేయగలనా? యని జనకుడు అంతరంగము నందు కలత చెంది యుండును.

"కన్యావరయతే రూపం మాతావిత్తం పితాశ్రుతమ్
బాంధవాశ్శీల మిచ్ఛంతి మూసాన్న మితరేజనాః"

అపురూప లావణ్యవంతుని భర్తగా పొందగోరునది కన్య. తల్లికి ధన వంతునిపై కాంక్ష యుండును. తండ్రి మాత్రము విద్యావినయ సంపన్నుని తన పుత్రికకు వరునిగా పొందగోరును. బంధువులు గుణశీలములు, ఇతరులైన

1. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, బాల 'కాం' పుట: 908.

వారు హృష్టాన్న భోజనమును ఆశించెదరని చెప్పిన వాక్యములు మిక్కిలి సమం జసములు.

వాల్మీకేతరములైన కంబ రామాయణము, రంగనాథ రామాయణము, తులసీదాసు రామాయణములు సీతారాములిరువురుని శివధనుర్భంగమునకు ముందే ఉద్యాన వనములందు కలిసికొని ఒకరిపైఒకరు మరులుకొని యున్నట్లు వర్ణించినవి.

లోకభద్రాయిత మూర్తులు, కారణవశముగ జన్మమెత్తిన వారని వాల్మీకి చివరిలో, చెప్పియున్నాడుగదా. వీరివల్ల ఇట్టి వర్ణనలు ఉచితముగా దోపవు. భాసుని యజ్ఞఫల నాటకమున ఇట్లు చెప్పినందున,

"సీతారాములు వంటి కారణజన్ముల కిట్టి వివాహపూర్వ సమావేశములు అనభిలషణీయములు. భాసుని కాలము నాటికి ప్రేమ వివాహముల ప్రసక్తి పురాణ పురుషుల విషయమున కానరాదు. ప్రతిజ్ఞా యౌగంధరాయణమున వత్సరాజు ఉద యనుడు చారిత్రక పురుషుడు కాబట్టియే యతడు వాసవదత్తను ప్రేమించి పెండ్లి యాడుట జరిగినది. కాని భాసుడుకాని, తత్పూర్వులుకాని ప్రేమ వివాహములజోలికి పోలేదు. రుక్మిణీ శ్రీకృష్ణులయు, సుభద్రార్జునులయు, నలదమయంతులయు వివాహ ములు సీత వివాహముతో బోల్పరాదు,"1

అని భాసుని రామాయణ నాటకములను తమ విమర్శన గ్రంథమునందు జీరెడ్డి చెన్నారెడ్డిగారు చక్కగా ఖండించిరి. వీరి విమర్శనము యుక్తి సహమైనది. వాల్మీకి సీతారాములను యుద్ధకాండమునందు నిరూపించిన వారిఅవతారతత్వము నవ గతము చేసికొనలేదో లేక కాలానుసరణమైన మార్పులు ప్రవేశపెట్టుటకో మరి వారి ఉద్దేశమేమో? వాల్మీకి రామాయణమునగాని, అధ్యాత్మ రామాయణమునగాని సీతా రాములనిట్లు వర్ణించి యుండలేదనుచు గోపాలకృష్ణగారు.

In Velmiki Ramayana there is no indication about pre-marital love of Sita and Rama, It is not found in Adhyatme Ramayana also 2

పలికిన పలుకులు సమంజసములై ఒప్పుచున్నవి.

1. The sources of Bhasa Ramayana plays. PP 52, 53,
2. Folk Ramayanes in Telugu & Kannada, Page 61.

# వివాహ వ్యవస్థ

ఉత్తమ కులసంజాతగ, క్షత్రియ కన్యగ ప్రసిద్ధిగనిన జానకి అయోనిజ. భూపుత్రి కళ్యాణమనగా లోకకళ్యాణమునకు నాంది యనదగినది. "వివాహ"మను పదమునకు వధువుని వరుని ఇంటికి కొనిపోవుటయని యర్థము. భారతీయుల వివాహ వ్యవస్థ మిక్కిలి సుసంపన్నమైనది. ఏలయనగా అర్థకామములను ధర్మ బద్ధముగా సాధించుటకు ఈ విధిని ఏర్పరచినవి మన ప్రమాణ గ్రంథములు. స్త్రీ పురుషులకు సమానత్వమును ప్రతిపాదించునవి. ఇరుదేహములందున్న ఆత్మకు ఏకత్వమాసాదించునది మన ఈ వ్యవస్థ. స్త్రీ పురుషుల హృదయములలోగల ప్రేమాంకురములను వృద్ధి పొందించి సంసార వృక్షమును శాఖోపశాఖలుగ విస్తరింపజేసి పుష్పించి ఫలింప జేయునది. అనగా సత్సంతాన ప్రాప్తితో వంశీకులనుద్ధరింపజేయునది.

చతుర్విధాశ్రమములో గృహస్థాశ్రమమే మేలైనది. ఇది మిగిలిన ఆశ్రమములకు మూలమైనది. ఆర్ష సంప్రదాయానుకూలమైన సర్వవిధులకు వైవాహిక విధి యెంతేని అవసరము. పూర్వ యుగములలో అగ్నిసాక్షిగ వివాహ విధులు నెరవేర్చుట మన భారతీయుల ఆచారమై యుండినది. "సఖా సప్త పదాబభూవ" అని ఉపనిషత్తులు ఏడడుగులు కలిసి నడచినంతనే స్నేహబంధ మేర్పడునని చాటుచున్నవి. ఏడడుగుల ఈ సంబంధమును ఏడేడు జన్మల సంబంధముగ భావించుకొని ఆ బంధమును పవిత్రము, పటిష్టముగ జేసికొనజూచుటకు మన భారతీయులు దీని నొక పవిత్రకర్మగా నెంచినవారు. ఇది సాంఘిక వ్యవస్థతో ముడిపడి వ్యక్తిగతమైన విలువలను పెంచునట్టిది. ఇది జాతిభేదములను బట్టివారి వారి ఆచారముల కనుగుణముగ నిర్వహించుచున్నట్టిది, సంతానము ధర్మయుతమైనదిగా నున్నప్పుడే లోకమునకు శ్రేయస్సు. "వర్ణ సంకరము కుల వినాశన హేతువని" గీతాచార్యుని ప్రవచనము. మానవ కళ్యాణమునకు ధర్మజీవనమెంతో అవసరము. అటువంటి ధర్మ కర్మలతో కూడిన మానవుల మనుగడకు వివాహమే మూలము.

తల్లిదండ్రులు ఇటువంటి విధ్యుక్త కార్యములను సకాలమున నెరవేర్చవలెనని లేనిచో నిందార్హులగుదురని మనువు ఉద్దేశించినాడు. ముఖ్యముగ స్త్రీలకు వివాహాది వైదిక సంస్కారములు తప్పనిసరిగ జరిపింపవలెనని అతని సిద్ధాంతము.

"స్త్రీ" ఎల్ల వేళల యందు ఎవరో ఒకరి సంరక్షణలో నుండును కావున ఆమెకు కల్పింపవలసిన రక్షణకై వివాహమత్యంతావశ్యకమని నాడు.

"పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
రక్షంతి స్థవిరే పుత్రాన స్త్రీ స్వాతంత్ర్యమర్హతి"

అనగ స్త్రీకి బాల్యమున తండ్రి, యౌవనమున భర్త, వృద్ధాప్యమున పుత్రులు రక్షకులుగ నుండెదరని మనువు. ఇది ఒకనాటి మాట. కాని నేడు విద్యావంతులు. ఉద్యోగినులనై స్వయంపోషక శక్తిగలవారు స్త్రీలు. కాబట్టి మనువు చెప్పిన ఆదరణ లభింపకపోయినను నష్టము లేదు. ఇట్లు మనువు స్త్రీలను రక్షించు నుద్దేశముతోనే కొన్ని విధులను చెప్పి హెచ్చరించి యున్నాడు.

"కాలే2దాతా పితా వాచ్యోవాచ్చశ్చాను పయన్పతిః
మృతే భర్తరి పుత్రస్తు వాచ్యో మాతుర రక్షితా"2

పవిత్ర సంతానము కొరకు స్త్రీని ప్రయత్న పూర్వకముగ రక్షింపవలెనన్నాడు. అందువలననే వివాహ యోగ్యురాలు కాకున్నను యోగ్యుడైన భర్త లభించినపుడు వెంటనే స్త్రీలకు వివాహము చేయవలెనని కూడ కట్టడి చేసియున్నాడు.

"ఉత్కృష్టాయాభి రూపాం వరాయ సదృశాయచ
అప్రాప్తామసితాంతస్మై కన్యాం దద్యాద్యదా విధి"3

బహు భార్యాత్వము వలన, అవివాహితులైన స్త్రీల స్వేచ్ఛావృత్తుల వలన జరిగిన అనర్థము లెన్నియో ఇటువంటి నిబంధనలకు మూలములై యుండును. రామాయణము నందు అటువంటి పాత్రల సృష్టి తెలియవచ్చుచున్నది గదా!

లోకసామాన్యమైన ఇట్టి ధర్మములున్నప్పుడు బ్రహ్మజ్ఞాన విలసనుడైన జనకర్షి తన పుత్రికకు వివాహము జరుపుటలో జాప్యము చేయగలడా? గృహస్థాశ్రమ ధర్మ ప్రతిష్ఠాపనకే వాల్మీకి శ్రీరామచరితమును వర్ణించినాడని విజ్ఞుల తలంపు. ఇది వ్యక్తిగతమైన సంస్కారమే అయినను సమాజముతో సంబంధము గలది.

---

1 మనువు—మానవ ధర్మములు—పుట: 110—11.

2. పైది —పుట: 100—11

3. పైది —పుట: 115.

ఐహికాముష్మిక సంబంధమైన పరమార్ధమును కలిగియున్నదీ వ్యవస్థ. గృహమేధి పొందు ఫలములన్నియు గృహస్థాశ్రమము అందించునని నాడు ధర్మశాస్త్రకారుడు—

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతి రుత్తమా

— — — —" 1

స్త్రియః శ్రియశ్చగేహేషు నవిశేషో 2 స్తి కశ్చన"

సంతానప్రాప్తి, ధర్మకార్య నిర్వహణము, ఉపచర్య ఉత్తమ దాంపత్యము పారమార్ధిక చింతనతో కూడిన పారలౌకిక సౌఖ్యములు, వంశోద్ధారణ ఇత్యాదులకు వివాహ క్రియయే మూలమని మనువు. భారతేతరు లెందరో ప్రశంసించిన సత్సంప్రదాయమైన దీవ్యవస్థ ఉపనిషదాది గ్రంథము లెన్నియో వివాహితుడు పొందు ఫలములనన్నింటిని పొందుపరచి యున్నవి. అవివాహితులకు యజ్ఞాధికారము వంటి ధర్మకర్మ నిర్వహణలకు అర్హత లేదని తైత్తిరీయ మనుచున్నది.

"అయజ్ఞోవా ఏషాయో2 పత్నీకః"

కర్మసిద్ధాంత పారమ్యమైన ఈ ఆర్ష భూమిలో కావ్యాది శాస్త్ర గ్రంథములను వ్రాసిన మహనీయు లెందరో చతుర్విధాశ్రమములలో గార్హస్థ్యమునకే మిక్కిలి ప్రాధాన్యము నిచ్చియున్నారు.

"గృహస్థం హి సదాదేవాః పితరో2తి ధయస్తథా
భృత్యాశ్చై వోప జీవం తితాన్ భరస్వమహీపతే"

అని భారత గ్రంథకర్త వ్యాసుని ఉద్ఘాటన. భారతానుశాసికము "దేవతలు, పితరులు, అతిథి, అభ్యాగత, భృత్యగణములన్నియు గృహమేధినాశ్రయించుకొని యుండెదరు." అందు వలన అన్ని ఆశ్రమములలో దీనినే మిన్నగ భావించుట జరిగినది.

సంతతము గృహమేధి పొందు ఫలములన్నియు భార్యావంతుడైన వానికే ననుచు నన్నపార్యుడు తన కావ్యనాయిక శకుంతల చేత ఇట్లు పలికించెను.

"ధర్మార్థ కామ సాధనకుపకరణంబు, గృహనీతి విద్యకు గృహము. విమల చారిత్రక శిక్ష, కాచార్యకంబు, అన్వయస్థితికి మూలము, సద్గతికి నూత" అందువలన వివాహము ఐహికాముష్మిక ఫలదాయకముగా నెంచబడినది. పాశ్చాత్య విమర్శకుల భావనలు కూడ దీనికి ఉపబలకములుగా నున్నవి.

1. మనువు మానవ ధర్మములు, పుట: *112.*

"The begething of children was regarded as of greater mportance by family than the phyaical chastity of its women1."

"యథా నదీనదా స్సర్వే సాగరే యాంతి సంస్థితమ్
తథైవా 2 శ్రమణ స్సర్వేగృహస్తే యాంతి సంస్థితమ్"

అని, మనువు నదీనదములన్నియు సాగరములో సంగమించినట్లు గృహస్థాశ్రమము నాశ్రయించుకొని ఇతర ఆశ్రమములు వర్ధిల్లుచున్నవనినాడు. ఈ విషయము వాల్మీకియు తెలియున్నాడు. భరతుడు అన్న రాముని అయోధ్యకు మరలివచ్చి రాజ్యము స్వీకరింపుమనుచు ఋషులందరును గార్హస్థ్య ధర్మములనే ప్రశంసించు చుండెనని పలిచెను.

"చతుర్ణా మాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్టము త్తమమ్
ఆహు ధర్మజ్ఞ ధర్మజ్ఞాస్తం కథంత్య క్తు మిచ్ఛసి"
—వాల్మీకి. రా. అయోధ్య. కాం. 22-105.

ఇట్టి విషయములెన్నియో స్మృతులు, కావ్యములు తెలియజేయుచున్నవి.కాబట్టి వివాహ మనునది కేవల దైహికమైన సుఖములకు మాత్రమే పరిమిత మయినదనుకొనుట పొరపాటు. ఆహార నిద్రామైథునములు మానవునికి అవసరమే గాని వానినే జీవితముగ నెంచరాదు.ఈ వివాహ బంధనము గృహస్థునకు ఆత్మసంయమనము సాధించుటకుపకరించునది. తద్వారమున పారమార్థిక ఫలము నందించునది. ధర్మబద్ధము, శాస్త్రవిహితమునైన కర్మలాచరింపుచు పరిమితమైన వాంఛలను నెరవేర్చుకొను నేర్పును గృహస్థునకు కలిగించునట్టిదీ వైవాహిక తంతు అని విజ్ఞుల తలంపు.

"జీవితము ఒకపూర్ణ భావము.ఆ పూర్ణ భావము యొక్క తత్వము లే భార్యా భర్తలిర్వురు. వారిర్వురు ధర్మ మార్గమున సహయోగులై తమ వ్యక్తిత్వములోని ప్రత్యేకతను త్యజించి పూర్ణ త్వమంది ధర్మ ప్రతిష్ఠకు తోడ్పడుచున్నారు. అట్టి పరమ పవిత్రమగు గృహస్థాశ్రమమున ప్రవేశించుటకు చేయు వైదిక సంస్కారమే వివాహ సంస్కారము." 1.

## వివాహ భేదములు

మన శాస్త్ర గ్రంథములు, కావ్యములు వివాహము లెన్ని విధములుగ జరిపింపవచ్చునో చక్కగ వివరించు చున్నవి. మన ధర్మశాస్త్రమునందు, గృహ్య సూత్రములందును అష్టవిధ వివాహ పద్ధతులు వర్ణింపబడినవి.

1. Great Women of India Page 9.

"బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథా సురః 2
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచ శ్చాష్టమో 2 ధమః"

1. బ్రాహ్మము, 2. దైవము, 3. ఆర్షము, 4. ప్రాజాపత్యము, 5. అసురము, 6, గాంధర్వము, 7. రాక్షసము, 8. పైశాచిక వివాహము లెనిమిది విధములు.

విలువైన వస్త్రాలంకారముల కన్య నలంకరించి విద్యావినయశీలుడైన, సదాచార సంపత్తి గలిగిన వరుని ఎంపికచేసి కన్యాదానము చేయుట బ్రాహ్మము,

యజ్ఞము చేయించిన ఋత్విక్కునకు సాలంకృత కన్యాదానము చేయుట దైవము. దైవ సంబంధియగు యజ్ఞ సందర్భమున దానమిచ్చుటచే ఇది దైవమన బడినది.

ఒక గోమిథునమునుగాని, రెండింటినిగాని తన యాగాది ధర్మకార్య నిర్వహణమునకై వరుని నుండి గ్రహించి కన్యాదానము చేయుట ఆర్షము. ఋషివాటికలందు తరచు ఈ వివాహ పద్ధతులు జరుగుచున్నందున దీనికి ఆర్షమని పేరు.

వధూవరుల నిరువురిని కలిసి ధర్మకర్మానుష్టాన మొనరింపుడని ముందుగా చెప్పి వరుని గౌరవించి పూజించి కన్యనొసగుట ప్రాజాపత్యము.

కన్యయొక్క పితరులుగాని, జ్ఞాతులుగాని వరుని వలన డబ్బు తీసికొని కన్య నిచ్చుట అసురము.

ఆత్మజను వెలకట్టి అమ్ముటనిందార్హమైనదని కశ్యపాది మహర్షుల భావము.

తల్లిదండ్రులచే కన్య వరునికి దానమీయబడక వధూవరులు కేవలానురాగ బద్ధులై తమ ఇష్టపూర్వకముగా వివాహము చేసికొనుట గాంధర్వము.

వధువు గృహము నందలి వారి నెదిర్చి వారిని యుద్ధమున చంపి విలపించుచున్న. ఆర్తితోనున్న కన్యకను బలవంతముగ గొనిదెచ్చి వివాహమాడుట రాక్షసము.

నిద్రించు దానిని, వివశత్వముతో నున్నదానిని, ఏకాంతమున దొరికిన దానిని బలాత్కారముగ రమించుట, పైశాచము. అన్నింటిలో ఇది నీచమైనద యని మన్వాదులు ద్ఘోషించిరి." 1

పైన చెప్పిన యన్నింటిలో బ్రాహ్మము శ్రేష్టమైనది. అర్ష ప్రాజాపత్య దైవములు ధర్మబద్ధములు. ఈ నాలుగు విధములైన వివాహ పద్ధతుల వలన దంప

---

1. శ్రీమద్రామాయణ వైభవము—పుటః 122.
2. మనువు-మానవ ధర్మములు, పుటః28.

తులు సదాచారశీలురు, బ్రహ్మవర్చస్సుగల సంతాన లబ్ధిని బడయగలరు. ధనవంతులుగ, కీర్తిమంతులుగ, ఆయుష్మంతులుగ వెలిగెదరు. మిగిలిన ఇతర వివాహములందు నీచ స్వభావశీలురైన, అసత్యవాదులైన, అధర్మవర్తనులైన సంతాన ప్రాప్తి కలుగునని శాస్త్రోద్ఘాటనము. గాంధర్వ విధిని వివాహమాడిన దుష్యంతుని కుమారుడు భరతుని వల్ల ఇది అపవాదముగా నెన్నవచ్చును.

కాబట్టి వివాహ కార్యక్రమములందు కులాచార, రూప సంపదలలో, వయస్సులో, బంధుత్వములో తుల్యమైన వారై వధూవరులుండుట శాస్త్ర సమ్మతములు.

## సీతా కళ్యాణము ప్రాజాపత్యము

జనకుడు స్వయంవరము చాటించి శివధనువును విరిచిన శ్రీరామచంద్రుని శౌర్య ప్రతాపములకు మెచ్చి వెంటనే తన కూతురు జానకి నిచ్చి వివాహ మొనర్చ ప్రయత్నము చేసెను. ఈ విషయమును మొల్ల ఒక చిన్న వచనమునందు పొందు పరిచినది.

"ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వసంపదకు మెచ్చి సంతోసించి జనక మహారాజు వివాహంబు సేయువాడై రమ్మని దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంచిన

.... .... .... ....

.... .... .... ....

వంత దశరథ మహారాజు మరలి యయోధ్య పట్టణమునకు వచ్చుచుండగా మధ్యే మార్గంబున. —మొల్ల రా. బాల. కాం. 82

వాల్మీకి ఆర్ష సంప్రదాయ బద్ధముగా జరిపిన పెండ్లి వేడుక సంతటిని విపుల వర్ణనము గావించెను. మొల్ల ఆ కథాంశముల నన్నింటిని క్లుప్తపరచినను విషయములన్ని క్రోడీకరించినది. సంక్షిప్తముగ చెప్పినను సీతా వివాహ సన్నివేశమును కన్నులకు కట్టించినది మొల్ల.

మూలమున స్వయంవరానంతరము పెండ్లి జరిపించు నుద్దేశ్యముగల జనకుడు విశ్వామిత్రుని, రాముని అభిమతము ననుసరించి దశరథునికి వర్తమానము ను దెలియజేయును.

---

1. మనువు—3-27-3-34.
2. వైది — 3-37-3-40.

"జనకేన సమాదిష్టా దూతాస్తేక్లాంత వాహనాః
త్రిరాత్ర ముషితా మార్గేతే2యోధ్యాం ప్రావిశక పురీమ్
.... .... .... ...."

—వాల్మీకి.రా.బాల.కాం.—68-12.

ఈ వర్తమానము 68వ సర్గయంతయు వర్ణితము. మొల్ల "దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు" వ్రాయించి పంపినట్లు చెప్పినది. తక్కిన తెలుగు రామాయణము లీమె రచనకు ప్రోత్సాహకారుల నదగియున్నవి. లేఖలు వ్రాసి పంపించుట, వచ్చిన వారి నర్ఘ్య పాద్యాది విధులతో పూజించుట, వరుని చేతికి కన్యల నప్పగించుట మొదలగు వివాహ విధులు మొల్ల కూడా వాల్మీకివలెనే వర్ణించినది.దీనిని ప్రాజాపత్యమను వివాహ భేదముగా పరిగణింపదగును.

కౌసల్యాది కాంతా త్రయమును, అరుంధతి మొదలగు పెద్ద ముత్తైదువలను మిధిలా నగరపు వేడుకలకు వెంట కొనిపోయినట్లు వర్ణించినది మొల్ల. వాల్మీకమున కౌసల్యాదుల కోడండ్ర గృహప్రవేశ సమయమున స్వాగతములు పలికి మంగళాచరణములు చేసినట్లు చెప్పబడినది.

తన కూతురు సీతను శ్రీరామునకును తన తమ్ముని కూతుండ్రగు మాండవి ఊర్మిళా శ్రుతకీర్తులను భరత లక్ష్మణ, శతృఘ్నులకును ఇచ్చి వివాహము చేసినట్లు మొల్లచెప్పినది. కాని మూలమున ఊర్మిళ జనకుని రెండవ పుత్రికయని వాల్మీకి స్పష్టముగ చెప్పియున్నాడు. ఈ మార్పును మొల్లమ్మ దేని నాధారముగ చేసికొని చెప్పియుండెనో కాని మూలమున లేదు.

భాస్కరుడు యథా వాల్మీకముననే పెండ్లి జరిపించెననదగును. కాని రంగనాథ రామాయణమున కొన్ని లౌకికమైన ఆచారములకు ప్రాధాన్యమీయ బడినట్లు ఊహింప వచ్చును.

వాల్మీకి తన కావ్యమున సీతా కళ్యాణోత్సవ వివరణలను చాలా విపులముగ దాదాపు పది సర్గలలో (బాల.కాం.66—77) వర్ణించినాడు. స్వయంవర వేదికపై తండ్రి సమ్మతముతో సీత శ్రీరాముని మెడలో పూలదండ వేసి వరించుట జరిగినది. శ్రీరాముడు వెంటనే జనకుని కోరిక ప్రకారము సీతను చేపట్టనొల్లలేదు. తన తండ్రి అనుమతి కావలెనని నాడని సీత అనసూయతో పలికిన దాని వలన తెలియును.

"దీయమానాం నతు తదా ప్రతిజగ్రాహ రాఘవః
అవిజ్ఞాయ పితుశ్ఛన్ద మయోధ్యా2ధిపతేః ప్రభోః"

—వాల్మీకి.రా.అయోధ్యా.కాం.—118-51.

సీత తాను వరించుటగాని, శ్రీరాముడు సీతను వెంటనే గ్రహించుటగాని జరగలేదనగ వివాహాది శుభకార్యములు పెద్దల నియామకముగ జరుగుట శ్రేష్ఠమని వాల్మీకి నిరూపింపదలచినట్లు తోచును. శ్రీరాముడట్లు నిరాకరించినందున వీర్యశుల్కయైన తన తనయను దాశరధి కీయ తలంచితినని వార్తనంపి దశరథ మహారాజుల రావించి కుల పురోహితాది ముఖ్యులతో సర్వ విషయములు ముచ్చటించి అటు పిమ్మట పరిణయ పరమైన సర్వసన్నాహములు ఏర్పాటు గావించి మిక్కిలి విభవముతో సీతా కళ్యాణమును జరిపించినాడు జనకుడు.

జనక దశరథు లిరువురును తమతమ వంశ కథనములతో ప్రారంభించి సర్వ విషయములు సిద్ధపరచికొని పై దికా చారబద్ధమైన వేదికను నిర్మించి వివాహము చేసిరి.

"జనకః ప్రాజ నిర్వాక్యా.... .... శత్రుఘ్న భరతావృభే"

—వాల్మీకి.అయోధ్య.కాం.—72-9, 11.

అని పలికిన జనకుడు ప్రజాపతియైన భగుడు దేవతగా నున్న ఉత్తర ఫల్గునీ నక్షత్రము మిక్కిలి ప్రశస్తమైనదిగాన నాడు వివాహము జరిపించెదనని పలికెను. ఆ శుభ ముహూర్త నిర్ణయమునందే వారి వివాహము గావించెను.

"అగ్నిమాదాయ వేద్యాంతు విధి మంత్ర పురస్కృతమ్
జుహో వాగ్నేమహా తేజా వశిష్టా భగవానృషిః"

—వాల్మీకి.రా.అయోధ్యా.కాం.—73—74.

అప్పుడు సర్వాభరణ శోభితయై యొప్పుచున్న సీతను వేదిక కడకు గొనివచ్చి శ్రీరాముని కభిముఖముగ అగ్నికి ముందు కూర్చుండబెట్టి జనక మహారాజు తన పుత్రిక జానకిచేతిని తన చేతిలోనికి తీసికొని ఆ రామభద్రునికి ఆమెపాణిని అప్పగించి కన్యాదానము చేసెను. రామచంద్రునితో జనకుడిట్లనినాడు.

"ఇయం సీతామమ సుతా సహధర్మ చరీతవ
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణీ నా

— — — —"

—వాల్మీకి.రా.అయోధ్యా.కాం.-73,—26,27.

రాకుమారా! "ఈ సీత" నా కూతురు. నేటి నుండి నీ సహధర్మచారిణి ఈమెపాణిని గ్రహింపుము. నీకు సర్వశ్రేయములు కలుగును. "భద్రము"గా అని చెప్పుట విశేషార్థ బోధకము. కష్టసుఖములలో కలిసి జీవింపమనుచున్నది. ఈమె పతివ్రతయై మహాభాగ్య శాలినియై నీడవలె నిన్ను అనుసరించి చరింపగలదు. అని పలికిమంత్ర పూతమైన జలములతో శ్రీరామునకు అప్పగించినాడు. కాబట్టి సీతారాముల వివాహము ప్రాజాపత్యమను విధిని తెలియజేయుచున్నది. "మహాభాగ"అను పదము నందే సీతాదేవి జీవితౌన్నత్యము నంతటిని భద్రపరిచినాడు కవి.

"సహధర్మం చరత ఇతి ప్రాజాపత్యః" అని అశ్వలాయనుడును. "సంయోగ మంత్రః ప్రాజాపత్యే సహధర్మ చర్యతామ్" అని గౌతముడును. "అచ్ఛాద్యాలంకృత్యైషా సహధర్మం చర్యతామితి ప్రాజాపత్యః" అని బోధాయనుడును ప్రాజాపత్య వివాహ లక్షణములను దెలియునా్నరు. అట్లే ఊర్మిళాదులను మిగిలిన సోదరులకు అప్పగించినాడు జనకుడు.

తగిన వరునికి కన్యనిచ్చి సత్ఫలితమును పొందితినని జనకుడు సంతసించెను. సీతకు శ్రీరాముడు తగిన వరుడు కాబట్టి ఆమె మిక్కిలి కీర్తిమంతమైన జీవితమును పొంది తన వంశము నుద్ధరింపగలదని జనకర్షి ఆనందము పొందెను.

"పుత్రాచ్ఛత గుణం పుత్రీం" అనినట్లు కొమరుని వలన కలిగిన కీర్తి కంటె నూఱంతలధికమైన కీర్తి కూతురు వలన తండ్రి పొందగలడని దీని భావము

వివాహానంతరము తన కొడుకులు కోడండ్రతో దశరథుడయోధ్యకు బయలుదేరినాడు. జనకుడు తన కూతుండ్రకు అరణములుగ లక్షలాధి గోవులను, అనేక లక్షల విలువైన కంబళములు, పట్టు వస్త్రములు, వెండి బంగారు, ముత్యములు, పవడములుగల శ్రేష్ఠమైనహారములను చతురంగ బలములను ఏర్పాటుచేసి అత్తవారింట్లకు పంపించినాడు.కౌమార్తెలతోపాటు కొంత దవ్వు పయనించి వీడ్కొలిపెను.

---

1. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, బాల.కాం.పుట. 949.

"అథరాజా విదేహానాందదౌ కన్యా ధనంబహు

....    ....    ....    ....

దత్వా బహూధనం రాజా సమనుజ్ఞాప్య పార్థివమ్"

—వాల్మీకి.రా.బాల.కాం—74-3-7.

పై విషయములనన్నింటిని సంక్షిప్తీకరించుట మొల్ల రచనా చాతుర్యమనతగును. జనకుని భార్యగాని ఇతరులైన స్త్రీ జనులు గాని ఇట్టి వర్ణితము గాకపోవుట ఏలనో మరి? కుశధ్వజుడు అన్నగారి ఆధ్వర్యమున ఎదురుమాటడక కొమార్తెలకు వివాహము జరిపించుట కుటుంబము నందలిసభ్యులకు గల అవగాహనలు. సమిష్టి కుటుంబము నందలి ఆదర గౌరవములకు నిదర్శన మనదగును.

సీతాదేవి వివాహము ఉత్తర ఫల్గుని నక్షత్రమున జరిగినదని వాల్మీకి చెప్పినాడు.

"ఉత్తరే దివసే బ్రహ్మన్ ఫల్గునీ భ్యాం మనీషిణః
వైవాహికం ప్రశంసంతి భగో యత్ర ప్రజాపతిః"

—వాల్మీకి.రా.బాల,కాం—72-13.

ఈ విషయమును మొల్ల ప్రత్యేకముగ ఏమీ తెలియజేయలేదు. అట్లే సీతకు ఏ వయస్సునందు పెండ్లి జరిగినదను విషయము గూడ మొల్ల వివరింపలేదు. వాల్మీకమున నున్న ఇతర విషయములనుంచి అగ్నిప్రవేశ సమయమున సీత రామునితో పలికిన పలుకుల వలన ఆమెకు బాల్యముననే వివాహమైనదని చెప్పదగును.

యుద్ధ సమయమున రాముడు మరణించినట్లు చెప్పగా విని దుఃఖార్తయైన సీత విలపించుచు పలికిన పలుకులు బాల్య వివాహమును రూఢి చేయుచున్నవి.

"కింమాం న ప్రేక్ష సౌరాజాన్ కిం మాంన ప్రతిభావసీ

....    ....    ....    ...."

—వాల్మీకి.రా.యుద్ధ.కాం. 32-20.

"ప్రమాణీ కృతః పాణిర్బాల్యే బాలేన పీడితః"

—వాల్మీకి.రా.యుద్ధ.కాం—119–16.

ఈ విషయమునకు మొల్ల ప్రాధాన్యము నీయలేదు. ఇట్లనేకాంశములు పరిహరించుట సంక్షిప్తతకు మూల కారణము.

---

1. శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, బాల.కాం. పుట—340.

"అష్టవర్షా ద్భవేత్ కన్యా" అని శాస్త్రములు పలుకుచున్నవి కావున స్త్రీలకు వివాహ వయస్సు ఎనిమిది సంవత్సరముల ప్రాయముగా ఆనాడు నియామకము చేసినట్లు చెప్పవచ్చును.

సీతారాముల పవిత్ర బంధమును ఈ వివాహ విధి తెలియజెప్పుచున్నది. తెలియ జెప్పుటగాదు. ఆచరణలో నిరూపించినారు. సీత తన తండ్రి తనను గూర్చి చెప్పిన ప్రత్యక్షరమూ శ్రద్ధతో పాటించినదనవచ్చును.

Sita women in Valmiki Ramayana అను గ్రంథమున,

" Sita atands snique in beauty of figure and feeture, in the virtues of chastity and right eousness, patience and fortitude forgiveness and benevolance."

అని సీతాదేవి స్వరూప స్వభావ నిరూపణము చెప్పబడుట సమంజసములు.

"భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా" అని ఈమె చేతిని నీవు గ్రహింపుమనినాడు. "ఋషీణాం పునరాద్యానాం వాక్యమర్థోనుదావతి" అన్నట్లున్నవి రాజర్షియైన జనక చక్రవర్తి మాటలు "ధర్మేచ అర్థేచ కామేచ నాతి చరామి" అను శ్రుతి వాక్యములను మరువక కష్టసుఖాది ద్వంద్వములలో నీవు ఈసీత చేతిని వదిలముగా పట్టుకొని ప్రవర్తింపుమని అల్లుని హెచ్చరించినాడన వచ్చును. ఈమెనట్లు చూచుటయే నీకు క్షేమదాయకమని నట్లున్నవి.

"పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా అనినాడు. ఈమె నీ ధర్మపత్ని సుమా! (స్వీయనాయిక సీత) (A wife who has been married with Vedic rites). ఈమె పతివ్రత. ఛాయవలె నిన్నంటి పెట్టుకొని చరించునట్టిది అనినాడు జనకుడు. అట్లనుటలో ఆ వధూవరుల నిద్దరిని ధర్మ మతిక్రమించి నడువ రాదని హెచ్చరిక చేసియున్నాడు.

"అహం గృహస్థాశ్రమ ఏవ ధర్మం పరిష్యామి
నానాశ్రమస్థ ఇతివరం ప్రతిశ్రావ్యమ్" 1

అని చెప్పిన శ్రుతివాక్యములు గృహస్థుకి అప్పగించిన ధర్మములు తప్పి చరింప రాదని హెచ్చరించుచున్నవి. కావున సీతను రాముని కప్పగించుచున్న ఉద్దేశము

---

1. Women in Velmiki Ramayana-Page : 126.

కూడ అట్టిదే. ఇప్పటి వరకు ఈమె నా కొమార్తె నేటినుండి నీ భాగ్యదేవత ఇరు వంశీయుల నుద్ధరించు సచ్ఛీల సౌభాగ్య సంపద ఈ సీత. నీకు అప్పగించుచున్నాన న్నాడు.

భారతీయ వైవాహిక వ్యవస్థ కట్టుదిట్టములతో కూడి ఇటువంటి ఆదర్శ ప్రాయమైన దాంపత్యమునకు నిదర్శనముగా ఒప్పుటకు మూలమూర్తులీ సీతారాములు. పురుషుని పూర్ణపురుషునిగా మార్చునది. భారతీయ సతీత్వ, గృహిణీత్వ, మాతృత్వ సంపదలకు ఏకైక కారణమైనది. జీవాత్మ పరమాత్మలు ఒకే శరీరమందు వాసము చేసినట్లు దంపతు లిరువురకు అభేదమును ఆపాదించునది వివాహము. సీతారామ మూర్తిగారు వివాహము వలన పురుషుడు పరిపూర్ణత్వమును పొందగలడని పలికిరి.

"He is till now Rema, a partial purusha, with his marriage to Sita he becmoes Sri Rama, purna purusha the completeman. And Viswamitras mission into unite purusha tattva with Sritattva and this he completes when he consummates the union of Rama with Sita."1

అను మాటలు ఉపబలకములుగా కానవచ్చుచున్నవి.

"The concept of the Supreme self remains incomplete if Sritattva is not integrated with it."2

"Such is the nature of Sritattva that it brings the Supreme seif and the individual selves into close affinity and showesr bliss on both."3

అవివాహితుడైన పురుషుడు సంపూర్ణ వ్యక్తిత్వము లేనివాడని, పురుషుని కాత్మ వంటిదైన భార్య సాంగత్యమున భర్త జీవితము రాణించునని చెప్పదగును.

---

1. Lecturers on Valmiki Ramnayana, page : 105.
2. Ibid. page : 104.
3. Ibid.

# ఆరవ ప్రకరణము

# సీతాదేవి సంసారిక జీవనము

## ప్రణయ జీవితము

సంక్షిప్తరామాయణమైన మొల్ల కావ్యము నందు మనకు సీతారాముల జీవన వృత్తమును సమగ్రముగ తెలిసికొను అవకాశములు చాల తక్కువ. బాల కాండమున ధనుర్భంగ సమయమున మాత్రము ఆమె దర్శనము కలుగును. అందు సీతకు మాటలాడు అవసరము లేకపోయినది. అయోధ్యానగరము ప్రవేశించిన తరువాత కూడ సీతకు ఎటువంటి అవకాశము కల్పింపబడలేదు కవయిత్రి. అందువలన మూలమున వలె సీతను గురించి విపులముగా తెలిసికొను కథావృత్తములు మనకు కనిపింపవు. పతి వాల్లభ్యమైన సీతను ఒక చిన్న వాక్యమునందు పరిచయము చేసినదీమె.

> "శ్రీరామ చంద్రుడు రాజచిహ్నంబులు త్యజించి జటావిభూతి
> వల్కలంబులు దాల్చి ధనుర్ధరుండై యున్నంత లక్ష్మణుండు, భూ
> పుత్రికయును, దోడం జనుదేర తల్లులకుం నమస్కరించి వసిష్ఠాను
> మతంబున నాశీర్వచనంబులు గైకొని యాస్థానంబు వెలువడి
> యరణ్యంబున కరుగు నప్పుడు (మొ.రా.-అయోధ్యాకాండము-30)

అని మొల్ల వర్ణించి యున్నందున అయోధ్యకాండ మందలి కథాంశములలో సీత వ్యక్తిత్వమును (Personality) మనము తెలిసికొను అవకాశము లేదు. తరువాత కాండలలో చెప్పిన విషయముల వలన మనకు సీతారాముల ప్రణయ జీవన వృత్తాంతములు తెలిసికొను అవకాశము గలదు.

అరణ్యకాండమున సీతారాముల అనురాగమును దెలిసికొచుటకు ఈ క్రింది విషయములుదాహరణములుగా చెప్పవచ్చును.

"హా! లక్ష్మణా!" యను మాటలు వినిన జానకి చిత్తవృత్తి రాజసముతో కూడినదై లక్ష్మణుని ఆజ్ఞాపించుటయే గాక చిత్తము నందలి ఆందోళన వలన

ఆమెలో కలిగిన సంఘర్షణ సమావేశమును చక్కగ చిత్రించినది మొల్ల. "లక్ష్మణుని బిలిచి మీ యన్నకేమి కీడు వాటిల్లెనో కాని నిన్ను దలంచె నీవునుంబోయి మీ యన్న కుశల స్థితి తెలిసికొని రమ్మనిన" (మొ.రా. – అరణ్యకాండము-33). అని జనకజ చెప్పిన మాటలు వినక ఆమెకు ధైర్యము గొల్పు మాటలు చెప్పు మరదిపై సీతకు కోపము వచ్చినది. అందుకే ఇట ఆమె చిత్తవృత్తి దెలుపుటకే "భామిని" అని పదప్రయోగము చేసినది మొల్ల. "అని లక్ష్మణుడు పలికిన విని జనక రాజనందన కినిసి వినరాని మాటలు దూలనాడిన" (మొ.రా.—అరణ్యకాండము-36) అని మొల్ల సీతాదేవి లక్ష్మణుని నిందించిన వాక్యములను పరిహరించి "వినరాని మాట"లని మాత్రము సూచించినది. ఈ కోపమునకు కారణము పతి యందున్న గాఢానురాగమే గాని అన్యము గాదు.

మూలము నందు లక్ష్మణుని మిక్కిలి కఠోరముగా నిందించినది. సీత ఇప్పట్టున అట్లు మాట్లాడినదనగా పత్యనురాగము వలననే.

"సౌమిత్రే మిత్ర రూపేణ భ్రాతుస్త్వమసి శత్రువత్

.... .... .... ....

అనార్యా2 కరుణారంభ నృశంస కులపాంసన

అహం తవ ప్రియమన్యే రామస్య వ్యసనం మహత్

.... .... .... ....

—వా.రా. అరణ్య కాం.—45—4—37).

మిత్ర రూపములో నున్న శత్రుడవు, కులపాంసనుడవు, అనార్యుడవు, రాముని భార్యవైన నన్ను నీవాశించినందుననే ఇట్లు "ఏవో సాకులు చెప్పుచుంటివని మరదిపై క్రోధఘూర్ణిత మానసయైనది. పతి యందున్న ప్రగాఢానురాగమే ఆమె నిట్లు పలికించినను. స్త్రీ హృదయము నందు గల సంశయాస్పదమైన చిత్తవృత్తిని తెలియ జేయుచున్నవీ మాటలు. "వెళ్లి వెంటనే మీ అన్నను రక్షించు" అని మహారాజ్ఞి వలె అజ్ఞాపించినది. మొండివాడు లక్ష్మణుడు. స్వామిభక్తి పరాయణుడై అక్కడి నుండి కదల నప్పుడు— "రామం విన్నా క్షణమపి నహి జీవామి భూతలే" అని నీవు వెళ్ళకున్నచో, ఈ క్షణమే నీ యెదుటనే నా ప్రాణములు త్యజించుదాననని పలికినది సీత. లక్ష్మణుని తూలనాడిన తీరు స్త్రీ జనోచిత భావములకు నిదర్శనము.

"గోదావరీం ప్రవేక్ష్యామి వినారామేణ లక్ష్మణ
.... .... .... ...."
—పైది.

"గోదావరిలో దూకిగాని, విషము మ్రింగికాని అగ్ని యందు దూకిగాని మరణించెదనే గాని నీకు దక్కని దానను" అని లక్ష్మణునితో పలికిన జానకి పలుకులు మొల్ల వర్ణింపలేదు.

సీతను పర్ణశాల యందు కానని శ్రీరాముడు లక్ష్మణుని నాలుగు చివాట్లు పెట్టుట జరిగినది.

"పొడగని గుండె ఝల్లుమన బుద్ధి గలంగుచు రామచంద్రుడ
య్యెడ గడు నుగ్రుడై పలికె నీవిటు నాకడ కేల వచ్చిత
తక్కడ నిను బర్ణశాల కడ గావలి యుంచిన చోట నొంటిమై
బడతుక డించరా దగునె వన్య మృగోత్కర మధ్య సీమకున్"
—(మొల్ల.రా. అరణ్య.కాం-48).

శ్రీరాముని ఈ చిత్తవృత్తి కూడ అనురాగ పూరితమైన ఆవేశమునకే కారణముగా నెంచదగును—

"వనజాస్య నిను గూడి వర్తించు నతి ఘోర
వనములు శృంగార వనము లగును
వడతి! నీతోకూడి పవళించు కర్కశ
శయ్యలు పూవుల శయ్యలగును
గలకంఠి! నీ చేతి కందమూలాది భో
జనములు మధుర భోజనములగును
హరి మధ్య నిను గూడి చరియించు నటువంటి
వనములు సత్పుణ్య తవములగును
గెరలి నీతోడ గూడి భోగించునట్టి
భోగమంతయు దేవేంద్ర భోగమగును
సుదతి పొడకట్టగదె నాకు జూడవలయు
గన్నులకు గానబడవేమి కమల నయన" — (పైది. 54)

సీతా దేవితో కలిసి చరించిన క్రీకారణ్యములు ఉద్యానవనములగునని, రాళ్ళశయ్యలు పూల శయ్యలగునని, కందమూలములే మృష్టాన్నములగునని, ఆమెతో కలిసి

జీవించుటయే తపః ఫలమని, ఆమెతోడి భోగమేధైనను దేవేంద్ర విభవముతో సరిపోవునని విలపించెను. శ్రీరాముని మనసులో భార్యయందున్న అనురాగ వీచీవల యమునకు ఈ పద్దెము అద్దము పట్టినది. సీత ఎడబాటు వలన కలిగిన తన మన స్తాపమును భరింపలేని రాముని హృదయమున గల తాపము వారి ప్రేమానురాగము లకు చక్కని నిదర్శనము.

"నీ దృగ్విలాసంబు నెరి నభ్యసించెడు
గురుకుచ గానవే హరిణ విభుడ
నీ మంజులాలాప నిచయంబు గైకొన్న
సుకుమారి గానవే పిక కులేంద్ర"
ఘనసార భూజంబ! కానవే నీవంటి
గంధంబు గలయట్టి కరటి యాన"
"ఏ మృగంబును గన్న నేణాక్షిగానవే
యని పెక్కు భంగుల నడిగి యడిగి"
—మొల్ల.రా.అరణ్య.కాం-54—56.

అని పలుకుచున్న శ్రీరాముడు సీతాదేవి సౌందర్యమనెడి అమృతపానము వలననే జీవించుచున్నట్లు వ్యక్తమగు చున్నది. సీతలో ప్రత్యంగ సౌష్టవము శృంగార రసస్ఫోరకములు. జానకి సౌందర్య సమీక్షను కూడ చేసినది మొల్ల మరియొకమారు శ్రీరాముని ప్రేయసీ వియోగ పరితాపమునకు నిదర్శనముగా నున్న ప్రతి పదము కూడ సీతయందు శ్రీరామునికున్న ప్రేమానురాగములకు ప్రతీక.

"పలు మారు నీహస్త పల్లవంబుల చేత
నళివేణి! నా తాప మార్పవేల
నళినాక్షి! పరిరంభణ క్రీడ దేల్చి నీ
మది నొప్పి నా నొప్పి మాన్పవేల
చెలియ! యోష్ఠామృత సేవకై నీయల్క
వడి దప్పి నా దప్పి గడప వేల
భామ! దావానల పరితాపముడుప నీ
తనువు నా తనువున బెనచ వేల
యనుచు సీత బిలుచు నందంద పరికించు
దిక్కు లాలకించు నిక్కి చూచు

దశరథాత్మజుండు తన్ను డా మఱచుచు
బయలు కౌగలించు బలువరించు"

— మొల్ల.రా.కిష్కింథ.కాం—22

సీతాదేవి సౌందర్యము నెంత వర్ణించినను తనివి తీరకనో లేక రాయల యుగ ప్రభావమో సీత ప్రత్యంగ వ్యర్ణనము చేసినది మొల్ల. ఆ యుగ ప్రభావమే శ్రీకర్త్రృక మైనను కావ్యము సౌందర్యమును సంతరించుకొని రసౌచితమైనది రచన. "శయనేషు రంభా" యను గృహిణీ ధర్మములు నెరవేర్చిన సీతను పరిచయము చేయు చున్నవీ మాటలు. శ్రీరాముని నోటికి కూరలు రుచులు తప్పినివట సతీయోగము వలన.

"కూరలు నోటికిన్ రుచులు గూడుట దప్పెను దుంపదూడులుం
గారము తో చె జిహ్వకును గమ్మని తేనెలు చేదులయ్యె గం
గారయె జిత్తమంతయును గంటికి నిద్ర రహింపదయ్యె శృం
గార మెలర్ప సీత బొడగానమి రామనృపాల మౌళికిన్"
"తాలిమి తూలిపోయి పరితాపము నందిరుగాడు నొక్కచో
గాలును నిల్వ ద్రొక్క నధికారము చాలక యెప్పుడుం గడుం
జాలి వహించు జిత్తమున జంచలతం గను భూమిపుత్రి పై
మేలిమి జేసి రాముడట మిన్నక వేదురు గొన్న కైవడిన్"

పైది—24, 25

అని శ్రీరాముని విరహ వేదనావస్థను నిరూపించినది మొల్ల. ఈ మాటలలో శ్రీరామునికి భార్యయందున్న అవ్యాజాను రాగమును, స్వాధీనపతికయైన నాయికా వర్ణనమును చక్కగా ద్యోతకము చేసినది మొల్ల. ఒకరిని విడిచి వేరొకరు లేరు జానకీరాములు. అదే పవిత్రప్రేమకు పరాకాష్ట. అటువంటి ఆదర్శ దాంపత్యజీవనమును వండించుకొని తరతరముల కాదర్శ వ్యక్తులైరి.

ఇక వాల్మీకి చిత్రణమును పరికింతము.

"సర్వలక్షణ సంపన్నా నారీణా ముత్తమా వధూ." అనినాడు వాల్మీకి. వివాహానంతరము అత్త యిల్లు చేరిన జనకరాజ తనయ భర్తతో కలిసి హాయిగ సుఖముగ జీవించినది. శ్రీరామునికి మిక్కిలి ప్రీతిని కలిగించుచున్నదని వాల్మీకి పలికినాడు.

"రామస్తు సీతయాసార్ధం విజహార బహూనృతూన్
మనస్వీ తద్గ తస్తస్స నిత్యం హృది సమర్పితః

ప్రియాతు సీతారామస్య దారాః పితృకృతా ఇతి
గుణాద్రూప గుణాచ్చాపి ప్రీతిర్భూయోఽభవర్ధత”

—[వాల్మీకి .రా. బాల కాం.—77-25.26

శ్రీరామునకి సీత యందు మిక్కిలి ప్రీతి. తన తండ్రి దశరథుని చేత భార్యగ నిర్ణయింపబడుట, రామునకు. ఆమెలో గల సద్గుణ పుంజములు రెండవ కారణము. ప్రేమానురాగములతో చాల ఋతువులు సీతారాములు హాయిగ, ఆనంద ముగ జీవించినారు. శ్రీరాముని హృదయము నందున్న ప్రేమ కంటె రెండురెట్లధిక ముగా సీతా హృదయము నందు శ్రీరామునిపై గల అనురాగము వర్ణింపబడినది.

“తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయయే పరివర్తతే
అంతర్జాత మపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా
.... .... .... ....
.... .... .... ....
అతీవ రామశ్శుభేఽ తికామయా
విభుశ్శ్రియా విష్ణురివా మరేశ్వర:”

—వాల్మీకి.రా·బాల·కాం—77-27-29.

శ్రీరాముని హృదయాంతర్యమును ముందుగనే కనిపెట్టి తదనుగుణ వర్తనముతో, శ్రీరాముని యందు మిక్కిలి ప్రేమానురాగములతో ప్రవర్తించుచు సాక్షాల్లక్ష్మీదేవి వలె నున్న సీతతో కలిసి రాముడు శ్రీమహావిష్ణువు వలె భాసించినాడట· ఈ అన్యోన్య దాంపత్యమును గురించి ఖండవల్లి లక్ష్మీరంజనంగారి యభిప్రాయములు మిక్కిలి ప్రశంసార్హముగా నున్నవి.

“ఈ వర్ణనమును బట్టి ప్రేమించి పెళ్ళిచేసికొను పాశ్చాత్య పద్ధతిగాక పెండ్లియయిన వధువును ప్రేమించుటయే భారతీయ సనాతన పద్ధతియని వ్యక్తమగు చున్నది. ఈ యంశమునే “మహేశ్వర తీర్థులిట్లు నొక్కి వివరించిరి-“పితృకృతాః బ్రాహ్మ వివాహ సదృశ వివాహేన పితృదత్తాః సఏవ వివాహస్సర్వథా శ్లాఘ్య ఇతి భావః” అని తెలిపియున్నారు.

వీరి ప్రేమైక జీవనమును గురించి రామాయణోపన్యాసములందు సీతా రామమూర్తిగారిట్లు నిరూపించుచున్నారు—

The reciprocity in love of Rama and Sita, Rama loves Sita for three reasonas (a)the parents and elders have determined that Sita should be his wife and she is his dharmapatni. (b) Sita ia a Sanctuary of diverse and manifold virtues, and (c) she is peerlss in her attractive figure and charming features.

Sita's love for Rama is double that of Rama's for Sita. Her love is inexpressible in words. Love loses some of its preciousness when translated into words. Soshe makes her heart to communicate direct with Rama's heart.

తన భర్త మనసునెరిగి తదనుగుణ వర్తనముతో భర్తను ఆదరించి గౌరవించి, ప్రేమించినది సీత. సుఖములు కొల్లలుగా నున్నంత కాలము ఏ భార్యయైన భర్తను ప్రేమింపగలదు. దీనిలో విశిష్టత ఏమున్నదను విషయము లోక సామాన్య ధర్మమేగాని సీతకు వర్తింపదు. ఏలయనగ ఆమె తన భర్తను కష్ట సుఖాది ద్వంద్వములందు ఒకే విధముగా ప్రేమించినది. ఖర విరాధాది రాక్షసులు బాధల్పెట్టి రామలక్ష్మణులను గొనిపోవు చున్నప్పుడు వారిని విడిపించుటకై వెనుకాడలేదీమె. అట్టి త్యాగౌదార్యములతో పతిని సేవించు సతులు అరుదుగా నుండెదరు. తుచ్ఛుడైన రావణుడు సీతను ప్రలోభపెట్టినప్పుడు మిక్కిలి భయంకరమైన కష్టములలో ఉండియు ఆమె తన అనురాగమును పదిలముగా నుంచినది. రావణుని ధిక్కరించుచు సీత పలికిన పలుకులు ఆమెనిర్మాలిన్యమైన ప్రేమకు, నిష్కపటమైన ప్రవర్తనకు నిదర్శనములు.

"శక్యాలోభయితుం నాహమైశ్వర్యేణ ధనేనవా
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ యథా ప్రభా"

—వాల్మీకి.రా.సుందర.కాం-21-15

అని తాను భాస్కరుని పరివేష్టించి యుండు కాంతివలె తన రామునికే గాని అన్యులకు దక్కని దానననినది. తనను ఏ ఐశ్వర్యాదులు భ్రమింప చేయలేవనినది. శుచి

1. రామాయణ మహాకావ్యము-ఖండవల్లి లక్ష్మీరంజనము, శాంతి 1961. పుట.490
2. Lectures on Valmiki Ramayana-Bala, Page : 111.

శుచియైన, నిష్ఠాగరిష్ఠుడైన విప్రునికి లభించు విద్యను నేను అని పలికినది. రాఘవుని తప్ప ఇతరుని ఆశింపని అమలిన శృంగారమును వ్యక్తము చేయుచున్న మాటలివి. సకలైశ్వర్య వంతుడైన రాక్షసేంద్రుని వరింపుమని ఆమెను రాక్షసస్త్రీలు వేధించి నప్పుడు సీత పలికిన పలుకులు ఆమె పవిత్ర ప్రణయమునకు పరాకాష్ఠ.

"దీనోవా రాజ్యహీనోవా యోమే భర్తాసమే గురుః
తం నిత్యమనురక్తాస్మి యథా సూర్యం సువర్చలా'
—వాల్మీకిరాసుందరకాం-24-9

దీనుడైనను, రాజ్యహీనుడైనను తన భర్త తనకు చాల గొప్పవాడనినది. ఈ దేహమునుఖండించినను నాకిష్టమేగానినేను రాక్షసేంద్రుని వరించుదానను కాననినది.

శ్రీరాముడరణ్యవాస సమయమున తన భార్య, తమ్ముడు తనతో కలిసి యున్నంత కాలము ఇట్టి క్లేశము లెన్నియైన భరింపగలనని పలికెను.

"ఇమంతు కాలం వనితే విజహ్రివాం
స్త్వయాచ సీతే, సహలక్ష్మణేనచ
రతిం ప్రపత్యేకుల ధర్మ వర్ధినీం
సతాం పథిస్త్వైర్నియమైః పరైః స్థితః
—వాల్మీకి.రా.అయోధ్య.కాం-94-27

కష్ట సమయములందును సీత తన రామునితో కలిసి సకలైశ్వర్యములు అనుభవించు అయోధ్యా నగర జీవితమును తలపించుచున్నదని సుమంతుడు కౌసల్యతో చెప్పియున్నాడు.

"విజనేపి వనం సీతావాసం ప్రాప్యగృహేష్వివ
విస్రంభం లభతే2 భీతా రామే విన్యస్తమానసా

.... .... .... ....

తథైవ రమతే సీతా నిర్జనేషు వనేష్వతి
బాలేవ రమతే సీతా బాల చంద్ర నిభానవా
రామరామే హ్యదీ నాత్మవిజనేపి వనేసతీ"
(పైది 60-7—10)

వనభూములందు రాముని గూడి వాసము చేయుచున్న సీత పూర్వానురాగ విభవ ముతో హాయిగ జీవించినదనినాడు. నిశ్చింతగ హాయిగ జానకి రాముని సాన్నిధ్య మున బ్రతుకు చున్నదనినాడు.

"తద్గతం హృదయం యస్యాః తదధీనంచ జీవితమ్
అయోధ్యాహి భవేదస్యారామహీనా తథావనమ్"

(పైది 60-11)

చిత్రకూటము నందున్న సీతారాములను చూచిన తరువాత సీతారాము లరణ్యము లందు బాధలు పడుచున్నారను కొనుటయే దోషమేమో అనినాడు సుమంతుడు. పతి హీనుడైన సమయములో కూడ అట్లు జీవింపగల స్త్రీలు దుర్లభము. చిత్రకూటము నందున్న నానా విధములైన పుష్పములను గని, అందున్న శీతలవాయు గంధముల నాఘ్రాణించి, పక్షుల కూజితములను విని, ఆనందించు జనకజ ప్రకృతి సౌందర్య దిదృక్షామాన. మందాకినీ నదీతో యములను చూచి వినోదించు జానకి అయోధ్య యందున్నప్పటి కంటె మిక్కిలి ఆనందముగా నున్నదట. (వాల్మీకి.రా.అయోధ్య. కాం. 94-12-16) భర్తృ సాన్నిధ్యమే ఆమె ఆనందమునకు కారణమనుట యధా ర్థము. రాముడును సీతతో "నేదానీం త్వదృతే సీతేస్వర్గాఽపి మమ రోచతే అని సీతా! నీవులేని స్వర్గము కూడ నాకు వలదనినాడు. సీత భర్త నాదరించుటయే గాదు రాముడు భార్యనట్లే ఆదరించినాడు. తన తమ్మునితో సీతకు కావలసిన ఏవస్తువైన అలసింపక వెంటనె తెచ్చి ఇమ్మనినాడు.

"యద్యత్ఫలం ప్రార్థయతే పుష్పం వా జనకాత్మజా
తత్తత్ ప్రదాన్యా వై దేహ్యా యత్రస్యారమణీ మనః"

అనిన రాముని పలుకులు ఆమె యందాతనికున్న ప్రేమను తెలియ జేయుటయేగాక సీత మనస్తత్వ నిరూపణము చేయుచున్నవి. సీతకు వృక్షలతా గుల్మములు, సెల యేటి గలగలలు ఇష్టమని తెలియుచున్నది. (వాల్మీకి.రా.అయోధ్య.కాం.55-30-32) వీరి ప్రణయము, అన్యోన్యత స్వాధీనపతికమైన భార్యగలవానికి జీవితము మిక్కిలి సౌఖ్యదాయక మగునని నిరూపించుచున్నవి

"స్వాధీనః భర్తా పతిర్వాయస్యాః సాస్వాధీన భర్తృకాపతికావా"1

---

1. కావ్యాలంకార సంగ్రహము —పుట: 77.

భర్త తన యధీనుడై యున్న యువతి స్వాధీన భర్తృక. తనయందే అనురక్తుడై యున్న పతి గలది. ఉత్తమ స్త్రీమూర్తి ప్రకృతిని తెలియజేయు నాయికా భేదమిది. అడవిలో జంతువులను కొట్టి మాంస ఖండంబులు శ్రీరాముడు సతికి మంచి మంచి ముక్కలు ఏరి వానిని లాలనతో, సతిని బుజ్జగించుచు తినిపించినాడు.

"తాం, తథా దర్శయిత్వాతు మైథిలీమ్ గిరి నిమ్నగామ్
నిషసా దగిరి ప్రస్థే సీతాం మాంసేన ఛందయన్
ఇదం మేధ్యమిధం స్వాదు నిష్టప్త మిద మగ్నినా
ఏవమాస్తే సధర్మాత్మా సీతయా సహ రాఘవా"
వాల్మీకి.రా.అయోధ్య.కాం. 96-1-2

## కుటుంబ జీవన వృత్తము

ఇట్లు ఆ దంపతులిరువురి యందును గల పవిత్ర ప్రణయమునకీ సన్నివేశములన్ని నిదర్శనములు. ఏ ఒక్కరి ఆధిక్యము లేక కష్టసుఖములు కలబోసి పంచుకొని ఎడబాటు తెలియక బ్రతుకుటయే పవిత్ర దాంపత్యమని నిరూపించినారు. భార్యను కంటికి రెప్పవలె కాపాడుచు సౌఖ్యములు సమకూర్చుటకే రాముడు యత్నించుటకు దాహరణముగా గంగా నదిని దాటునప్పుడామె చేయి పట్టుకొని జాగ్రత్తగ పడవ నెక్కించుట, పడవలో కూర్చుండుటకై మర్రి ఆకులు దెప్పించి ఆసనము సమర్చుట మొదలగు విషయములు ఉదాహరణములు.

సీత తన తల్లిదండ్రులను అత్త ఇంటి యందున్న ఆర్యజనులను గురువులను, అత్త మామలను సేవక జనమును ఎట్లు మన్నించినదో వారి యభిమానమున కెట్టిపాత్ర మైనదో తెలిసికొను అవకాశము మొల్ల రామాయణము నందు చిత్రింపబడలేదు. మొల్ల కేవల ప్రబంధ వర్ణనలకు ప్రాధాన్యమిచ్చి సమకాలికమైన కవుల దృక్పథంతో రచించుటయేగాక మూలమును కుదించి వ్రాయుటయే ప్రధాన ధ్యేయముగా పెట్టుకొనినది. సీత చిత్తవృత్తమును సంపూర్ణముగ ప్రదర్శించినవాడు వాల్మీకి.

అరణ్యవాసమున అనసూయతో సంభాషించినప్పుడు తన చిన్ననాటి విషయములను ఆమెకు వివరించుచు తన వివాహము చేయుటకు తన తండ్రిపొందిన మనోవేదన వర్ణించినది జానకి—

"పతి సంయోగ సులభాం వయో దృష్ట్వాతు యే పితా
చింతా మభ్యగ మద్దీనో విత్త నాశాది వాధనః

.... .... .... ....

.... .... .... ....

తాంధర్షణ మదూరస్థాం దృష్ట్వాచాత్మని పార్థివః
చింతార్ణవగత: పారం నాస సాదప్లవే యథా:"

—వాల్మీకి.రా.అయోధ్య.కాం–118 సర్గ

అని తన తండ్రి తనకు సకాలమునను పెండ్లి చేయలేనేమోనని విత్తనాశము చెందిన వాని వలె మిక్కిలి చిత్తక్లేశమును పొందినాడని దేవేంద్ర సముద్రైనను కొమార్తెకు సకాలమునకు వివాహము చేయని నాడు నిందల పాలగునని పలికినది సీత. మనువు చెప్పిన మాటలు వాల్మీకి తన కావ్యనాయిక చేత పలికించినాడు. చిరుత ప్రాయముననే తల్లిదండ్రుల నర్థము చేసికొను బుద్ధిగలది సీతయని తెలియు చున్నది.

జనకమహర్షి కూడ తన పుత్రికయందు వ్యాజానురాగము గలిగియున్న వాడని తులసీదాసుగోస్వామి రామచరిత మానసలో తెలిపెను.

"పుత్రి పవిత్ర కియే కుల కుల దోవూ. సుజసధవల
జగు కహసభ కోవూ
జతి సురసరి కీరితి సరితోరే, గవనుకీన్హ విధి అండ కరోరీ"

చిత్రకూటము నందున్న సీతారాములను చూచి వచ్చుటకై జనకుడు బయలుదేరి వెళ్ళినప్పుడు కష్టములను సునాయాసముగా అనుభవించుచున్న తన పుత్రిక ధీరగుణమునకు లోలోపల ఆనందించి జనకు డిట్లనినాడు. నీ సత్ప్రవర్తన వలన నా వంశ ముద్ధరింపబడినది. కీర్తి వియన్నదియై ప్రవహింపగలదనినాడు. తల్లిదండ్రుల మన్ననలు కాదు అత్త ఇంటిలో పొందిన ఆదరాభిమానములు, ప్రవర్తనయే స్త్రీ కీర్తికి పతాకస్థాయి.

అనురాగముతో భర్తను అలరించినంత మాత్రముననే గృహిణిగ 'స్త్రీ' ధర్మము నెరవేర్చుకొనినట్లు గాదు. ఏ ఇంటిని మెట్టినదో ఆ ఇంటిలో ప్రతి విషయ

ములో ఆమె తన పాత్రను కడు నేర్పుతో మెలకువతో నిర్వహించి అందరి ఆద రాభిమానములను పొందుట, అలన పాలన చూచుట గృహిణిగ విధ్యుక్త ధర్మము.

"కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
రూపేచ లక్ష్మీ క్షమయా దరిత్రీ
భోజ్యేషు మాతా శయనేషు రంభా
షట్కర్మయుక్తా ఖలు ధర్మపత్నీ"

అనుచున్నది నీతిశాస్త్రము.

ధర్మాచరణ, సుగుణ సంపత్తితో సీత అయోధ్యానగరము నందు ప్రవ ర్తించిన తీరు తీయములు పరిశీలింతము. అత్త కౌసల్య యందు సీతకు అనురాగమె కాని ద్వేషము లేదు. శ్రీరాముడు యుద్ధభూమిలో నాగపాశ బద్ధుడై పడియున్న విష యము తెలిసి తనకు కలిగిన బాధకు మించి ముందు ఆమెకు - తన అత్త కౌసల్యకు గల పుత్ర ప్రేమను తలచుకొని ఆమె ఈ విషాదము నెట్లు భరింపగలదని వాపోయినది.

"నశోచామి తథా రామం లక్ష్మణంచమహాబలమ్
నాత్మానం జననీం వా2పి యథాశ్వశ్రూంతపస్వినీమ్
సా2ను చింతయతే నిత్యం సమాప్త వ్రత మాగతమ్
కదాద్రక్ష్యామి సీతాంచలక్ష్మణంచ సరాఘవమ్"

— (వాల్మీకి.రా.యుద్ధ,కాం—48-20-21).

వనవాసవ్రత పరిసమాప్తితో అయోధ్య రాగలరు, నా బిడ్డలని ఎదురుచూచు కౌసల్య ఈ వార్త విని ఎట్లు తాళగలదని వ్యథ జెందినది జానకి.

సీత హనుమతో వర్తమానము పంపుచున్నప్పుడు సుమిత్ర గూర్చి పలి కిన పలుకుల వలన ఆమె పిన్నత్తగారి యందు చూపిన ఎనలేని గౌరవము ప్రకటితమగుచున్నది.

"బ్రూహి యద్రాఘవో వాచ్యో లక్ష్మణశ్చమహాబలః

.... .... ....

.... .... ....

అనుగచ్ఛతి కాకుత్స్థం భ్రాతరం పాలయన్వనే"

— (వాల్మీకి.రా.సుందర.కాం-38-54-59).

దయాదాక్షిణ్యములు, సద్గుణములుగల లక్ష్మణుడు త్యాగమూర్తి. అటువంటి సుగుణ ఖనిని పుత్రునిగా పొందిన ధన్యజీవి సుమిత్ర, మాననీయ. ఆమెకు వందనము చెప్ప మనినది.

యుద్ధభూమి యందు రామాదులు మరణించిరనినప్పుడు కైక యందుగల కోపమువలన నిష్ఠురోక్తులాడినది. బాధలు తట్టుకొను శక్తి చాలనినాడు ఎదుటనున్న వ్యక్తిలోని లోపము లెంచుట మానవుని నైజగుణము. మానవ మాత్రురాలిగ చిత్రింపబడిన సీతను నిసర్గ సుందరముగా చిత్రించినాడు వాల్మీకి.

"సమమాభవ కైకేయి హతో2యం కులనందనః
కులముత్సాదితం సర్వం త్వయా కలహశీలయా
ఆరేణ్య కింతే కైకేయి కృతం రామేణ విప్రియమ్
యన్మమా చీర వసనస్త్వయా ప్రస్థాపితో వనమ్"

— (వాల్మీకి.రా.యుద్ధ.కాం-32—45).

మేము వనభూములందు కుందుటయే గదా నీకు సమ్మతము. ఇప్పుడు నీవు మా కష్టములు తెలిసి హాయిగ ఉండుమనుట మానవ సహజమైన మాటలు.

కౌసల్యాది కాంతాజనమునకు కోడలి యందున్న యభిమానము కూడ మిక్కిలి గొప్పది. అరణ్యమునకు బయలుదేరుచున్న కోడలి నుద్దేశించి కౌసల్య పలికిన పలుకులే దీనికి తార్కాణము.

"యద్యపి త్రిషులోకేషు ప్రథితం తే మహద్యశః

.... .... .... ....

.... .... .... ....

కథం క్రవ్యాద సింహానాం శబ్దం శ్రోష్యత్య శోభనమ్"

—వా.రా. అయోధ్య కాం. 61-2-61).

దశరథుని చేరి కౌసల్య అతనితో నిట్లనినది. దయాధర్మశీలుడవని పేరు పొందిన నీవు రామాదులతో కలిసి అడవి కేగుటకు బయలుదేరిన సీత ఎట్లు కష్టము లనుభవింపగలదని మిన్నకుంటివి. లావణ్యవతి శీతోష్ణముల నెట్లు సహింపగలదు.

మృష్టాన్నములారగించినది కందమూలముల నెట్లు తినగలదు, రాజాంతఃపుర వాసిని అరణ్యము నందెట్లు క్రూరమృగముల నడుమ బాధలు పడగలదని కౌసల్య దశరథుని హెచ్చరించుటలో ఆమెకు సీతపైనున్న మమకారము ద్యోతకమగుచున్నది. అట్లే అరణ్యగమనమునకై బయలుదేరనున్న రాముడు తల్లిని దర్శించినప్పుడు, రామా ! నీవు అరణ్యవాసము మంగళప్రదముగ పూర్తిగావించి తిరిగి వచ్చునపుడు నా కోడలు సీతకు సమృద్ధిగ వస్త్రాభరణాదులిచ్చి హాయిగ వర్ధిల్లుమనినది.

"మంగళైరుప సంపన్నో వనవాసాది హాగతః
వధ్వా మమ చనిత్యం త్వం కామాన్ సంవర్ధయాహిభోః"
— (వాల్మీకి.రా.అయోధ్య.కాం—25-44).

"సీతాఽపి చరణాంస్తా సాముప సంగృహ్యాదుః ఖితా
శ్వశ్రూణామశ్రు పూర్ణాక్షీసా బభూవాగ్రతః స్థితా"
— (వాల్మీకి.రా.అయోధ్య.కాం.103—22)

అరణ్యమునందున్న తమను చూచుటకై వచ్చిన అత్తలను చూచి కౌసల్య పాదములకు ప్రణమిల్లి అశ్రుపూరిత నయన అయినది సీత. కన్నతల్లి వలె సీతను కౌసల్య ఆదరించి యుండును. అంతటి ఆత్మీయుల దగ్గర మాత్రమే బాధలను ప్రకటించుకొనుట సహజముగా గమనించుచుందుము.

"తాం పరిష్వజ్య దుఃఖార్తాం మాతా దుహితరం యథా
వనవాస కృశాం దీనాం కౌసల్యా వాక్యమబ్రవీత్"
— (వాల్మీకి.రా.అయోధ్య.కాం—103-23)

వనవాస క్లేశముచే కృశించిన శరీరము గల కోడలిని చూచి కౌసల్య కన్నతల్లి వలె కౌగిలించి దుఃఖించినది.

ఆపదల యందు తన కొడుకును ఆదరించుచున్న కోడలియందు ఆమెకు గల అనురాగము అగ్గలమైనది.

"విదేహ రాజస్స సుతాస్నుపా దశరథస్యచ
.... .... .... ....
.... .... .... ....
కృశం మనసి వై దేహి వ్యసనారణి సంభవః"
— (పైది 108—24—26)

అబలయైన తన కోడలు అడవిలో ఎట్లాయాసము పొందగలదనియే ఈమె బాధ అంతయు. ఎండ వేడిమికి కమలిన కలువవలె, ధూళి గవిసిన బంగరు శలాక వలె, మేఘచ్ఛన్నమైన చంద్రబింబమువలె నున్న సీత ముఖమును చూచి నప్పుడామె డెందమున కలత చెందినది. కోడలిని ఇంత ఉదారముగ చూడగలిగిన అత్త కౌసల్యలో లేదీ గొప్పతనము. సచ్ఛీల వర్తనము, క్షమ, ఔదార్యము, పతి పరాయణత్వము, ఆర్యజనుల సంభావించు బుద్ధి గల జానకి సత్ప్రవర్తనయే దీనికి కారణము.

"సాసీతా స్వర్గతం శ్వశ్రూశ్వశురం తం మహాన్నృపమ్
నేత్రాభ్యా దశ్రుపూర్ణాభ్యాం నశకా కౌక్షితం ప్రియమ్
సాంత్వయిత్వాతుతాం రామో రుదతీం జనకాత్మజామ్"

— [వాల్మీకి.రా.అయోధ్యా.కాం—103-18, 19]

కన్నబిడ్డవలె అత్తమామల నాదరించి గౌరవించిన సీతకు మామగారి మరణవార్త పరమ బాధాకరమైనది.

అగ్నిప్రవేశము చేసిన కోడలిని చూసిన దశరథుడు బుజ్జగించి కోడలిని కొడుకులను అలింగనము చేసికొని ఆమెను వాత్సల్యముతో చూచినాడు. మొల్ల కావ్యమునందీ విషయము వర్ణించినది.

"పరమ పతివ్రతాభరణంబగు నిద్ధరా తనూజాతం గైకొమ్మని యప్పగించిన నయ్యెడ దశరథుండు ప్రసన్నుండైన శ్రీరామచంద్రుడు సతీసమేతుండై తమ్ముడును తానును నమస్కరించిన గుమారద్వయంబును గోడలిని నాలింగనంబుచేసి తద్దుఃఖంబులం బాపి చనియె"

— వా. రా. యుద్ధ, కాం— 3-120

వాల్మీకము నందును సొంత పుత్రికవలె దశరథుడు కోడలిని చూచినట్లు విదితము,

"ఇతి ప్రతి సమాదిశ్య పుత్రా సీతాంతధా స్నుషాం
ఇంద్రలోకం విమానేన యయౌ దశరథోజ్వలన్"

—మొల్ల.రా.యుద్ధ.కాం. 102-37

అడవికి బయలుదేరినప్పుడు కూడా దశరథుడు పుత్రికా వాత్సల్యముతో సీతను చూచినట్లు వాల్మీకి చెప్పియున్నాడు.

"సుకుమారీచ బాలాచ సతతం చ సుఖోచితా
నేయం వనస్య యోగ్యేతి సత్యమాహ గురుర్మమ

.... .... .... ....

న్యనుపర్యాప్త మే తత్తే పాపే రామనివాసనమ్
కిమేభిక్కృపణై ర్భూయః పాతకై రపితే కృతః"

—వాల్మీకి.రా.అయోధ్యా.కాం, 38-4-10

కష్టములనెన్నడును ఎరుగని తన కోడలు అడవిలో ఇడుమలు పడదగదని, నార చీరలు ధరించి తపస్వినివలె నిలిచియున్న ఈ ముగ్ధ ఎవ్వరి కపకారము చేసినదని నాడు. సీతను నారచీరలు కట్టి అడవికి పొమ్మని నేను చెప్పలేదని రాముని అడవికి పంపుచు పాపము మూట కట్టుకొన్నది చాలక సీతను కూడ అడవికెందుకు పంపు చుంటివని దశరథుడు కైకను నిందించినాడు. నిందించుటయేగాక—

"వాసాంసి చ మహార్హాణి భూషణాని వరాణిచ
వర్షాణ్యేతాని సంఖ్యాయ వై దేహ్యాః క్షిప్రమానీయ"

(పైది. 39.14)

గొప్ప విలువైన వస్త్రాభరణములు పదునాలుగేండ్లకు సరిపడునట్లు సమృద్ధిగ సీతకు ఇచ్చి పంపించుమనినాడు. నారచీరలు వలదనినను సీత తన భర్త కేది వర్తించునో ఆ మాటయే తనకు వర్తించును కాబట్టి, ఆ కైకమ్మ అందించిన చీరలు తీసికొని, ఆ చీర కట్టుకొనుట చేత గానందున శ్రీరాముని సాపేక్షముగ చూసినది. ఆమెకు చీరపైన నారచీరలు కట్టి చూపించినాడు శ్రీరాముడు. ఆ సన్నివేశము అటనున్న వారి హృదయములను బాగుగ కలచివేసినది. అంతఃపురాంగనలందరు కన్నీరు కార్చుచు సీతను అడవికి తీసికొని పోవలదని వారించిరి. దశరథుడు సీతను అడవికి పొమ్మని చెప్పలేదు. నీవు తిరిగి వచ్చునంత వరకు మేమందరము నీ సీతలో నీ రూపము చూచుకొని మా ప్రాణములు నిలుపుకొనియెదమనిరి. ఈ మాటలు హనుమంతుడు చెప్పినట్లు "తుల్యశీల వయోరూపములు" గలవారు సీతారాములు అనుటకే గాక కౌసల్యాదులు, దశరథుని అంతఃపురాగనలందరును సీతారామ వియోగమును భరింపలేని వారని తెలియుచున్నది. అడవి యందు జానకి క్లేశములెట్లు భరింప గలదనిరి.

"రామం ప్రేక్ష్యతు సీతయా బద్ధ్నంశం చీర ముత్తమమ్
అన్తః పురగతా నార్యోమహు చుర్వారి నేత్రజమ్

....          ....          ....          ....
....          ....          ....          ....

తాసామే వరం విధా వాచః శృణ్వాన్ దశరథాత్మజః
బబంధైవ తదా చీరం సీతయా తుల్య శీలయా"

—(వాల్మీకి. రా. అయోధ్య. కాం. 37–15–20)

ఈ సన్నివేశము నంతటిని చూచుచున్న వసిష్టుడు సీతమ్మ నుద్దేశించి వలికిన పలుకులు ధర్మబద్ధములు, శాస్త్ర సమ్మతములై దోచును. దశరథునికే గాదు వశిష్టునకు కూడా కైకను నమిలిమ్రింగుదమను నంతటి క్రోధము వచ్చినది. అందుకే కైకనూ చీవాట్లు పెట్టినాడు.

"చీరే గృహే తేతు తయా సమీక్ష్య న్నృప తేర్గురుః
నివార్య సీతాం కైకేయీం వశిష్ఠో వాక్యమబ్రవీత్

....          ....          ....          ....
—          —          —          ....

నగంవ్యం వనం దేవ్యా సీతయా శీలవర్ణి తే
అనుష్ఠా స్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్"

(వాల్మీకి. రా. అయోధ్య. కాం. 37-21–23)

సీత అడవికి వెళ్ళవలసిన అవసరము లేదు. అయోధ్య యందే యుండి రామునికి బదులుగా రాజ్యము ఏలగలదు. ఒకవేళ సీత రాముని యనుసరించి వెడలినచో ఆ సీత యున్నచోటునకే అయోధ్య తరలి వెళ్ళగలదు జాగ్రత్త! అనినాడు వసిష్ఠుడు. కులగురువట్లు సీతను గూర్చి పలుకుట వలన జానకి సచ్చరితము పెద్దలచే నెట్లు వలికించినదో స్పష్టపడినది.

"ఆత్మాహి దారాః సర్వేషాందార సంగ్రహవర్తి నామ్
ఆత్మేయ మితి రామస్య పాల యిష్యతి మేదినీమ్

—          —          —          —

అంత పాలాశ్చయాస్యంతి సదారో యత్ర రాఘవః
సహోప జీవ్యం రాష్ట్రంచ పురంచ సపరిచ్ఛదమ్"

(—వాల్మీకి. రా. అయోధ్య, కాం. 37–24–26)

అని వశిష్ఠుడు చెప్పెను. పురుషుని కాత్మ వంటిదైన భార్య అతని బదులు సింహాసన మధిష్టింపు నర్హత కలిగినది. కాబట్టి సీత చేత రామునికి బదులు రాజ్యమేలింప గలను. కైకా! కులవినాశకారిణీ! అని నిందించినాడు వసిష్ఠుడు. ధర్మచారిణియగు సీత ఒక వేళ రాముని అనుగమించినచో అనినందున సీతా మనస్తత్త్వమును వశిష్ఠుడు బాగుగ ఎరిగి యుండెననవచ్చును. ఈ రాజ్యభోగము లన్నియు ఆమె తృణప్రాయముగ నిరాకరించి రాముని అనుసరించునని అతని ఉద్దేశము. తన రాముని సాహచర్యము కన్నను ఇవేవి గొప్పగా భావింపదు సీత. స్త్రీకి కావలసిన గౌరవ మర్యాదలు ఆ భోగ భాగ్యములలో ఉండవని ఆమెకు తెలియునని వశిష్ఠునకు చక్కగా తెలియుటచే అట్లు మాట్లాడినాడు.

"ద్విధాకృతాత్మనో దేహ మర్ధేన పురుషోభవత్
అర్ధేన నారీశస్యాం సః విరాజమసృజత్ప్రభుః"

అని మనువు కూడ స్త్రీ పురుషుని కాత్మ వంటిదని చెప్పి యున్నాడు.

సీత సింహాసనము నిరాకరించినచో అయోధ్యాపురమంతయు బయలుదేరి ఏ కడ రామ నరనాయకుడు తన రమణితో కూడి యుండునో అక్కడ వసింపగల దనినాడు. ఇక సీతారామాదులు బయలుదేరి అడవికి వెళ్ళుచున్న సమయమున కన్నీరు మున్నీరుగా పురప్రజలందరు వారి వెంట బయలుదేరి దుఃఖించుచు సీతను గూర్చి పలికిన పలుకులు సీతాదేవి ఔన్నత్యమును నిరూపించుచున్నవి.

"కృతకృత్యాహి వై దేహీ ఛాయేవానుగతా పతిమ్
నజహాతి రతాధర్మే మేరు మర్కప్రభా యథా"

....(వాల్మీకి.రా.అయోధ్య.కాం.40-24).

ధర్మవ్రతానుచారిణి సీత అదృష్టమే అదృష్టము. మేరువును విడిచి సూర్యకాంతి యుండని విధముగా రాముని ఎడబాటు లేని ఈ జానకి ధన్యచరిత అని పతివ్రత యైన మైథిలిని ప్రశంసించినారు. సీత లేని అయోధ్య మాకవసరము లేదు. ఆమె ఉన్నట్టి అరణ్యమే మాకు అయోధ్య. మేము ఆమెతో కలిసి జీవించెదమని దుఃఖించిరి.

సీత అయోధ్యలో అడుగు పెట్టి పన్నెండేళ్లు నిండినవేమో! ఔన్నత్యము పొందినది. అభిమానము అందుకొనినది. అందరి మనములందు ఆమె సద్గుణములే ప్రశంసాపాత్రములైనవి.

తన మరది లక్ష్మణుని "అనగ వినగ" రాని మాటలాడినను అతని యందామె కెట్టి ద్వేషము కాని దోషము కాని లేని మాటలవి. చిత్రముగ మానవుని మనస్సుఊహలల్లుకొని సంఘర్షణకు లోనై బుద్ధివివేకమును గోల్పోవుచుండును. అటు వంటి సందర్భములో సీత లక్ష్మణుని నిందించియున్నట్లు తెలియవచ్చువిషయమేగాని ఆమె మనసులో అపవిత్ర భావములకు తావు లేదని సీతా సందేశము వలన తెలియదగును.

"జనకుని భంగి రామనృప చంద్రుని నన్నును దల్లి మారుగా
.... .... .... ...."
"ఆ మాటలు మదినుంచక
నా మానము గావు మనుచు నయవినయగుణో
.... .... .... ...."

(మొల్ల.రా.సుందర.కాం. 115, 116).

తాను పొందిన కష్టములకు నిరపరాధియైన తన మరదిని తానాడిన మాటలకు మిక్కిలి ఖేదపడినది. "వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లు ఆనాడామె మనస్సునకు నేమియు తోపలేదు. పుణ్యశీలుడవైన వానిని, పుత్రతుల్యుడైన వానిని నోటికి వచ్చిన రీతి మాటాడిన పాప ఫలము సామాన్యమైనది గాదు. "ఆ వినుత మహా ఫలము" అనుభవించితినని పశ్చాత్తాపముతో క్రుంగిపోవుచు పాపపు మాటలాడిన తనకు తగిన శిక్షలభించినదని సీత హనుమతో వర్తమానము పంపుట మానవ నైజమునకు ప్రతీకలు.

"గతజల సేతుబంధనము"గా ఎంత విలపించిన ప్రయోజనముండదు. అవశ్యమను భోక్తవ్యమ్మని వెంటనే అనుభవమునకు వచ్చిన ఫలితముగా నెంచి విచారించుటయు, తనను తల్లి మారుగా సేవించిన నీతికోవిదుడనుటయు, ఆమె మాతృ హృదయమునకు తార్కాణము. "బుద్ధిః కర్మానుసారిణీ" యని పెద్దలనినట్లు కష్టకాలము దాపురింపబోవు సమయమాసన్నమై ఆమె చేత అట్లు పలికించినది.

వాల్మీకమున కూడ సీత లక్ష్మణుని గురించియు, సుమిత్ర లక్ష్మణుని గురించియు చెప్పినమాటలు ఆమె మాతృస్థానీయురాలు లక్ష్మణునకనితెలియుచున్నది

"రామం దశరథం ద్విమాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛతాత! యథాసుఖమ్"

-[వాల్మీకి.రా.అయోధ్య.కాం. 40-6, 9].

రాముని తండ్రివలె, జానకిని తల్లి వలె, అడవిని అయోధ్యవలె, భావించి సేవింపు మని సుమిత్ర కుమారునికి చెప్పి పంపించిన త్యాగశీల, అటువంటి తల్లి నుండి శిక్షణ నొందిన లక్ష్మణుడు తద్విరుద్ధముగా నడచుకొనగలడా.

"మాతా పరమేకోగురుః" అన్నారు గదా పెద్దలు.

కిష్కింధలో సుగ్రీవాదులు సీత ఆభరణములు రామలక్ష్మణులకు ఇచ్చిన సమయమునందు అన్న లక్ష్మణుని పిలిచి మీ వదిన ఆభరణములేనా గుర్తింపుమని మనినాడు. ఇది అంత ఔచితముగా లేదనియో ఏమో మొల్ల శ్రీరాముడే వానిని గుర్తించి మూర్ఛ మునిగినట్లు వ్రాసినది.

ఈ సందర్భమున లక్ష్మణుడు అన్నతో పలికిన పలుకుల వలన లక్ష్మణుడు తన వదినను కేవలము తల్లి మాత్రమేగాదు ఒక దేవతా స్వరూపిణిగ ఆరాధించియున్నాడని తెలియును.

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభి జానామి నిత్యం పాదాభి వందనాత్"

[—వాల్మీకి.రా.కిష్కింధ.కాం-6—22]

లక్ష్మణుని హృదయ నైర్మల్యమును వినయశీలమును, సేవాధర్మమును తెలియ జేయుచున్నవీ మాటలు.

"ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ"

అని నిందోక్తులాడిన సీతను అమ్మా! అని సంబోధించుట కూడా వదిన మరదిని తల్లివలె చూచినదని స్పష్టమగుచున్నది. ఇట్లు సీతాదేవి తన చుట్టునుఉన్న బంధు, మిత్ర, పుత్ర, సేవక, ఆర్యజనులందరి మన్ననలను పొందినది. ఆమె నిరాడంబర జీవితము, వినయ శీలము, సత్యధర్మములు, పతి వాత్సల్యము, పెద్దల యెడగల గౌరవాదరములే ఆమెకొక మహోన్నతము, ప్రత్యేకమునైన స్థానము కల్పించి భారత జాతీయుల నివాళులందుకొనునట్లు చేసినవి,

మొల్ల సంక్షిప్తముగ రామ కథను చెప్పినందున కథాగమనము చకచక సాగిపోయి "కట్టె కొట్టె తెచ్చె" అను మూడు ముక్కలలో కథ కథనమును పాఠకులు తెలిసికొని ఆనందించుట కుపయోగ పడును గాని పాత్ర స్వరూప స్వభావ ములను మనము సంపూర్ణముగ అర్థము చేసికొనుటకు అవకాశము లేదని చెప్ప వచ్చును. వాల్మీకమే ఇప్పట్టున శరణ్యము. అన్నివేల శ్లోకములలోని కథను నేర్పుగా కుదించి సభూతో నభవిష్యత్తుగ రచన సాగించుటయె ఆమెలోని ప్రత్యేకత.

తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమున సీతను గురించి పలికిన పలుకులు ప్రత్యక్షర సత్యములుగా నెన్నదగినవి.

"జనకుని కూతురార్య గుణశాలిని రామునిదేవి సీతయా

తని కొలగామి నియ్యెడకు దావన వృత్తి జరింపవచ్చె" 1

అని నిష్కారణముగ నిందలు మోపి క్రూరమృగ సంకులమైన అడివిలో వదలి తిక్కనగారిబాధలకు గురిచేసిన శ్రీరాముని నిష్ఠురము లాడినాడు వాల్మీకి. వాల్మీకి ఎంతటిరామప్రియుడైనను సీతాదేవిని చూచినప్పుడా రామునికే చీవాట్లు పెట్టి బుద్ధి చెప్పవలెననిపించినది. సీతకు మాట్లాడు నేర్పు లేదనినారు కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆమె మాట్లాడిన దానికంటె ఇటువంటి ఆర్యులందరు ఆమెనుగూర్చి సమ్మాన పురస్కారముగ మాట్లాడుటయే ఆమెలోని విశిష్టత.

## పతి పరాయణ సీత

"కులంతారయతే తాతసప్త సప్త చ సప్త చ" అనుస్మృతి వాక్యములుజానకి ఆచరణలో చూపినది, "పతిభక్తి పరాసాధ్వీ శాంతా సా సత్యభాషిణీ" అన్న పలుకు ఈమె పట్ల నూటికి నూరుపాళ్లు వర్తించును, శీలవతియగు పుత్రిక కులమున ఇరువది యొక్క తరము వరకు ఉద్ధరించునన్నట్లు అతిరూపవతియైన సీత తన వినయ శీలము వలన అందరి మెప్పును బడిసినది, ఆ సతి జీవితాచరణములు ఆమె కొక విలక్షణమైన ఖ్యాతిని సంతరించి పెట్టినవి, "ఇయం సీతామమ సుతా సహధర్మ చరీతవ" అనుమాటలు అక్షరముల అనుభవమునకు వచ్చినవి, "సహోభౌ చరతాం ధర్మ"మ్మని మనువు చెప్పినదానిని జనకుడు రాముని కొలకు కన్యనిచ్చుచు ఈమె నీ "సహధర్మచారిణి" అని హెచ్చరించి యున్నాడు ఆ మాటలు జనకరాజ పుత్రి జాగ్రత్తగ గుర్తు పెట్టుకొని వనగమనము చేసినది.

సహధర్మచారిణి లక్షణములను గూర్చి శ్రీమదాంధ్ర వాల్మీకము ఈక్రింది విధముగా చెప్పుచున్నది.

"భర్తను సంతోషపెట్టు తలంపుగలది, భర్త సంతోషించునట్లు మంచి మాటలాడునది, భర్తహితముగోరి వ్రతము చేయునది, మగనికి సంతోషకరముగ గనబడునది, మగనిని తప్ప వేరొకరిపై మనసుంచనది, ప్రసన్నురాలై యుండునది, పాతివ్రత్యమే పరమ ధర్మమని యెంచునది. భర్తను సర్వదా దైవమని చూచు

---

1 నిర్వచనోత్తర రామాయణము 9–46

నది. దేవునికి చేయు ఉపచారములు మగనికి చేయునది. భర్త కంటె తాను వేరుగాదని తలంచునది. మగడు తన్ను దూషించినను, క్రూరపు జూపుల జూచినను ప్రసన్నమైన ముఖము గలది. చంద్రసూర్యులనైనను, చెట్లనైనను పురుషుల పేర్లు గలవానిని అనురాగ దృష్టి చూడనిది. మగనిచే గౌరవింపబడునది. దరిద్రుడైనను, దుఃఖితుడైనను, రోగపడచి గాసిపడినను భర్తను గొడుకువలె నుపాసించునది. కామభోగ సుఖసంపదల యందు భర్త యందుండు కోరిక కంటె నెక్కువ కోరిక లేనిది సహధర్మచారిణి యనబడును." 1

ఈ సహధర్మచారిత్వమును మొల్ల ఒక్క వాక్యమునందు సూచించినది. శ్రీరాముడు అడవికి బయలుదేరుచున్న "అనన్న యెరిగి భూపుత్రికయును దోడంబనుదేర" (మొల్ల -రా.అయోధ్య.కాం.30) అని చెప్పి మూలము నందలి కథాంశముల నన్నింటిని ఒక్క మాటలో ఒప్పగించినది. వాల్మీకి సీత ఈ సందర్భమున ఆమెలోని పవిత్ర భావనలను చక్కగ ప్రకటించి ధర్మగ్లాని కలుగ కుండ నాథుని నడిపింపదలచినదై రంగప్రవేశము చేసినది. రాము నెదిర్చి అవసర మున్న పట్టుల పరుషములాడి ధర్మోపదేశము చేసి, అత్త కౌసల్యను చక్కగ బుజ్జగించి పట్టుదలతో పతి వెంట అడవి కేగినది. త్యాగశీలగ నిరూపింపబడినది. "రామోవిగ్రవాన్ ధర్మః" అనెడి తన నాథునికే తాను ధర్మపన్నములు చెప్పవలసిన అగత్యమేర్పడినదని తెలిసికొని నందుననే చతురుపాయములతో మాట్లాడి చివరకు కార్యమును సాధించినది. "కరణేషు మంత్రి" అన్నట్లు భర్తకు హితోపదేశము చేసినది.

"రామస్యదయితా భార్యానిత్యం ప్రాణ సమాహితా

.... .... .... ....

సీతా వ్యనుగతా రామ శశినం రోహిణీ యథా"

— (వాల్మీకి.రా.బాల.కాం. 1–26,27)

అని జనక చక్రవర్తి తనయను పరిచయ మొనర్చినాడు ముందుగా వాల్మీకి. చంద్రుని విడిచియుండని రోహిణీ సతి వలె సర్వ లక్షణ సంపన్నమై శ్రీరాముని విడిచి యుండదనుటలోనే ఆమె ధర్మచారిణియైన భార్యయని రూఢి చేయుచున్నది కావ్యము.

---

1. శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము —పుట : 945, 46.

శ్రీరామునికి తెల్లవారినచో పట్టాభిషేకము. మరునాటి నుండి తానొక రాణిగ గుర్తింపబడబోవు చున్నది. అటువంటి సమయమున అశనిపాతము వంటి వార్త రాముని పట్టభంగము. దానికి తోడు పదునాల్గేండ్లరణ్యవాసము. సామాన్యమానవులైనచో నిరాశనిస్పృహలకు లోనై పరనిందకు పాల్పడి యుండెడివారు. కాని పిన్న వయస్కురాలైనను స్థితప్రజ్ఞ కలదిగ సీత ఇట పరిచయమగుచున్నది. ఆమెకా వార్త ఎట్టి బాధను కలిగింప లేదు. ఆమె పడిన వేదన అంతయు అరణ్యవాసము ముగించుకొని చిటికెలో నీ ముందు వచ్చి నిలువబడగలను అంతవరకు అయోధ్యలో నుండి అత్త మామలను, మరదులను, సేవింపుచు! సేవకుల నాదరింపుచు, దైవ పూజలు చేయుచు, వినయ శీలవై ప్రవర్తింపుమని రాముడు తెలిపిన మాటలామెకు అగ్నికి ఆజ్యధారలందినంత క్రోధము పుట్టించినవి. అందుకే రాముని చక్కగ నిలదీసి ప్రశ్నించినది.

"కిమిదం భాషసే రామ! వాక్యలఘు తయాధ్రువమ్"

— (వాల్మీకి.రా.అయోధ్య.కాం.27–2)

"నీవేమి మాట్లాడుచుంటివో! మరి నాకా మాటలు నవ్వు పుట్టించుచున్నవి" రామా! అను సంబోధనలో కర్తవ్య నిరూపణమే గాని ధూర్తురాలై కఠినముగా మాట్లాడ లేదనవచ్చును. నీవు చెప్పినట్లుగ అయోధ్యలో పడియుండుటకు కాదు నా తండ్రి నీకు నన్నిచ్చినది. నీతో కలిసి అడవులలో చరించుటయే నా ధర్మము. అట్లు గొని పోవుట నీ ధర్మము గూడ." దాంపత్యబంధమును మరచి మాట్లాడుట నీవంటి వానికి తగదు. అయోధ్యలోని వైభవముల కన్నను నాకు అరణ్యమున నీతో కలిసి జీవించుటయే ఆనందము. నా తండ్రికి కీర్తిదాయకము. భర్తకు దూరమైన భార్య లోకనిందకు గురి యగునది. నన్ను అరణ్యమునకు పొమ్మనగా నీతోపాటు నన్ను కూడ పొమ్మనియే గదా! నీకొక ధర్మము నాకొక ధర్మము గలదా! భార్యకు శుభాశుభ కర్మలలో సగభాగము నిచ్చుట భర్త ధర్మము. "నస్త్రీ కో ధర్మమా చరేత్" అని కదా సూక్తి. నాకు అయోధ్యలో సుఖములు నీ కరణ్యముల కష్టములా? ఇదెక్కడి ధర్మము. ఉత్తమురాలైన స్త్రీకి పతియే సర్వస్వము. అతని యోగ క్షేమముల తరువాతనే మరి ఇతరులైన సఖ్యుల విషయము. భర్తతో సమానమైన వారు స్త్రీకి ఇతరు లెవ్వరు లేరు. "ఇహ ప్రేత్యచ నారీణాం పతిరేకా గతిస్సదా" (వాల్మీకి.రా.అయోధ్య.కాం–27-5) అని పతిని మించిన వేరుగతి సతికి లేదని శ్రీరామునికి వినిపించినది (వాల్మీకి.రా.అయోధ్య.కాం–29, 30 సర్గలు). సాధు వర్తనము గల సీత స్వతంత్ర భావనాబలము గలది. వినయము, సౌశీల్యము గాదు

స్త్రీకి వ్యక్తిత్వము కూడ చాల అవసరమని నిరూపించినది. "అర్థోవా ఏష ఆత్మనో యత్పత్నీ" అను శ్రుతి వాక్యమును సతిని న్యాయబద్ధముగ చూడవలెనని చెప్పుచున్నది! "భద్రంతే పాణిమ్ గృహ్ణీష్వ పాణినా" అని తండ్రి మాటల నొకసారి హెచ్చరించినది సీత. ఈ విషయమును గూర్చి "Lectures on Valmik Ramayana" లో సీతా రామమూర్తి మాటలు సమంజసములుగా దోచును.

"This is Sita, my daughter, she will be your co-partener in life take her by clesping her hand in yours at this instent. She is devoted to her husband and walks in step with her throughout life (Pativrata). she is of a magnanimous disposition (Mahabagya). she will ever fallow you as a shadow does the substance." 1

ఈ హెచ్చరికతో తన భర్త కర్తవ్యమేమిటో నిరూపింప యత్నించినది. రాజ్యము, భోగములను కాలదన్ని ఇట్లరణ్యము లందు వాసము చేయుట కెంతటి త్యాగౌదార్యములు అవసరమో ఆలోచింపవచ్చును. ఈ త్యాగశీలము ఇక్ష్వాకులలో అనువంశికముగా నున్నట్టిది. ఇక్ష్వాకుల ఇంట అడుగుపెట్టిన సీత ఇట్లనుట ఆ వంశములోగల విశిష్ట గుణములు. ప్రజాయై గృహ మేధులు, త్యాగాయ సంభృతార్థులు నైన రఘువంశము నందుగల మహాపురుషులను, మహిళలను కొనియాడుచు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు చెప్పిన మాటలర్థవంతములు.

"మహామంత్ర విశ్రుత మార్గ ప్రవర్తనము ఎంత మహిమోన్నతమైనది? 'స్వధర్మే నిధనం శ్రేయమ్మని' భావించి స్వకీయ వ్యక్తిగత ప్రయోజనములకు హృదయ భావములకు తిలాంజలి నర్పించి "ఆత్మవత్సర్వ భూతాని" అను మహామంత్రార్థమును మననము చేసి చేసి పరుల కష్టసుఖములు ఆత్మీయములుగా భావించి కేవల త్యాగమయ జీవితమునే పరాయణముగా నెంచు ఒకానొక మహాధార్మిక వంశ పరంపరకు జీవము పోసినది." 1

ఈ మాటలలో సీతమ్మ త్యాగబుద్ధి నిరూపితము. 'మంత్రప్రత్యం చరామసి' అని మాంధాత తన వంశీయుల గురించి చెప్పిన విషయము ఆ వంశీయులచే ఆచరింపబడుట లోక విశ్రుతమైనది. రామయణములోని ధర్మసూక్ష్మము గమ

---

1. Lecturee on Valmiki Ramayana : page-104.

1. ఆదర్శ రామరాజ్యము, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, శాంతి, పుట : 715.

నించినచో తమ స్వసుఖముల కెవ్వరు పాటుపడలేదని ఎదుటి వ్యక్తి సుఖముల కొరకే సీతారామాది ఉత్తమ పాత్రలన్నియు ప్రయత్నించినవని చెప్పనగును. 'ప్రజానాం హితే రతులే" అందరు. కష్టసుఖాది ద్వంద్వములను సమముగా నాదరించు ఈ పవిత్ర భావములు ప్రతి భారతీయుడు మరువదగనివి.

తన భర్తతో ఇంకను ఇట్లనినది సీత. "నీతో కలిసి జీవించుట నాకు ధర్మము, నీకు శ్రేయము. అనుగుణ భార్యావంతుడైన వాడే శాంతుడు దాంతుడు. అదియే అతనికి తురీయ పురుషార్థము నందించునదని, నీ వెంట నే వచ్చినందున నీకు కష్టమేమి కలుగనివ్వను. అడవి యందు నీ వ్రతాచరణముల కెట్టి ఆడ్డు తగలను. నీవు నడచు మార్గములోనే ముందుగ పయనించి కంటకాయుతమైన మార్గమున రాళ్ళు రప్పలు ఏరి సుగమమగునట్లు తీర్చెదను. కందమూలాదులు తిని కాలము గడపగలను. నీ సుఖములకే నేను నీతో వచ్చెదనను దుంటినని భర్తను వినయముగా అర్థించినది."

"సుఖం వనే నివత్స్యామి యథైవా భవనే పితుః
అచింతయంతీ త్రీన్ లోకాన్ చింతయంతీ పతివ్రతమ్"
—(వాల్మీకి.రా.అయోధ్య.కాం. 27-11)

అని ముల్లోకము లందలి భోగములన్ని నా కవసరము లేదు. నేను నీతో కలిసి అరణ్యమున జీవించుచుచో నా తండ్రి ఇంటి యందున్నంత ఆనందముగా నుండగలను.

"స్వర్గే2 పిచ వినా వాసో భవితా యది రాఘవ
త్వయా సేహ నరవ్యాఘ్ర నాహం తదపిరోచతే"
—(పైది. 27–20)

"తద్వియోగేన మే రామ త్యక్తవ్య మిహ జీవితమ్"
—(పైది. 29–5)

అని రాముడు లేని స్వర్గము కూడ తనకు నరకతుల్యమనినది. నీతో కానిచో నాల్లనినాడు జీవించియుండను సుమా! అని హెచ్చరించినది. సీతాదేవి భక్తి వినయములతో పాటు తన వ్యక్తిత్వమును నిరూపించుకొనినది. తానెన్ని చెప్పినను కించిచ్చలనము లేని శ్రీరామునితో మరియు సీత పలికిన పలుకులు కార్యసాధనములై గోచరించుచున్నవి.

"ఆర్యపుత్ర! పితామాతా భ్రాతా పుత్ర స్తథాస్నుషా
స్వాని పుణ్యాని భుంజానాః స్వంస్వం భోగ్య ముపాసతే"

— — — —

—(వైది. 27–3–20)

స్త్రీకి మాతాపితలు గాని, సోదరులు గాని, పుత్రులు గాని, కోడండ్రుగాని భర్తతో తుల్యమైనవారు కారు. వారి పుణ్యకర్మఫలములను వారే పొందెదరు. ఒక్క భర్త వలననే స్త్రీకి అర్ధభాగము అతడార్జించుకొనిన పుణ్యఫలము నుండి ప్రాప్తింపగలదు. కాబట్టి భర్తకు మించిన అన్యమేమి కోరననినది. బాష్పపూరిత లోచనయైన సీతకు అరణ్యములోనున్న కష్టములను వివరించుచు నిరాకరింపజూచినాడు రాముడు. వన వాసము నందెట్టి కష్టములు తనకు కలుగవని శౌర్యధనుడైన భర్త సమీపము నందున్న తనకేమి బాధలుండవనినది.

యేత్వయా కీర్తితా దోషావనే వస్తవ్యతాం ప్రతి
గుణానిత్యేవతాన్ విద్ధి తవ స్నేహ పురస్కృతాన్"
—(వాల్మీకి. రా. అయోధ్య. కాం. 9–2)

నీ సన్నిధిలో వన్యమృగముల బాధ నాకెట్లుండుననినది. మరియు తనకు వనవాసము గూర్చి చిన్ననాడే తెలియునని, పుట్టినింటనున్నప్పుడు జ్యోతిషులు తాపసియైన ఒక వృద్ధ స్త్రీ భవిష్యమును సూచించినారని పలికినది. పండితులైన బ్రాహ్మణులు పలికిన పలుకులు దెలిపినది.

"లక్షణిభ్యోద్విజాతి భ్యః శ్రుత్వా2హం వచనం పురా
వనవాసకృతోత్సాహ నిత్య మేవ మహాబల"
—(వైది. 29–9)

అందువలన వనవాస క్లేశము ననాయాసముగా అనుభవింపగలననినది.

"వనవాసే2భి జానామి దుఃఖాధి బహుధా కిల
ప్రాప్యంతే నియతం వీర1 పురుషైరకృతాత్మభిః"
–(వైది-29–12)

అని వనవాసమునకు సిద్ధపడి తాను భర్తనువిడిచి యుండదగిన నేరములు చేయలేదని అట్టి పాపములు తనయందు లేవని అడవికి వెంట కొనిపొమ్మని చెప్పినది. సుఖ

దుఃఖములలో కలిసి జీవించుటయే భార్యాభర్తల ధర్మమని ప్రబోధము చేసినది. శ్రీరామునికా మాటలు కూడా సరిపోలేదు. చూచినది. రాముని అంతరంగమును పసిగట్టినది. అందుకే ఈసారి తిరిగి మరియొకమారు ప్రయత్నించి రాముని నిర్ణయ మును మార్చుకొనునట్లుచేయ సంకల్పించినది. సాత్విక వచనములు నిరుపయోగము లని ఎంచినది. అతి నిష్ఠురములైన పలుకులు పలికినది. పతినీసడించినది.

కింత్వా 2 మన్యత పైదేహః పితామే మిథిలాధిపః

.... .... .... ....

తేజోనాస్తి వరం రామే తపతీవ దివాకరే"

రామా నీవింతటి పిరికి వాడవని తెలియదు. పురుష రూపములోనున్న స్త్రీవని తెలియక కూతునిచ్చినానని నా తండ్రికి బాధ కలిగించు రీతిగ నున్నది నీ ప్రవర్తన నీవేదో చాల గొప్ప పరాక్రమవంతుడవని నమ్మియున్నదీ లోకము, అని కర్ణకఠోర ములుగ పలికినది. భరతుడు రాజు కాబోవుచుండెను.అతనికి అనుకూలముగ చరింపు మని పలికిన భర్తను ఉద్దేశించి—

"స్వయంతు భార్యాం కౌమారీం చిర మధ్యుషితాం సతీమ్

శైలూష ఇవమాం రామ పరేభ్యోదాతు మిచ్ఛసి"

-(వాల్మీకి. రా. అయోధ్య. కాం, 30-8)

అని ఎంతో కాలముగా నాతో కలిసి జీవించిన నువ్వు ఈనాడు స్వయముగా భార్యను పరుల కప్పగించు శైలూషిపై పలుకుచుంటివి, అని తిరిగి రాముడు మాటాడు అవ కాశములేని రీతిగ గట్టిగ బుద్ధి చెప్పినది. ఇట్లు సామదానభేద దండోపాయములతో పతినెదిర్చి చివరకు సఫలీకృతమైనది. వితండవాదములు కావివి, ధర్మప్రబోధములు. భర్తను సక్రమ వర్తనుని చేయుట భార్యగా తన కనీస ధర్మము. అందుకే వెనుక ముందులాలోచింప వలసిన పనిలేకుండ రామునికి మెత్తగా చీవాట్లు పెట్టినది. శ్రీరామునిపై గల ప్రగాఢానురాగమే. పతివ్రతాను శీలమే ఆమె చేత అట్లు పలికింక నది. కాని అతనినొక పనికిమాలిన వానిగా నీచత్వమాపాదించుటకు గాదు. కర్తవ్య ప్రబోధములు. వెంటనే పతిని కౌగలించి బిగ్గరగా విలపించినది సీతాసతి, పతిని దూరము చేసికొని బ్రతుకు సాగింపలేనని వెంటవచ్చి తీరెదనని పట్టుపట్టినది.

"ఇతిసాశోక సంతప్తా విలప్యకరుణం బహు

మత్క్రోశ పతి మాయస్తా భృశ మాలింగ్యన స్వరమ్"

—(వైది 30—22)

శ్రీరాముడు వెంటనే అరణ్యవాసమునకు అనుమతినిచ్చి దైవపూజలు, దానధర్మలు చేసి సిద్ధముగ నుండుమనినాడు, చతురుపాయశాలి సీత చాల గడుసరి కూడ, ప్రౌఢ వచోగుంభనలతో పతిని మెప్పించినది. పతిని తూలనాడినదని మనసునకొని నంత మాత్రమున సీతకు చిన్నతనమేమి లేదు. ఆమెకు ముఖ్యము రాముడు, ఆ రాముడే మనెనో చూడండి.

తాం పరిష్వజ్య బాహుభ్యాం విసంజ్ఞామివదుఃఖితామ్

.... .... .... ....

.... .... ....

తంచాహమను వర్తే2ద్యయథా సూర్యం సువర్చలా"

—(వాల్మీకి. రా. అయోధ్య. కాం, 30, 26–30)

అతనిని చుట్టుకొని విలపించుచున్న సీత ఇట బేలగ నిరూపింపబడినది. ఇంతదనుక అర్థించి, బెదరించి అంగీకరించునట్లు చేసిన సీతావ్యక్తిత్వములో ప్రౌఢతనము. ధీర త్వము, రాజసము మాయమై స్త్రీ సహజమైన వ్యక్తిత్వము స్ఫురించినది. కొలను నుండి బయటకు తీసిన కమలము సూర్యుని తాపముచే కమలిన రీతి భర్త ఎడబాటు ఊహించుకొనిన సీత ముఖములోనున్న దైన్యమును చూచిన శ్రీరాముడు సతిని అక్కున చేర్చి ఊరడించినాడు. దేవీ! నీవు దుఃఖించిన సహింపజాలను. స్వర్గభోగ ములనైనను కోరను. నీ యభిప్రాయము నెరుంగ తలంచి ఇట్లు మాటాడితిని. నాతో వనవాసము చేయుటకే దైవము నిన్ను సృజి యించినాడు. కీర్తికాంతవలె నీవు నాతోనే ఉండుము. సూర్యుని వీడని సువర్చల వలె సీతోడిదే నా జీవనము కూడ అని పలికినది రాముని హృదయము. భార్య హృదయమును పరీక్షింపదల చాడట, నిజముగా ఆమెను అరణ్యమునకు తీసికొనిపోవు ఉద్దేశముగల దన్నాడు. భర్త హృదయములోని అంతర్యమును ముందుగ గ్రహింపగల ఇంగితజ్ఞానము గలదిగా సీత పరిచయమగుచున్నది. మగని మనస్తత్త్వమును చక్కగా నెరిగిన ఇల్లాలు జానకి. ఏ కోరిక కోరబోవుచున్నాడో ముందుగ పసికట్టి తదనుగుణముగా నడచుకొను నేర్పు కలిగి జీవితమును స్వర్గతుల్యము చేసికొనినది.

కౌసల్య అరణ్యమునకు బయలుదేరనున్న సీత విషయము తెలిసి జానకికి సీత్యుపదేశము గావించుచు పలికిన విషయములు చక్కగా ఆలకించి వినయముతో అత్తగారిని మన్నించి ధైర్యమును గొలుపు మాటలాడినది జానకి. కష్టములలో

భర్తను అనుసరించి నడుచు స్త్రీలు చాల తక్కువయని సంపదలున్నప్పుడే గౌర వించి కష్టములందు నిరాదరించెదరని పలికి—

"అసత్య స్సర్వ లోకేస్మిన్ స్సతతం సత్కృతాః ప్రియైః

.... .... .... .... ....

తవ దైవత మస్త్వేష నిర్ధనః సధనో 2 పివా"

[—వాల్మీకి.రా.అయోధ్య.కాం.39-20-25]

నీవు ఉత్తమురాలివైన స్త్రీవి కాబట్టి ఇతర స్త్రీల వలె ప్రవర్తించి భర్తను అనాద రింపకుమనినది, చిత్తచాంచల్యము గలవారు స్త్రీలనినది కౌసల్య. ఉత్తమురాలైన స్త్రీకి ఈ మాటలు వర్తించెడివికావని తనను అనార్యులతో పోల్చి మాటడవలదని వినయముతో వారించుచు సీత—

"విజ్ఞాయ వచనం సీతా తస్యాధర్మార్థ సంహితమ్

కృతాంజలి రువా చేదం శ్వశ్రూమభి ముఖే స్థితామ్

.... .... .... ....

.... .... .... ....

సీతా యా వచనం శ్రుత్వా కౌసల్యా హృదయంగమమ్

శుద్ధ సత్త్వా ముమో చాశ్రు సహసా దుఃఖ హర్షజమ్"

[-వాల్మీకి.రా.అయోధ్య.కాం. 39-26–32]

తనకు ప్రాణతుల్యుడైన శ్రీరాముని విడిచి క్షణము కూడ జీవింపనున్నది. కౌసల్యా నందవర్ధనుడైన తన పతి వలన ఆ తల్లికి కలుగబోవు ఎడబాటు ఎంత భయంకర మైనదో ఊహించుకొని ఆమె హృదయములోని ఆర్తిని తొలగించుటకై తగిన సమాధానముల నిచ్చినది. తీగలేని వీణవలె, చక్రములు లేని రథమువలె భర్తలేని బ్రతుకు భార్యకు నిరుపయోగమనినది. పగటివేళ చంద్రుడు కాంతిహీనముగాకన బడినను చంద్రుని కళలు అతనిని వీడియుండనట్లే తాను తన భర్తను విడిచియుండ ననినది. నూర్గురు పుత్రులున్నను భర్తవలన లభించు సుఖము భార్యకు దొరకదని కౌసల్యతో పలికినది సీత. ఈ విషయమును సమర్థించుచు సీతారామమూర్తి తనను రామాయణోపన్యాసములందు వివరించిన విషయములు సీతా పాతివ్రత్య ధర్మము నకు ఉపబలకములని చెప్పదగును,

Without the strings, the Veena cannot produce music without the wheels the chariot cannot make movemant. Likewise no woman can afford to neglect her husband and find happiness or make progress. The strings bear the strain but the credit for music goes to the Veena. The wheels bear the burnt of the bullats of stones and strimps but the chariot gets the praise for a Journey, The husband receives the knocks of life but the wife gets renoun for his achievements.

భర్తకు యశమాపాదింప జూచు స్త్రీ ఎటువంటి కష్టములైన భరించుటకు వెనుకంజ వేయదని దీని యర్థము. కష్టమొకరిది సుఖమింకొకరిది, అనునది లోక సామాన్య ధర్మము. భర్త కొఱకు భార్య ఇటువంటి శ్రమ పడక తప్పదని దానిని తాను త్రికరణ శుద్ధిగ అనుభవింపగలనని సీతమ్మ అత్త కౌసల్యతో భాషించి నది. "సీతా యాశ్చరితం మహత్త"ని వాల్మీకి వంటి ఋషి ఉబుసుపోకగ చెప్పిన మాట యనగలమా! పెద్దల యెడ వినయ విధేయతలే గాదు సమయస్ఫూర్తి గూడ గలది సీత. సంస్కారము వ్యక్తిగత విషయము. అది ఆ వ్యక్తి నేర్చిన చదువుల వలన కలిగెడిది గాదు. గాని విద్యకు వినయమువలె చదువు సంస్కారమునకు బలపడును.

ఏ ధర్మ కార్యమునైనను సపత్నితో కలిసి చేయవలెను. "క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సపత్నీమూల కారణమ్మని" కాళిదాసు చెప్పినట్లు భర్తనను సరించి తమ విధ్యుక్త ధర్మముల నెరవేర్చుకొనునట్లు ప్రవర్తించిన సౌభాగ్యశీలము గలది సీత. పతిని ధిక్కరించిన సీత అత్త దగ్గర వినయముతో ప్రవర్తించుట ఆమె ఉచితానుచితము లెరిగిన దనుటకు దాహరణము.

సీతా రాములు అగస్త్యాశ్రమము చేరినప్పుడు ఆ మహర్షి పతి వెంట వచ్చిన సీతను చూచి కష్ట సమయము లందును నీ భార్య నిన్ను ఇట్లు విడువక నీతో పాటు కలిసి జీవించుట నీ అదృష్టమని రాముని ప్రశంసించినాడు. (అరణ్య-13,5,6) గరుడ, వాయు వేగములను మించిన చంచల చిత్తము గలవారు స్త్రీలు. కానీ ఈ

---

1, Women in Valmiki Ramayana, page : 129.

జానకి యందట్టి దోషములేదు. అసాధారణ స్త్రీమూర్తియైన ఈ జానకిని నీవు మిక్కిలి ఆదరణతో చూడుమని రామునితో చెప్పెను.

సుతీక్ష్ణ, అగస్త్య, అత్రిమునుల ఆశ్రమమును చేరిన సీతారాముల అరణ్యవాసమును విపులముగ వర్ణింపలేదు మొల్ల. యుద్ధ కాండము మూడవ ఆశ్వాసమునందు అయోధ్యకు బయలు దేరిన రాముడు పుష్పకమెక్కి వెడలుచు సీతకు పూర్వము తాము తిరిగిన అరణ్య భూములను పరిచయము చేసిన విషయమును సూచించినది. [మొల్ల•రా•యుద్ధ.కాం. 3-125]

సీతా అనసూయల సంభాషణగాని అత్రిమునీంద్రుని సంభాషణలుగాని మొల్ల చిత్రింపలేదు. జానకిని అనసూయకు పరిచయము చేయుమని అత్రి వాలకము జానకిని మిక్కిలి గొప్పగా అభినందించుటను తెలియజేయును.

"తామి మాం సర్వభూతానాం నమస్కార్యాం యశస్వినీం
అభి గచ్ఛతు వైదేహి వృద్ధా మక్రోధనాం సదా
.... .... .... ...
— — — —
అంగరాగేణ దివ్యేణ లిప్తాంగి జనకాత్మజే
శోభ యిష్యసి భర్తారం యథా శ్రీర్విష మవ్యయం"
—వాల్మీకి.రా,అయోధ్యా.కాం– (117–13, 18-118-2, 20)

అనసూయతో సీత చిన్ననాటనే తాను నేర్చుకొనిన సతీ ధర్మములను పాటించుచుంటిననినది. అరణ్యమునకు వచ్చునప్పుడు అత్త కౌసల్య, పుట్టినింట నున్నప్పుడు తన తల్లి తనకీ ధర్మములు చెప్పియున్నారని వినయముతో విన్నవించి తిరిగి అనసూయ చెప్పిన మాటలను అసూయలేని సీత ఆలకించినదని వాల్మీకి వివరించినాడు, అంగరాదాది వస్త్రాభరణములతో సీతను సత్కరించినది అనసూయ పతి శుశ్రూష యందత్యంత అనురక్తయైన సీతను అత్రి అనసూయలు మిక్కిలి గొనియాడుచు శ్రీరాముని భాగ్యమునకు మిక్కిలి సంతసించిరి,

"అనుకూలాం విమలాంగీం కులజాం కుశలాం సుశీలసంపన్నాం
పంచలకారాం భార్యాం పురుష పుణ్యోదయాల్లభతే"

అను ఆర్యజనుల సూక్తికి "పుంసాం మోహన రూపుడైన రాముని జీవిత వృత్తము ఆలంబన మైనది,

# అశోకవనిలో సీత

రామాయణ కావ్యమునకే హృదయ స్థానీయమైనది సుందరకాండము, మొల్ల రామాయణము నందును ఈ విషయమున కట్టి ప్రాధాన్యమే తెలియవచ్చును, వైదేహీ హృదయ సౌమనస్యమునకు పరాకాష్ట ఈ కాండము. జానకికి గలకుశాగ్ర బుద్ధికి, నిశిత పరిశీలనా వైదగ్ధ్యమునకు, సంభాషణ చాతుర్యమునకు, ధీరత్వమునకు పాతివ్రత్యమునకు వరసీమ. ముఖ్యముగా సీతారావణుల మధ్య, హనుమత్సీతల మధ్యన జరిగిన సంభాషణములు సీతా చరితమునకు మణిదీపములు. ఈ సన్నివేశ చిత్రణమును మొల్ల యథా వాల్మీకముగనే చిత్రించినది. జానకి చరిత్రను వర్ణించు పట్టుల ఏయే తావుల యందు పాత్రకు జీవము పోయవలెనో చక్కగ ఎరిగినది మొల్ల. సజీవ శిల్ప సౌందర్యమును ప్రదర్శించి సంభాషణల పట్టున నేర్పును చూపించినది. స్త్రీ కర్తృకము కాబట్టి లంకాధిపతి మాటలలోని నైచ్యమును ఖండించు పట్టున్న రసౌచిత్యముతో చక్కగ వర్ణించినది. జానకి నొక వీరనారీమణిగ మలచి నది. పరమ పవిత్రము. ధీరగంభీరము నైన మైథిలి మానసము మనకు పరిచయ మొనర్చినది. సీతమ్మ శీల విభవముతో పాటు మొల్ల కవితాశక్తి కూడా భద్రాసన మలంకరించినది. అరణ్యము నందున్న సీత కడకు శూర్పణఖ ప్రేరణతో రావణుడు వెళ్ళి ఆమెను వెంటనే అశోక వనమునకు చేర్చినాడు మొల్ల రామాయణమున. మాయా పరివ్రాజకుడు తన పర్ణశాల ముంగిట నిలిచినప్పుడు అమాయకమైన స్త్రీ మూర్తిని మనకు పరిచయము చేసినది మొల్ల.

"దీవించుడు మునియే యని
భావింపుచు జేరవచ్చు భామిని నపుడా

.... .... ....
.... .... ....

—(మొల్ల.రా.అరణ్య.కాం.36).

ఈ విషయము వాల్మీకము నందు విపులముగా వర్ణింపబడినది. అతిథి అభ్యాగత సేవలతో కూడిన కథాంశములు సీతారావణుల సంభాషణములు సీతాప హరణమునకు ముందే వర్ణింపబడినవి. కాని ఇది ఔచిత్యముగా తోచదు. దొంగ తనముగా సీతను కొనిపోవచ్చిన రావణుడు, వెంటనే జానకి నపహరించుట ఔచిత్యముగా నున్నది. అతిథి పూజా విషయములను కూడ సూచించినది మొల్ల.

అట్లే రావణుడపహరించుకొని పోవుచున్నప్పుడు వర్ణించిన సీత ఆర్తనాదమును కూడ మొల్ల సంక్షిప్తపరచినది. దీని వలన కథకు జరిగిన లోపము శత్రువు చేతిలో నున్న సీతామన స్తత్త్వము దెలిసికొను అవకాశము లేకపోవుట. భాస్కర, రంగ నాథులు యథా వాల్మీకముగ ఈ విషయములు విపులముగా చిత్రించిరి. ఈ సంక్షిప్త రచనలో కూడ సీతమ్మకు గల సమయస్ఫూర్తిని విస్మరింపలేదు మొల్ల. పలు విధములుగా రనత ఆక్షణమై దిక్కుల నుద్దేశించి ఆర్తనాదము చేసిన సీతగిరి చేరువ నందున్న సుగ్రీవాది కపి పంచకమును చూచి తన ఆభరణములు చీర చెరగున కట్టి ఋష్యమూక పర్వతముపై వేసినది. సీతకు గల సమయస్ఫూర్తికి, నిదర్శనమిది. (మొల్ల.రా.అరణ్య.కాం.40–45). అట్లు గొనిపోయి సీతను అశోకవని యందుంచి నాడు రావణుడు. అతను సీతను వశపరచుకొను యత్నమునకై ఆమెను అశోకవని చేర్చినాడు. అశోక మనగాశోకమునకు దూరముగా నుండవలసిన సీత కంటికి మంటికి ఏకధాటిగా శోకించినది గదా! అనిపించును. ఇట అశోకవృక్షము యొక్క ఓషధీ గుణమును "అశోక వనికా న్యాయము" వివరించు చున్నది (విద్యార్థి కల్పతరువు సంస్కృత న్యాయములు). తన సమస్యను పరిష్కరించుకొను నిమిత్తమై రావణు డామె నట చేర్చినాడని చెప్పతగును. అశోకవృక్షములు స్త్రీల ఋతు సంబంధ విషయమున దోహదకారులని. అట కొంత కాలము వాసము చేసిన జానకిని తాను వశపరచుకొనుట సునాయాసమని రావణుడు తలంచినట్లు విశ్వనాథసత్యనారాయణ గారు రావణుడు సీత నశోకవని చేర్చిన కారణమును నిరూపించిరి.

"The Asoka plant, as can be seen from the medicines prepared for menstruel disease of women, has much to do with the sex of women. Perhaps he thought, by her long stay in the Asokavana, breathing the air that waves over the branches of Asoka trees, She would become sexy. Sita is placed there. Ravana kept her there Sita is there. what does he think?, What does she think? 1"

రావణుడు సీతను కైవస మొనరొచ్చుకొను ఉద్దేశ్యముతో ఆమెనట చేర్చినాడు. ఆతడాసించినది వేరు. జరిగినది మరి యొక తీరు. క్రూరులైన రాక్షసుల మాయా జాలములు, బాధలు ఆమె నేమి చలింపనీయలేదు.

సుదృఢవ్రతయై, ధీరముగ నిలిచిన సీత పరిస్థితుల ప్రభావమునకు తల

---

1. What is Ravana to me, Page. 37.

యొగ్గలేదు. నీతి మంతులు, పతి పరాయణులు ఎన్ని అవాంతరము లెదురైనను శీల భంగమునకు సమ్మతింపరు. శీలమనగా స్వభావ స్థిమైన సద్వృత్తము 'శీలం స్వభావే సద్వృత్తే' అనగ నియతకులోచితమైన సత్స్వభావమే శీలము. 'శీలంతు నియత కులోచిత సత్స్వభా ఇతి వివేకః" అని పెద్దలు వచింతురు. అనగా ఆయా జాతులకు శాస్త్రాదులయందు నిబద్ధింపబడిన వృత్తులను. నియమ పూర్వకముగ పరిపాలన పరిపాలన చేయుట యని అర్థము. తన కుల వృత్తిని ఆశ్రయించి సత్యధర్మ శౌచ ములను వీడక మనుగడ సాగించి మాన్య చరిత్రలుగ ప్రసిద్ధి నొందిన ధర్మ వ్యాధాది మహాశయులిందుకు ఉదాహరణములు. కులీనమైన స్త్రీ నడవడికలో వక్ర గతులుండవు. 'సర్వేషామపి సర్వకారణ మిదం పరం భూషణమ'ని (1) సుభాషిత త్రిశతి స్పష్టపరచు చున్నది. సంకట పరిస్థితులెదురైనను పావన చరిత జానకి ప్రాణము పణముగ పెట్టదలంచినది గాని వేరు ప్రవర్తన లేనిది. ఈ శీల విభవ మును నిరూపించునదే రావణ సీతా సంభాషణము. ఆమె పతి పరాయణత్వము నాన్యతో దర్శనీయము. అటువంటి పాతివ్రత్యము ముందా రావణుడు పాదాక్రాంతుడు కావలసి వచ్చినది. ఆత్మజ్ఞాన తేజోవిలసిత మూర్తి సీత యెక్కడ కామాంధకార ఉన్మత్త మూర్తి రావణుడెక్క తేజమున్న చోట తిమిరము ఎట్లుండును? అందుకే రావణుడు సీతను సమీపింప లేకపోయెను.

అశోకవని యందున్న సీతను తన స్వాయత్తము చేసి కొనుటకై రావ వణుడు బయలుదేరి వెళ్ళినాడు. ఆమెకు తన ఔన్నత్యమును గూర్చి వివరించుకొని నాడు. (మొ. రా. సుం. కాం. 42–58)

రావణుడు తన వైభవము నంతటిని అలంకారములోన చూపించుట గాక సీతతో చక్కగ వివరించినాడు. మిక్కిలి కౌతూహలముతో సీతను చేరి శ్రీరామునకు అతనికి ఉన్న భేదమును సీతకు వినిపించినాడు.

"తోయజదళాక్షి వలరాయడిటు లేచిపటు
సాయకము లేర్చియిపుడేయం॰ దొడఁగెన్—"

— — — —

ఎత్తితి శంకరాచల మహీన బలంబున బంతిలాగునన్—"
(మొల్ల. రా. సుందర. కాం. 42–48)

---

1. భర్తృహరి, నీతిశతకము–ధైర్య పద్ధతి–80.

అని రావణుడు సీత దగ్గరకు వచ్చి తనను కరుణింపమని వేడుచు సీతకు అతని ఐశ్వర్య బలమును, రాజ్యబలమును, అందమును, తెలియజేసినాడు. కుబేరాది యక్షులు తనకిచ్చిన చీని చీనాంబరములు గలవని దేవేంద్రుడు ప్రతి నిత్యము తనకు పారిజాత పుష్పములు కానుకగ నొసగునని, దక్షిణాధీశుడు పంపిన సురభి కర్పూరాది పరిమళ ద్రవ్యములు గలవని, పాతాళము నుండి ఫణిసార్వభౌముడు పంపిన భూషణములుగలవని, ఆమెకు ఆశలు చూపించినాడు, తన బాహుబల దర్పములను ప్రకటించుకొని అంతటితో ఆగక శ్రీరాముని ఒక అల్ప పరాక్రమగలవానిగ నెంచి కించ పరచి మాట్లాడినాడు.

"జడలు ధరియించి తపసుల చందముసను

— — — —

— — — —

వ్రీడ యలంకారముగా నాడుము భయముడిగి మధురమైన మృదూక్తులన్"

(మొల్ల రా. సుందర కాం. 50, 57)

అని ఆ ధూర్తుడు నోటికి వచ్చిన రీతి తన గొప్పతనమును సీతకొక ఎరగా చూపించి శ్రీరాముని నిందోక్తులాడినాడు.

సీతమ్మ పతిభక్తిని రావణుని యందున్న అసహ్యపు భావమును, రాముని శౌర్యమునందున్న నిండైన విశ్వాసమును, మేరు తుల్యమైన సీత ధీరత్వమును ఈ సందర్భమున మొల్ల ధారా శుద్ధిగల చిక్కని పదముల ప్రయోగించి మనోజ్ఞముగా రచించినది, ఆ నీచుని మాటలన్నియు వినిన సీత తోక త్రొక్కిన కన్నెనాగినివలె రావణునిపై బుసలు కొట్టినది. ఆ దురాత్మునితో మాటాడుటయే చాల అపరాధముగా, పాపముగానెంచి ఆ పాప ప్రక్షాళనమునకై తన ముందొక గడ్డిపోచ పెట్టుకొని ఆ రావణునికి చురకల వంటి మాటలు వినిపించినది. రావణునిలోని అల్పత్వమునకు కూడ నిదర్శనమా గడ్డిపోచయని ఆమె భావన.

సీతాదేవి ఒసగిన ప్రతిభాషణములు ఎనిమిది గద్య పద్యములలో వర్ణించిననేమి వాల్మీకముతో తుల్యమైన భావ ప్రకటనము చేయించినది మొల్ల.

"పతి దైవముగా నెప్పుడు

మతి దలచుచు నుండునట్టి మగువల జెరుపన్

.... .... .... ....

.... .... .... ...."

"పరదారా పేక్షకులగు

పురుషుల కాయువు నశించు బుణ్యము సెడున

.... .... .... ....

.... .... .... ...."

—(మొల్ల.రా.సుంద.కాం. 59-60)

అని పతివ్రతలను పరాభవించు నీ వంటి ధూర్తునితో మాటాడుటయే నాకు దోషమని నది. నీ వంటి వానికి పుణ్యములు నశించి ఆయువు చెడునని నరకమున పడెదవని హెచ్చరించినది.

"తన సాహసంబు తానే

.... .... .... ...."

—(మొల్ల.రా.సుందర.కాం.62)

ఒక్క ముక్కలో నాతని శౌర్యమేపాటిదో తెలిసికొనగలిగినది. శౌర్యవంతుడెన్నడు తనను తాను పొగడుకొనడని సీత భావించినది. తన భర్తను అతి దీనునిగా భావించిన వానికేమని సమాధాన మొసగినదో వినుడు.

"సంగర రంగమందు నతి శౌర్యమునన్ రఘురాము తోడ మా
తంగ తురంగ సద్భట శతాంగ బలంబుల గూడి నీవు పో
.... .... .... ...."

—(మొల్ల.రా.సుందర.కాం.63)

నీకు రాముని యందున్న భయము వలననె ఆతని సతినైన నన్ను దొంగతనముగా తెచ్చితివి. ఇక ఈ వీరలాపన లెందుకు? ఖర విరాధాదులను పదునాలుగు వేల రాక్షసుల నుక్కడగించిన నానాథుని గూర్చి వినియుండియు సిగ్గులేక మాటాడు చుంటివి? నీకు నా రాముని గూర్చి తెలిసినచో ఇట్లు మాట్లాడవు. నీ అవివేకమని తెలియుచునే యున్నది. కుత్సితులైన నీ వంటి నీచుల ప్రలోభములకి సీత తలయొగ్గెడిది కాదు జాగ్రత్త అని హుంకరించినది. మూలమున గూడ సీత వానితో ఇట్లే ధిక్కరించి మాట్లాడినది.

"అకార్యం సమయా కార్యం ఏకపత్న్యా విగర్హితమ్

....    ....    ....    ....

అనన్యా రాఘవేణాహం భాస్కరేణయథా ప్రభా...."

-(వాల్మీకి.రా.సుందర,కాం, 21-4-15)

పర స్త్రీని కాంక్షించి వినాశము కోరి తెచ్చుకొనవలదు, నీకు నేను వశ మగుదాననుకాను. భాస్కరుని వీడి కాంతి ఎట్లుండదో అట్లే నేను శ్రీరాముని వీడి యుండను అని అతనికి బుద్ధి చెప్ప ప్రయత్నించినది.

"యథాతవ తథాన్యేషాం దారా రక్ష్యానిశాచర

ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్"

(పైది, 21-7)

ఓ రావణా! నీకు భార్యాభర్తల పవిత్ర బంధము తెలియదు. నీ అర్థాంగిని పరులు ఎట్లు రక్షింపవలెనని భావించెదవో అట్లే నన్ను భావించి రక్షింపుము. నీకు యీ మాత్రము తెలియదా లేక తెలియజెప్పువారు లంకలో లేరా

"ఇహసం తోన వాసంతి సతో వానా నువర్తనె

తథాహి విపరీతాతే బుద్ధి రాచార వర్జితా...."

[పైది 21-8-10]

అని పలికి అట్టి పండితులు లేకకాదు. నీవంటి ధూర్తునకా హితవు రుచించి యుండ దనినది. అని ధైర్యముగా రావణుని వంటి ధూర్తుని ఎదిర్చి నిలిచినది.

మొల్ల తన కావ్యమునందు సీతాదేవి హృదయ పావిత్ర్యమును ధైర్య సాహసములను మిక్కిలి హృద్యముగ నిరూపించినది. నిర్జన భూమిలో, తుచ్ఛ వాంఛా లంపటుడైన రావణునికి బాగుగ బుద్ధి గరపినది. వీరనారివలె రణరంగ ధీరగ నిలిచినది. రావణుని శపింపగలదు. కాని తన పాతివ్రత్యమును అందులకై వెచ్చించుటగాని. తన పతి ఆజ్ఞ లేకుండా వానిని శపించుటగాని చేయనని పలికినది.

ఒక సామాన్య మానవుడని శ్రీరాముని భావించిన ఆ నీచునికి తన నాథుని పరాక్రమమును, అతని శక్తి సామర్థ్యములను గురించి తెలియ చెప్పినది.

"కూకటి ముడికినై కురులు గూడని నాడె

.... .... ....

రామ భూపాలు డాది లరాయణుడు"

(మొల్ల.రా.సుందర.కాం.64).

శ్రీరాముని అతి హీనగుణునిగా నెంచిన నీవేనా అతని భార్యనైన నన్ను దొంగ తనంగా తెచ్చితివి. ఇంతకు ముందే విరాధ ఖరాదాది; రాక్షసుల పాట్లన్నియు దెలిసియు ఎందుకీ ప్రలాపములు. శ్రీరాముని ప్రతాపోన్నతులు తెలిసినచో ఇట్లు మాట్లాడవు. చిరుత ప్రాయము నందే తాటకను చంపెను మారీచ సుబాహాది క్రూరులను శిక్షిం ఏ ఒక్కరును సాహసించి శివధనువును సమీపింప లేవని, అట్టి ధనువు దుని మిన వీరుడనినది. సామాన్య మానవుడు గాదు శ్రీరాముడు. అతని పాదరజము చేతనే రాతిని నాతిగా మార్చినాడు. మాయా మృగమును సంహరించిన శ్రీరాముడు రాజమాత్రుడని భావింపకు. సాక్షాన్నారాయణుడె జాగ్రత్త అని అతని గుండెలవియు నట్లు రోషముతో పలికినది.

"నన్యపత్రప సేనీచ కర్మణానేవ రావణ...."

—(వాల్మీకి·రా.అరణ్య.కాం.53.1.7)

నీచాత్ముడవై రాముని భార్యను దొంగిలి తెచ్చిన నీవు శ్రీరాముని దూలనాడుచుంటివి. ధైర్యమున్న సంగరమున పోరి ఎదిర్చియుండెడివాడవు. అని రావణుని శౌర్యమే పాటిదో నిముషములో గ్రహించిన కుశాగ్రబుద్ధి మెరుగుచున్న కుక్కవలె ఆ రావ ణుడు తనని కాని తన నాథుని గాని ఏమి చేయలేడను నిశ్చింత ఆమెలో స్పష్టముగా గోచరించుచున్నది.

మొల్లమ్మ రావణుని ఎదిర్చి నిలిచిన తన కావ్యనాయిక, ధైర్యసాహస ములను నిరూపించిన తీరు ప్రశంసనీయము. శ్రీరాముని పరాక్రమమును ఎన్నొట గాదు గట్టిగా హెచ్చరించుచున్నది సీత· నీవే జూచెదవుగాక శ్రీరాముని శౌర్య ప్రతాపములని.

"అట్టి రాముని కీయట్టి యనగ నెంత

.... .... ...."

గుర్తునకువచ్చి వచ్చినవాడే రాక్షసుడోయని మనసులో వెరగందినదిజానకి. ఆమెసంశ యాత్మక బుద్ధికి, నిశితమైన ఆలోచనా శక్తికి ఉదాహరణముగా చెప్పదగిన మాటలు

"ఆ మాటలాలించి భూమిజ తనలోన
వెఱగంది శింశుపావృక్ష మరసి."

-(మొల్ల.రా.సుందర.కాం. 92)

అది తెలిసిహనుమ ఆ దేవి అతనిని విశ్వసించుటకై శ్రీరామలక్ష్మణులు ఋష్య మూకమునందు సుగ్రీవుతం మైత్రి చేయుచుండిన విషయము యుద్ధమునకు సిద్ధపడు కథాంశములు వివరించినాడు. మరియు రామచంద్రుడిచ్చిన ఆనవాలు అంగుళీయకము నిచ్చెను. అది చూచి రాముని ముద్రికగా మదినెంచినను అతనిని విశ్వసింపక "నీ వచ్చిన దాని భావమును వల్లభ చందమును" వివరింపుమని అంత వరకు నేనిన్ను విశ్వసింప జాలననినది. (మొల్ల.రా.సుందర.కాం.93–95)

"నిను విశ్వసింప జాలను
— — ."

పైది–97.

అప్పుడాంజనేయుడు శ్రీరాముడు సుగ్రీవునితో చేసిన చెలిమిని, సీత ఆభరణముల వివరణము, వానిని ద్రుంచిన రాముని భుజ దర్పమును, సుగ్రీవుని రాజ్యమున నెల కొల్పినసంగతి,కపులందరిని నలుదిక్కులకు సీతాన్వేషణమునకు పంపించిన,విషయము లన్నింటిని వివరించినాడు. అయినప్పటికిని రాక్షస మాయలతో బాధలనుభవించు చున్న ఆమె చిత్తమునకు విశ్వాసము పుట్టింపలేదు.

"ఇవ్విధంబున బలుకుచుండినను నమ్మక యతనింగనుగొని
— — — —

—(మొల్ల. రా. సుందర. కాం. 101.)

శ్రీరాముడేరీతి వాడో తనకు వివరింపమని అడిగినది. ఇది ఆశ్చర్యముగా దోచెడి మాటలివి శ్రీరాముడెట్లుండునో ఆమెకు తెలియకనా, కాదు. ఆ రాముని చిత్తమందు పూర్వానురాగమున్నదో లేదో తెలిసికొనుటకే ఆమె హనుమంతుని ద్వారా విషయ గ్రహణము చేయు ఉద్దేశ్యముతో ఇట్లడిగి యుండుట నిస్సంశయమైన మాట.

"నీల మేఘచ్ఛాయ బోలు దేహము వాడు
ధవళాబ్జపత్ర నేత్రముల వాడు
.... .... ——

"వీరాలాపములాడ నేల వినుమీ విశ్వ ప్రకాశంబుగా

.... .... ...."

"ఆరూఢ ప్రతిమాన విక్రమ కళాహంకార తేజోనిధిన్

.... .... ...."

—(మొల్ల.రా.సుందర.కాం. 65–45-67)

అని శ్రీరాముని ఔన్నత్యమును, రావణుని అల్పత్వమును బేరీజు వేసి ఒక్కసారి అవగాహన చేసికొనినీ వెవరివో తెలిసికొని ప్రవర్తించు జాగ్రత్త! అని దుర్మార్గుడైన రావణుని ధైర్యముగా ఎదిరించి మాటాడినది. తన పతి యుందున్న గౌరవ ప్రపత్తులు, భక్తి విశ్వాసములు చాటినది. కులస్త్రీకి కావలసినది భర్త యనురాగము గాని నీ వంటి వాని ఐశ్వర్యముగాని, అందముగాని కాదు. నీవు వియోగాలము దాపు రించినవాడిపై నీ పాలిట మృత్యువుని ఆశించితివి సుమా! అని రావణుని సాహస ముతో ఎదిర్చినది. నీవంటి లోకకంటకుని పరిమార్చి భూతములకు భుక్తులు పెట్ట గలడు రాముడు. అట్టి నా రామునికి "నీవెంత నీ లావు చేవెంత'' రాముని బాణా గ్నిలో మిడుతవై నశించు సమయమాసన్నమైనది అని అపహసించినది. ఆ మాటలు విని ఒడుపు దప్పిన కాలాహి చందమున ఉగ్రుడై నాడు రావణుడు.

"నాకు నెదిరింప నొక పేద నరుని నొడ్డి

.... .... ...."

(— మొల్ల.రా.సుందర.కాం. 74)

అని కత్తి ఝళిపింప అక్కడ నున్న రాక్షసాంగనలు శాంతింప జేయగ

"గడు విచ్చితి నిరు మాసము

.... .... ...."

(పైది 79)

అని చెప్పి తిరిగి పోయినాడు రాక్షసేంద్రుడు. అటు పిమ్మట సీత పాత్రను అతి సహ జముగా ఆమె స్త్రీ సహజమైన భావనల కాలముగ చిత్రించినది మొల్ల.

తన పతిని నిందించుటకును, తనను ఖండించి తినుదనినందులకు ఆసీతలో అప్పటి వరకు వున్న ఆ ధైర్యమేమైనదో మరి.

"తన పతి నిందించుటకును

.... .... ....

(పైది. 81)

తననుచంపుమని రావణుడాజ్ఞాపించి నందులకు, తాను చెప్పిన హితమా మూర్ఖునకు రుచింప నందుకు రాముని సతి ఎలుగెత్తి ఏడ్చినదట. ఆమెలోని స్త్రీత్వమును స్వభా వోక్తి మధురముగా చెప్పినది మొల్ల. జానకి శోకింప సాధ్య కిన్నర యక్ష గరుడో రగామర కాంతలెల్ల వెంటనే శోకింప" (మొల్ల.రా.కాం. 82) అని ఆమె ఏడ్చుట లోకమున కంతటికి దుఃఖభాజనమని వర్ణించినది.

ఈ సంభాషణలన్నియు వాల్మీకి. భాస్కర, రంగనాథ రామాయణము లన్నిటిలో కంటె మొల్ల మిక్కిలి రమ్యముగా చెప్పినది. సీతాదేవి పాతివ్రత్యము నకు సుందరకాండమే నిదర్శనము. విపత్కర కాలములో కూడ తన నాధునియందే సంలగ్నమానసము గలదై చాల గొప్పవాడైన రావణుని అతని ఐశ్వర్యమును నిరాకరించుటనగా సామాన్య స్త్రీలకు సాధ్యమగు విషయముగాదది. రావణుడెంత గొప్పవాడో వాల్మీకమున హనుమంతుడు పలికిన పలుకులు స్పష్టపరచు చున్నవి.

"అహో రూప! మహాధైర్య! మహాసత్త్వ మహాధృతిః

.... .... .... ....

(వాల్మీకి.రా.సుందర.కాం

అని శ్రీరాముని రూప గుణములు చూచి యున్నను హనుమంతుడు రావణుని అందము. అతని ఐశ్వర్యాది విభవములు చూచి ఆశ్చర్యమగ్నుడై నాడట. అటువంటి రావణుని సీత ఒక అల్పమైన గడ్డిపరకగ నెంచి అసహ్యించుకొని ఒక నీచునిగా మాత్రమే చూడగలిగినది. ఆమె ఆత్మసంయమనము, పవిత్రశీలము ఇట్లు ప్రశంసా ర్హమగుట కిట్టి వెన్నివో సంఘటనములు రామాయణ కావ్యమంతట నిండిపోయి కావ్యమును మహత్తరముగ నిరూపించి సీతాయాశ్చరితమ్, మహత్తు నిపించినవి, సురకు సౌవీరమునకు, నక్కకు సింహమునకు వున్నట్టి భేదమును రావణుని యందున్న గుణములలో పోల్చినది.

రావణుడంతటితో వదలక రాక్షసాంగనలలో సీత నెట్లయినను వశపరపు డని నియమించెను, ఆ స్త్రీలెల్లరామెను బెదిరించి, శ్రీరామునికంటె రావణుడు చాలా గొప్పవాడని నిరూపించి వశపరచుకొన జూచినప్పుడామె తన ప్రాణముల నైనా నిచ్చుటకు సిద్ధపడినది, "ప్రాణ ప్రయాణేపి శీలం నత్యాజ్యమ్" అని శీలవతు లను గూర్చి నీతిశాస్త్రము నందు చెప్పబడిన మాటలకీమెయే నిదర్శనము.

"యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి

....  ....  ....  ....

(వాల్మీకి.రా,సుందర, కాం24-10-14)

రాక్షసాంగనలామెను ముక్కలుగ ఖండించుకొని మద్యములో నంజుడుగా చేసికొన గలమని బెదరించి నప్పుడు కూడ శచీ, అరుంధతీ, రోహిణి లోపాముద్ర, సుకన్య సావిత్రి, దమయంతి, కేశినీ, మదయంతి ఇత్యాది కులస్త్రీలందరు తనకాదర్శమని తదన్యముగా చరింపనని ఖడించుకొని తినినా తన ఇష్టమే అనినది. జానకి శీల వైభవమునకు ఇది నిదర్శము.

ఆంజనేయుడు సీతాన్వేషణము చేయుచు లంకలో సీతను కనుగొనినాడు, సీతా స్వరూపస్వభావములను చూచి మిక్కిలి ఆశ్చర్యముతో ఆమె స్వభావ మును, మనకు పరిచయ మొనర్చినాడు, ఆజానకి పరమ పవిత్ర శీలమునకు పడికట్టు రాళ్ళు ఆ మాటలు, లంకలో శింశుపా వృక్షము మీద దాగియుండి రావణుని కారు కూతలు వినినాడు, జానకి దుఃఖముతో కంఠమునకు ఉరి బిగించుకొని ప్రాణత్యాగ మునకు సిద్ధముగా నున్నది, ఆ సమయములో తానామెను చూడకపోయినచో తాను పడిన శ్రమ అంతయు వృథాఅనుకొనినాడు, ఆ విషయమును మొల్ల సందర్భము నకు చితరీతిగ వర్ణన చేసినది,

"ఉన్నాడు లెస్స రాఘవు

— — —

(మొల్ల,రా,సుందర,కాం 94)

అ మాటలు వినిన సీతకు వెంటనే తిరిగి జీవించు ఆశ చిగిర్చినది,

కళ్యాణీ బధగాధేయం లౌకికీ, ప్రతిభాతియే

....  —  ....  ....

(వాల్మీకి,రా,సుందర;కాం 34,6)

రావణుడిచ్చిన ఇరుమాసముల గడువు సమీపించినను రాముని వార్త తెలియక నిరా శచే ఆత్మత్యాగమునకు పూనుకొనిన జానకి ఆంజనేయుని మాటలు విని. ఆశ చిగు రింపగ బ్రతికి యుండిన శుభములు బడయవచ్చునను సత్యము స్ఫురించినదట జానకికి. [ఆ మాటలు ఆవృత్తి అయినవిగా తోచికొట్టాలాను]వెంటనేదనుజమాయలు

గుర్తునకువచ్చి వచ్చినవాడే రాక్షసుడోయని మనసులో వెరగందినదిజానకి. ఆమెసంశ యాత్మక బుద్ధికి, నిశితమైన ఆలోచనా శక్తికి ఉదాహరణముగా చెప్పదగిన మాటలు

"ఆ మాటలాలించి భూమిజ తనలోన

వెఱగంది శింశుపావృక్ష మరసి-"

-(మొల్ల.రా.సుందర.కాం. 92)

అది తెలిసిహనుమ ఆ దేవి అతనిని విశ్వసించుటకై శ్రీరామలక్ష్మణులు ఋష్య మూకమునందు సుగ్రీవామల మైత్రి చేయుచుండిన విషయము యుద్ధమునకు సిద్ధపడు కథాంశములు వివరించినాడు. మరియు రామచంద్రుడిచ్చిన ఆనవాలు అంగుళీయకము నిచ్చెను. అది చూచి రాముని ముద్రికగా మదినెంచినను అతనిని విశ్వసింపక "నీ వచ్చిన దాని భావమును వల్లభ చందమును" వివరింపుమని అంత వరకు నేనిన్ను విశ్వసింప జాలననినది. (మొల్ల.రా.సుందర.కాం.93–95)

"నిను విశ్వసింప జాలను

— — -"

పై ది–97.

అప్పుడాంజనేయుడు శ్రీరాముడు సుగ్రీవామలతో చేసిన చెలిమిని, సీత ఆభరణముల వివరణము, వానిని ద్రుంచిన రాముని భుజ దర్పమును, సుగ్రీవుని రాజ్యమున నెల కొల్పినసంగతి,కపులందరిని నలుదిక్కులకు సీతాన్వేషణమునకు పంపించిన,విషయము లన్నింటిని వివరించినాడు. అయినప్పటికిని రాక్షస మాయలతో బాధలనుభవించు చున్న ఆమె చిత్తమునకు విశ్వాసము పుట్టింపలేదు.

"ఇవ్విధంబున బలుకుచుండినను నమ్మక యతనింగనుగొని

— — — —

—(మొల్ల. రా. సుందర. కాం. 101.)

శ్రీరాముడేరీతి వాడో తనకు వివరింపమని అడిగినది. ఇట ఆశ్చర్యముగా దోచెడి మాటలివి శ్రీరాముడెట్లుండునో ఆమెకు తెలియకనా. కాదు. ఆ రాముని చిత్తమందు పూర్వానురాగమున్నదో లేదో తెలిసికొనుటకే ఆమె హనుమంతుని ద్వారా విషయ గ్రహణము చేయు ఉద్దేశ్యముతో ఇట్లడిగి యుండుట నిస్సంశయమైన మాట.

"నీల మేఘచ్ఛాయ బోలు దేహము వాడు

ధవళాబ్జపత్ర నేత్రముల వాడు

.... .... —

ఇన్నిగుణముల రూపింప నెసగువాడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెవాడు"

(మొల్ల. రా. సుందర. కాం. 102.)

అని శ్రీరాముని శుభప్రదమైన రూపమును ఆంజనేయుని చేత పలికింపజేసినది.

వాల్మీకమున సీత శ్రీరాముని అంతరంగమును దెలిసికొనుటకై హను మంతుని అనేక ప్రశ్నలు వేసినది.

"న బాస్యమాతా నపితానాన్యః
స్నేహాద్విశిష్టోస్తి మయా సమోవా—"

(వాల్మీకి. రా. సుం. కాం. 36–30)

తనరామునికి తనకు మించిన ఆప్తులు లేరనుట వలన ఇప్పుడు కూడా రాముడట్లే యుండెనో లేదోయని ఆమె ఉద్దేశ్యము. అందుకే-

కచ్చిన్న తద్దేమ సమాన వర్ణం తస్యాకసం పద్మ సమాన గంధి
మయావిన శుష్యతి శోకదీనం బలక్షయే పద్మనివాతపేన"

— — — —"

(పైది-36, 28–30)

శ్రీరాముని మోము కాంతి దరిగియుండెనా, తన ఎడబాటు వలన కలిగిన దుఃఖముతో కృశించియుండెనాయని ప్రశ్నించినది. అందుకు తగిన సమాధానములు ఆంజనేయుడు ఇచ్చియున్నాడు. ఆమె వేదననర్థము చేసికొని ఇట్లనియెను.

"సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతి బుద్ధ్యతే
దృష్ట్వాఫలం వాపుష్పం వాయద్వాన్యాత్సుమనోహరమ్"

(వా. రా. సుం. 36–42)

వనమందే ఫలమును చూచిన పుష్పమును చూచిన నిన్నే తలచుకొని రోదించు చున్నాడని పలికెను. మరియు. సీతాదేవి యందు శ్రీరామునికి ఉన్న ప్రేమాతిశయ మును శ్రీరాముని విరహ వేదనను వర్ణించి చెప్పినప్పుడే ఆమె శ్రీరాముని చిత్తము నందు తనపై నున్న అనురాగము పదిలముగా నున్నదని భావించినది. పురుషుని చిత్త వృత్తమును మిక్కిలి నిశితముగా తెలిసికొను నేర్పుగలది సీత. స్వభావో చిత మైన భావములివి.

మొల్ల రామాయణమున సీత శ్రీరాముని గుణములు వినిపించినను అతనికి తన శిరో రత్నమునీయలేదు.

"నా నాథు క్షేమమంతయు

— — —"

—(మొల్ల . రా. సుందర. కాం. 105.)

వచ్చిన దూతను నిజరూపము చూపించిన గాని విశ్వసింపననినది. తన శిరో రత్న మానవాలుగ పంపినది. ఈ సన్ని వేశ ము నందు శ్రీరాముని కామె పంపిన సందేశము సీతాదేవి పాతివ్రత్యమునకు ప్రబలోదాహరణములు. ప్రాణదానము చేసి తన నాథుని క్షేమమును దెలిపిన ఆ పుణ్యాత్మునకు సీత ప్రత్యుపకార మేమియు చేయలేకపోయితి ననుచు బాధపడుట ఆమె పరోపకార బుద్ధికి తార్కాణము.

"రవికుల వార్ధి చంద్రుడగు రాముని సేమము చాల వింటినా

— — —

దవిరి యొనర్పలేను వసుధాస్థలి వర్ధిల్లు బ్రహ్మకల్పముల్"

—— (మొల్ల .రా.సుందర.కాం. 110).

అని ప్రాణదాతయైన అతనిని మాతృ వాత్సల్యము తో దీవించినది. అంతకు మించి విలువైన వస్తువు ఏదైనను కోరుకొనుటకే ముందును.

"ఏ యెడ జూచిన రామధరణీ
నాయకు శ్రీపాదయుగమునా చిత్తములో

.... .... .... ...

-- మొల్ల .రా.సుందర.కాం. 111

త్రికరణశుద్ధిగ శ్రీరాముని నమ్మి భజించుచున్నదానను ఆ విషయము రామునికి తెలియజేయుము. మరియు నీవిట నున్నప్పుడు రావణుడేతెంచి, కూసిన కారుకూతలు నీ చెవులార విని యున్నవాడవు. ఆ విషయములన్ని శ్రీరామునికి వినిపించి నాచెర విడిపింపుమని ఆంజనేయుని తన కష్టములకు సాక్షిగ నెంచుకొనుట ఆమె కుశాగ్ర బుద్ధికి నిదర్శనము. సీతాదేవి పడిన బాధలు ఆమె దైన్యస్థితిని మొల్ల కరుణ రసార్ద్రముగా చిత్రించినది.

"నిడుద వెన్నటి వేణి జడలుగా సవరించి
మలిన జీర్ణాంబరం బొలియ గట్టి

...    ...    ...    ...

...    ...    ...    ...

నాకు ప్రత్యక్షమగుమ నినాథునకును
విన్నవింపుము సత్త్వ సంపన్న నీవు"

(మొల్ల.రా.సుం.కాం. 113)

శ్రీరాముని శ్రీకర పదములనే ధ్యానించుచున్న పరమ భక్తాగ్రగణ్యను, మునివృత్తి తపమాచరించు దానిని, నిత్య నిర్మలమైన అంతరంగము గలదానిని చిత్తరువునందు వలె వర్ణమిశ్రితము చేసి చూపినది మొల్ల. మహారాజుల ఇంటి మగువ అయినను విధి నెదిరించు శక్తి మానవమాత్రులకు లేదని సుఖదుఃఖాది ద్వంద్వముల సమ్మేళనమే జీవితమని నిరూపించినది జానకి అనుభవము. అంతఃపురములలో హంసతూలికా తల్పముల యందు తేలియాడవలసిన రాచబిడ్డ! నిద్రాహారములకు నోచుకొనక ఒంటిపై క్రూర రాక్షసి గణముల మధ్య దుఃఖభాజనమైన జీవితము ననుభవించుట విధి వ్రాత. ఇట్టి భయంకర సమయము నందు ఆమె తన ప్రాణముల కన్నను మానసంరక్షణ చేసికొనిన ఆత్మయోగినిగా పరిచయమైనది పాఠకులకు. లోకమునందు స్త్రీలకు ఎట్టి ప్రవర్తన కీర్తిదాయకమో, క్షేమదాయకమో ఆమె నిరూపించినది. ఆంజనేయుడు ఆమెను చూచి బాధతో కుమిలిపోయినాడు. వెంటనే తన భుజస్కంధముల మీద నెక్కించుకొని వెళ్ళి ఆమెను శ్రీరాము సన్నిధిని చేర్పగలను రమ్మని సీతతో పలికెను. (మొల్ల. రా.సుందరం.కాం.118). అందు కామె ఒసగిన సమాధానములు సత్యస్ఫోరకములు. లౌకిక జ్ఞాన సంపన్నములు, నీతిని, ధర్మమును ఉపదేశించునట్టివి.

"నీవంత వాడవగుదువు

....    ....

భూవరుడే దొంగయంద్రు బుధనుత చరితా"

— (మొల్ల.రా.సుందర.కాం. 119).

అదియును గాక రామచంద్రుని తప్ప ఇతరుల నంటని దాననసుచు—

"దొంగిలి దెచ్చిన దైత్యుని

....    ....    ....

దొంగిలి కొనిపోవ దగునె దొరలకు నెందున్"

— (మొల్ల.రా.సుందర.కాం. 121).

సూర్యోదయమునకు పూర్వమే నిన్ను సీనాథుని కడకు చేర్పగలననగా నీ వంతటి సత్త్వసంపన్నుడవే గాని అట్లు వచ్చుట లోకము హర్షింపని పని అదియుగాక శ్రీరాముని కప్రతిష్ఠ కలుగును. రావణుని కంటె రాముడే పెద్ద దొంగ యని పలికెదరు ప్రజలు. అయినను శౌర్యహీనుడైన రావణుడు ప్రవర్తించినట్లు శ్రీరాముడును చేయుట తగని పని. యుద్ధమున శత్రువును నిర్జించి లోకము మెచ్చునట్లు నన్ను శ్రీరాముడు చేపట్టుటయే యుక్తమని పలికినది. రాముని అల్పుడని నిరసించిన రావణునికి ఆ అల్పుని తేజః ప్రతాపము లెట్టివో నిరూపించు వరకు ఆమె అట నుండి కదలదలచలేదనవచ్చును. ఒక్క తన ప్రాణ రక్షణమునకై ధూర్తుని రావణుని నిర్జింపక తాను అట నుండి వెడలినచో లోకమునకు క్షేమ మెక్కడ? లోకకంటకుడైన వానిని పరిమార్చుటకై. తనకు జరిగిన అవమానమునకు ప్రతీకారమును తీర్చుకొనుటకై ఆమె బద్ధకంకణమైనదని స్పష్టమగుచున్నది. తన భర్తకు అపకీర్తి కలుగునట్లు ప్రవర్తించుట ఆమెకు ఇష్టము లేదు. మరియు తానట్లు బయలుదేరి వెళ్ళినచో లోకములే గాదు రాముడును మెచ్చని విధమని ఆమెకు తెలియును. తన నాథుని శౌర్యప్రతాపములపై ఆమెకున్న విశ్వాసమును ప్రకటించినది.

"మరియు రామచంద్రుండు త్రిజగదేక వీరుండును, కోదండ దీక్షా గురుండును, రాక్షస కులాంతకుండును నగుటంజేసి రాణివాస ద్రోహియగు రావణుని సంగర రంగంబున ప్రఖ్యాతంబుగా జంపి కొనిపోవుట ధర్మంబు. నీవు రామచంద్రునకు పరమ భృత్యుండవును, పుత్రసముండవును నగుటం జేసి వెంట నరుగుదెంచుట తప్పుగాక పోయినను పగ తీర్పక వచ్చుట చితంబుగాదు. కావున నీవు రాఘవేశ్వరుల కిన్నియుం దెలియ విన్నపంబు చేసి తడయక తోడ్కొని రమ్మని" [మొల్ల.రా.సుందర.కాం. 122] ఆమె దీవించి పంపినది.

వాల్మీకియు సీతను శోకమూర్తిగ, విచక్షణాశీలగ, ప్రతీకార వాంఛా దీక్ష గలదానిగ, ధైర్యశాలినిగ చిత్రించియున్నాడు.

"తతో మలిన సంవీతాం రాక్షసీ భిస్సమా వృతామ్
ఉపవాసకృశాం దీనాం నిశ్వసం తీం పునః పునః

.... .... .... ....
.... .... .... ...."

—(వాల్మీకి.రా.సుందర.కాం.15, 17-32

"వేష్టమానాం తథా విష్టాం పన్నగేంద్ర వధూమివ
ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా
.... .... .... ....
.... .... .... ...."

—(వాల్మీకి.రా.సుందర.కాం. 19-9-19)

భర్తకు దూరమైన ఆ జానకి కృశించిన అంగములతోనేగాక ప్రతీకారేచ్ఛ బలీయముగా గలదనినాడు. పగబట్టిన నాగినియైనను మణి మంత్రములచే కట్టుబడినదై యున్నదని. కేతుపీడనముచే కాంతి తరిగిన రోహిణీవలె నున్నదని. అపవాదుచే కళంకితమైన కీర్తివలె, విఘ్నమైన మనోభీష్టమువలె, నిగూఢార్థముగల ధర్మశాస్త్రమువలె నున్నదనినాడు.

వాల్మీకమున హనుమ సీతాదేవినితనతో కొనిపోయెదనని నప్పుడు అతని శక్తి ఆమెకు తెలియునని అట్లుచేయుట క్షేమదాయకముగాదని. పరపురుష స్పర్శ కూడనిదని, రావణుడు తననుగొని పోయిననాడు వివశత్వము గలదానవని చెప్పి తన భర్తను గొనిరమ్మనిన విషయములు విపులముగ వర్ణింపబడినవి.

—(వాల్మీకి.రా.సుందర.కాం—37 సర్గ)

ఆంజనేయు డా విధముగ బయలుదేరి రామదర్శనము చేసికొని ప్రాణేశ్వరి గురించి ప్రాణములు నిలుపుకొనిన రామునితో వర్ణించినప్పుడు మొల్ల పతివ్రతా శిరోరత్నమైన సీతను చిత్రించి చూపినది.

"కట్టిన వస్త్రంబు కట్టుకొంగే తక్క
జీర్ణించి పోయిన చీర తోడ
—— —— ——
—— —— ——"

వనిత ప్రాణంబు దక్క సర్వమును త్యజించి
నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండు"

—(మొల్ల.రా.సుందర.కాం. 246)

కట్టు వస్త్రముతో, బాధలతో క్రుంగి కృశించిన దానిని కర్తవ్య విమూఢయై చెక్కిట చేర్చిన చేయి గలదాని, కష్టములు తట్టుకొనలేక నేలపై దొర్లి దుఃఖించిధూళి ధూసరిత

మైన శరీరము గలదానిని నిరతము ఎడలేక దొరగు కన్నీటితో, నిరహార వ్రతముతో రామనామ తపజప నిష్ఠమైన సీతను కంటి ముందు నిలిపినది మొల్ల. రావణాసురుని విభవములకు లొంగక. ప్రతీకారేచ్ఛతో, ధర్మ విజయము కొరకు ఎదురు చూచినది సీత. సీతాదేవి చరిత్రను దెలిసికొనినాడు రామభద్రుడు, సేతువు నిర్మించి లంక చేరి రావణ సంహారము చేసినాడు. ఆ వార్త విని సీత ఎంతో ఆసక్తితో ఎదురు చూచుచున్నది. కష్టములు తీరి తన నాథునిచేరి సుఖపడు రోజు ఆసన్నమైనదని గంపెడాశతో నున్నది. మానవ జీవితమునందు అనుకొననివివత్కారములు ఎదురై అందుకొనిన ఫలమారగింపగలమను ఆశకు తావు లేనట్టిది. తాను ఆశించినది ఒకటి దైవ నిర్ణయమింకొకటి. ఆ సత్యనిరూపణమే సీతాదేవి గూర్చి ఇకముందు నిరూపింపబోవు చరిత్రము. యుద్ధకాండ మూడవ అశ్వాసమున ఇది విదితము.

రావణ సంహారణా నంతరము శ్రీరాముడు విభీషణుని బిలిచి సీతను శృంగారించి తన కడకుతీసికొనిరమ్మనినాడు. విభీషణుడుతన భార్య సరమాది అంత పురాంగనలచే రామాజ్ఞ ప్రకారము సీతను రప్పించినాడు. (మొల్ల.రా.యుద్ధ.కాం. 3, 112–113)

"ఇట్లు గొనివచ్చి రామభూపాలుని సమ్ముఖంబున నునిచిన నద్దరాతమూజాత పతికి వినయ భక్తి తాత్పర్యంబులు వెలయ ప్రణమిల్లిన నతండు వనితా రత్నంబగు సీతం గనుంగొని" (పైది, 114)

(శ్రీరాముడు) పలికిన పలుకులు సీతకు అశనిపాతములైనవి—

"కులసతి జెఱగొని పోయిన

....    ....    ....

—    —    —"

నెలతా నీ యిచ్ఛ జనుము నేనిన్నొల్లన్"

-(పైది-115)

శ్రీరాముడు శత్రు సంహారము చేయలేని అసమర్థుడను లోకనింద లేకుండుటకై, భార్యను రక్షించుటను ధర్మము నెరవేర్చుకొనుటకై రావణునిజంపి, నీ చెర విడిపించితిని కాని పూర్వమువలె నీతో కలిసి జీవించు ఉద్దేశములేదు. కాబట్టి నీ ఇష్టమొచ్చిన రీతి ప్రవర్తింప వచ్చునని భార్యతో శ్రీరాముడాడిన మాటలు విని ఎవరి

కైనను శ్రీరామునిపై యత్యంతా గ్రహము కలిగి తీరును. మూలమునందు శ్రీరాముడు పలికిన కర్ణశూలములైన మాటలను మెల్ల పరిహరించినది. స్త్రీ కర్తృకము గాన ఇటువంటి అసంబద్ధపు ప్రేలాపనలు వర్ణించుట ఆమె మనసునకు గిట్టకపోయి యుండును. వాల్మీకములో రాముడేమనెనో చూడుడు-

"స్వధర్మో రక్షసాం భీరు సర్వదైవ న సంశయః
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్యవా"

స్త్రీల నపహరించుకొని వెళ్లట, బలవంతముగ వశపరచుకొనుట రాక్షసుల స్వభావము. అటువంటి వాని ఇంట నున్న నున్ని స్వీకరించుబుద్ధి నాకులేదు. కాబట్టి—

"విదితశ్చాస్తుతే భద్రే యోఽయం రణ పరిశ్రమః

— — — —

— — — —

నివేశయ మనస్సీతే యథా నా సుఖమాత్మనః"

(—వాల్మీకి.రా.యుద్ధ.కాం. 118–15-24)

అని శ్రీరాముడు సీత సతి కర్ణ శూలములైన మాటలతో బాధపెట్టుటయే గాక ఆమెను లక్ష్మణ, భరతాది వ్యక్తులలో ఎవరినో ఒకరిని చేపట్టి సుఖముగా నుండుమనుట జానకి వంటి స్త్రీ పరముగా రాముడాడిన మాటలెవరికైనను హృదయ శల్యములుగా నుండును. ఇక ఆ జానకి మాట వేరుగ చెప్పవలెనా. ఈ విషయములు భాస్కర రామాయణము నందు కూడ యథాతథముగ వర్ణింపబడినది.

"నీ యందు నాకు బరిగ్రహ బుద్ధి లేదు
.... .... ....
లేదు, నిన్నొల్ల, నీవు వలసిన చోటుండు"

భాస్కర.రా.యుద్ధ.కాం. (422)

అనుటతో ఊరకుండలేదు, "సుధాసాగర శుద్ధంబైన యిక్ష్వాకు వంశంబున బ్రభవించిన రాజన్యుండు...."

"భరత లక్ష్మణ శత్రుఘ్న శరణి నూను

వాని జేకొను మిప్పుడు వనిత..."

—(పైడి– 1424)

అని శుద్ధ మనోజ్ఞ సుచరిత్రమైన సీతను అతిదుర్మార్గముగ పలికి దుశ్చారిత్రగ ఆమె నెంచుట రఘువరునికి తగినది కాదు. అతి దారుణములైన ఈ పలుకులను మొల్ల తన రామాయణమున ఇంత దుర్మార్గముగ వర్ణింపకుండుట ఔచితీస్ఫోరకమే గాక స్త్రీ హృదయ మార్దవము కూడనై యున్నది.

శ్రీరాముడంతటి వాడు సీతనట్లు పలుకుటకు కారణము లేకపోలేదు అని శ్రీ సువరం ప్రతాపరెడ్డిగారు ఆ విషయమునిట్లు సమర్థింపజూచిరి. "ఆర్యులలో పూర్వకాలమందు దేవర న్యాయపద్ధతి యుండెను. దీనికి నిదర్శనములు మహా భారతమున చాల కలవు. పరాశరుని కాలము వరకు దీనికి చెల్లుబడి యుండెను. "దేవర" అను శబ్దమునందే రెండవ వరుడు అను అర్థమిమిడి యున్నది. నేటికిని మరదికి దేవరుడని యందురు..." 1 అని తెలిపి రాముడట్లు పలుకుట నాటి సాంఘి కాచారము వలననే గాని వేరుగాదు అని అభిప్రాయమును దెలిపిరి. ఇది సమం జసముగా సమర్థింపజూచిరి గాని మరి యొకటి కాదు.

శ్రీరాముడు సీతతో అన్ని సంవత్సరములు కలిసి జీవించియు ఆమె నంతమాత్ర మర్థము చేసికొనుట విచారకరము. జానకి వంటి పవిత్రమూర్తిని అట్లు పలుకుట క్షమార్హము కాదు. అందుకే ఈ సమయము నందు సీత తన భర్త యుద్దేశ మెరిగినదై శ్రీరామునికి తన పవిత్ర ప్రణయమును, సచ్ఛీల సౌభాగ్యమును విదూ పింప దలచి ధైర్యముగా నిలిచినది. హృదయ శల్యములైన పలుకుల కొంత క్షణము నిశ్చేష్టయైనను తనను తాను సంబాళించుకొని రాజపుత్రిక యనిపించుకొను రీతి రాజస ప్రవృత్తిని ప్రదర్శించి అధర్మపరాయణుడైన తన పతిని తిరిగి సత్క్రమ మార్గ మున నిలబెట్టుటకై యత్నించి పలికిన పలుకులు సీతనొక ధీర వనితగ నిరూపించి నవి. కొంచెము తారస్థాయిలోనే రామునికి బుద్ధి చెప్పదలచినది. అతి సున్నితమైన ఆమె హృదయమునకు ఈ పలుకులు తీవ్రమైన గాయమును చేసినవి గాని బేలతన ముతో శ్రీరాముని పాదములంటి క్షమింపుమనెడి ప్రయత్నములు చేయలేదు. ధరణి పుత్రిక. క్షమౌదార్యములే ఆమెలోని గొప్పదనమునకు కారణము. 'మృదూని కుసుమా దపి వజ్రాదపి కఠోరాణి' అనిన మహాకవుల మాటలు ఇక్కడ వర్తింపగలను.

---

1. రామాయణ విశేషములు, పుట : 145.

పితృాజ్ఞాపాలనయే పరమావధిగ గలవాడు రాముడు. అటువంటి రాముడిట్లాడుటలోగల ఆంతర్యమెరిగినది. అందుకే అతనిని బ్రతిమాలుకొను ప్రయత్నములు ఫలింపవని తెలియును. తన పావిత్ర్యమును నిరూపించిననాడే రాముని హృదయమున స్థానము. అందుకే శ్రీరాముని ధిక్కరించి నిలిచినది.

"నరవర నాడు చిత్తము మనంబున నీవ యెరింగి యుండియున్
.... .... .... ...."

(మొల్ల . రా. యుద్ధ. కాం. 3–117)

ఆమె పాతివ్రత్య మహిమపై ఆమెకున్న విశ్వాసముతో ధీరముగ నిలిచి రోషపూరితయై హుంకరించినది. పతినెల్ల వేళల మదిని నమ్మి భజించు నన్నా నీవే ఇట్లనుచుంటివి, ఇక ఇతరుల మాటలేల. నీకట్టి విశ్వాసము నాయందు లేనినాడు చితిని ఏర్పరచు అందు దూకి నా సచ్ఛీలముచు నిరూపించుకొనగలను. అని పలికి నప్పుడురామా! అని సంబోధనము గాని సౌమ్యతగాని గోచరింపదు. శ్రీరామునిపైగల అక్కసు నంతటిని ఒక్కమాటలో నిరూపించినది. 'నరవర నాడు చిత్తము మనంబు నీవ యెరింగి' అనుటలో రాజా! అని చేసిన సంబోధనము నందు శ్రీరాముడు భర్తగా కాదు ఒక రాజుగా దోచినాడు. రాజైనవాడు ఇట్ల ధర్మపు పలుకులు పలుకుట ఉచితముగాదు. అందుకే నీకది తగునా? అని సత్యమును నిరూపింప బూనినది. ప్రౌఢయైన నాయికా లక్షణములతో ఒప్పుచున్నది సీత. 'వితరీత ప్రతిభాషలే లేమిటికి నుర్వీనాథా!" అనియు 'విపుల యశో నిధీ పురుష వృత్త మెరుంగుచు నుండు' అనియు నన్నయగారి శకుంతల దుష్యంతుని సభలో నిలిచి సత్యధర్మములు నిరూపింప బూనెనిట్లే సీత "నరవరా! నాదుచిత్తము" అని రాజస ప్రవృత్తితో పలికి తన భర్తను ధర్మపథగామిని చేయనెంచి అగ్నిదూక నిశ్చయించుకొనినది. నీతిని, ధర్మమును, సత్యమును లోకమునకు చాటినది. ఆమె వ్యక్తిత్వమున కిది తార్కాణము. "ప్రియాతు సీతారామస్య దారాః పితృకృతా ఇతి" అని మిక్కిలి ప్రేమాతిశయముగల రాముడే ఈనాడిట్లు పలుకుట శోచనీయము. శ్రీరాముడే గాదు అక్కడ చేరిన ఏ ఒక్కరును ఆమెను వారించు యత్నము చేయలేదు. రాముడు ఆనాడే తనకీ వార్త చెప్పి పంపిన అప్పుడే ప్రాణత్యాగము చేసికొనెడి దానను. ఈ అవమానమును పొందియుండెడి దానను కానని తన పూర్వజన్మ కర్మఫలమని వాల్మీకమున వగచినది.

"ఏవ ముక్తాతు వైదేహీ పరుషం రోమహర్షణమ్

.... .... ....

పరాధీనేషు గాత్రేష కిం కరిష్యామ్యనీశ్వరా"

—(వాల్మీకి. రా. యుద్ధ కాం. కాం. 119–1–9)

శ్రీరామునితో తన నిర్దోషిత్వమును గూర్చి తెలిపి, క్షమింప వేడినను ప్రయోజనము లేదని చితిని చొచ్చుటకు యత్నించినది. సంక్షిప్త రామకథ కాబట్టి ఇందు అన్ని విష యములను రచన చేయక ముఖ్యాంశములు మాత్రమే మెల్ల చిత్రించినది.

చితి యందు దూకి పాతివ్రత్యమును నిరూపించుకొనిన సీతను చూచి శ్రీరాముడు. 'అవశ్యం త్రిషు లోకేషున సీతా పాపమర్హాతి' (వాల్మీకి, రా. యుద్ధ. 121-13.) ఈ ముల్లోకములందు సీత ఎక్కడ నున్నను పాప రహితయని, తనకా విషయము దెలిసినను సామాన్యుని వలె రాముడు కూడ కాముకుడై నందున భార్యను వెంటనే స్వీకరించెనను లోకనిందకు వెరచి సీతను అట్టి పరీక్షకుగురి చేసితినని అతనాడిన మాటలను సమర్థింప జూచుకొనినాడు. వాల్మీకి రాముని యందున్న పక్ష పాత బుద్ధితో నిట్లు చిత్రించుటయే గాని యన్యముగాదు. ఏమైనను శ్రీరాముడా చరించిన ధర్మయజ్ఞము నందు సీత ఒక సమిధగ వ్రేల్చబడినదనుట తథ్యము. సీత యనిన రామాయణ పాఠకులకు మిక్కలి ఆదరణ.

"ప్రాప్త చారిత్ర సందేహామమ ప్రతిముఖే స్థితా
దీపో నేత్రాతు రస్యేన ప్రతి కూలాసి మేదృఢమ్"

(వాల్మీక. రా. యుద్ధ. కాం. 112-17.)

శ్రీరాముడు తన యెదుట నున్న సీతను నిరసించుచు నేత్రరోగి కంటి కెదురుగా నున్న దీపకాంతిని ఎట్లు చూడలేడో అట్లే నీ రూపము నాకు నేత్రావ రోధము కలిగించుచున్నదనినాడు. ఇది చదివిన రామాయణ పాఠకులలో గల అభి ప్రాయమును బట్టి శ్రీరాముని హృదయమే సంశయాస్పదమైనది గాని సీత విశుద్ధ చరిత్రయని అందరకు తెలిసిన సత్యమని చెప్పవచ్చును.

"ఒక వ్యాఖ్యాత ఈ ఉపమానము వలన శ్రీరాముడాత్మ నింద గావించు కొనెనని సూచించెను. ఏలన దీపము నందు ఏ దోషమును లేదు. అది హాని

గావింపదు. వీని కన్నులే కలక చెందియున్నవి, దోషము వీనియందే యున్నదని చమత్కరించెను." 1

వాల్మీకి సమర్థింప జూచినను పాఠకులు మాత్రము శ్రీరాముని ఈ విషములో వ్యాఖ్యానింపక తప్పదు.

అగ్నియందు దూకిన సీతను భద్రముగా అగ్నిభట్టారకుడు శ్రీరామునికి తిరిగి అప్పగించుట జరిగినది. దేవతలు, దశరథుడా సమయమున అటచేరి ఆమె విశుద్ధ చారిత్ర్యమును ఎల్లరకు వినిపించిరి.

"వనజనేత్ర సీత వలన దోషములేదు
నమ్ము వసుమతీశ నాదు మాట"

-[మొల్ల. రా. యుద్ధ. కాం. 119]

అని అగ్నిదేవుడు ప్రసన్నుడైనాడు.

"విశుద్ధ భావాం నిష్పా సంప్రతి గృహ్ణీష్వ మైథిలీం
నకించిదభిధా తవ్యా అహ మాజ్ఞాప యామితే"

అని అగ్ని పలికెను. అట్లు సీతను గ్రహించి శ్రీరాముడ యోధ్యాభిముఖుడై తనుచు భార్యకు పూర్వము వారు చరించిన భూములు పరిచయము చేయుచు ప్రయాణము సాగించి అయోధ్య చేరుకొని పట్టాభిషిక్తుడై సుఖముండెనని కథాంశములు శుభాంతము చేసినది మొల్ల. (మొల్ల.రా. యుద్ధ.కాం.3-125-133).

ఋషితుల్యుడైన వాల్మీకి "సీతాయాశ్చరితం మహత్" అనినట్లు సీతా చరితమునే చాలమంది కవులు, వ్యాఖ్యాతలు ఆదరించినారని చెప్పవచ్చును. ఈమె అన్వర్థ నామధేయము కలిగి సహనశీలములతో కష్ట నిష్ఠురములు భరించి పన్నెవాసి సంతరించుకొనినది. "మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే కించిత్ ప్రదహ్యతే" అని జనకుడు మిథిలా నగరము దహించి పోవుచున్నను తన ఐశ్వర్యమేమి తరిగి పోలేదన్నుటకు కొమార్తె సచ్ఛీల సంపద వలన పొందిన యశోధనమే కారణము అని తెలియదగును.

సీత ఆదర్శ సతీ ధర్మములు నెలకొల్పి ఆచంద్రార్క కీర్తికాంతయైనది.

---

1. రామాయణ విమర్శనములు, పుట : 254.

ఆమె సచ్ఛీల సౌభాగ్యములను గురించి ప్రశంసించిన స్వామి వివేకానంద వాణిని అవధరింపుడు.

"పూర్వ సాహిత్యము నామూల చూడముగ నవలోకింపుడు. వర్తమాన సాహిత్యమును దిలకింపుడు. రానున్న వాఙ్మయ వైభవము నూహింపుడు. మరియొక సీత మనకు సాక్షాత్కరింపదు. నిశ్చితార్థముగ నేనీ మాట వక్కాణింపగలను. అట్టి దివ్య సాధ్వి యొక మహాకవి లేఖిని నుండి యొకమారే యుదయించినది. శ్రీరామచంద్రమూర్తులు పెక్కురుద్భవింప వచ్చును. సర్వకాలములకు సీత మాత్ర మొక్కతియే. ఎవ్వరెన్ని మారులు వాకొన్నను మహాసాధ్వియని చెప్ప వలసి వచ్చినప్పుడు సీత పేరునే చెప్పుకొనవలెను. భారతనారి విశ్వచరిత్రలో మహోన్నత స్థానమును గడించుట కవసరములైన యుత్తమ లక్షణముల నన్నిటిని సీత నుండియే యలవరచుకొన్నది.

యుగయుగముల తరతరముల భారత చరిత్రలో స్త్రీ పురుష బాల వృద్ధ తారతమ్య రహిత స్థితిలో నెల్లరి యారాధనల నందుకొన జాలిన మహాసాధ్వి జానకియే.

పవిత్రత కామె పావిత్ర్యమును సంఘటించినది. యోగ్యత కామె యోగ్యతను జత చేసినది. దేవ మానవ రాక్షస కాంతలందరి యభినందనల నామె యందుకొనగలిగినది. ఈమె సకల మానవ హృదయ కమల నిత్యవాసిని. మన పురాణములు స్వస్వరూపముల గోల్పోవచ్చును. వేదములు మరుగున పడవచ్చును. సంస్కృత భాషయే తెరమాటునకు జేరవచ్చును. ఏది ఏమైనను కావచ్చు. వసుంధరపై కేవల మైదుగురనిన నైదుగురు భారతీయులు జీవించి యుండిన చాలును. వారు పామర భాషనే భాషించు వారు కావచ్చును. కాని, సదా వారి కంఠ సీమల నుండి సీతాదేవి దివ్యనామము వినిర్గత మగుచునే యుండును. ఈ జాతి మీద నా మహాసాధ్వి చరిత్రమునకు గల ప్రభావ ముద్ర యట్టిది. ఈ గడ్డపై గల స్త్రీ పురుష రక్తనాళముల యందును వినిర్మల జాహ్నవీతో యథారా పరంపర లీల సీతా మహాసాధ్వి పరమ పావన చరిత్ర యెడతెగక జాలువారుచునే యుండ గలదు. భారతీయాం నగరులందరు సీతాదేవి ప్రతిబింబములే. భారతీయు లందరు జానకీ వాత్సల్యామృత లహరిలో దేలియాడు బిడ్డలే." నిజముగా వివేకానందుని వాణి విలువకట్టలేని ఆనంద భావనావీచీ విపంచి.

జానకి పుడమి మీద పుట్టిన స్త్రీలలో ఎవరితో సరిపోవలని ఒక ప్రశ్నే

వ్యక్తి. ఆ సౌజన్యమూర్తి స్మరింపబడినంత ఎక్కువగా మరియే ఐతిహాసిక నాయిక కూడా స్మరింపబడదు. భారతీయులే గాదు భారతేతరులును ఈమెను ప్రశంసించి యున్నారు. మిస్ మేరీ స్కాట్. "రామాయణమున కవితారసము నిండి యున్నది. నేను చదివిన నారీమణుల చరిత్రలలో మిగుల ఉదాత్త మధురమైనట్టిది సీతాదేవి చరితము." 2 అని సీతను ప్రశంసించినది. పవిత్ర ప్రణయమూర్తియైన స్త్రీ కొజ్జబంతియైన పుణ్యశీల జనకపుత్రి జీవిత వృత్తములో కవిశ్రుత విఖ్యాతి నందుట భారతీయులు గర్వింప దగిన విషయము.

జానకీ రమణిలో గల క్షమా గుణమొక్కటి (ఓర్పు, ఔదార్యము) ప్రతి యొక్కరి నోట ప్రస్తుతింపబడుచున్నది. నాన్యతోదర్శనీయమైన ఆదర్శ జీవిత మీమెను అగ్రకలమున చేర్చినది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు సీత నుద్దేశించి, "శీలవతులలో కెల్ల మేటి సీత. ఆమె మహారాజపుత్రి, మహారాజపత్ని, కాని ఆమె జీవితములోని విశేష భాగము దయనీయమైన కష్టములతోనే కడచినది. ఆ కష్ట సహిష్ణుత యందు సీతకు భూమి పుత్రియను నామము చెల్లిపోయినది. సీత జీవితమెల్ల పరికించితిమేని ఆమె అసమాన క్షమా సంపత్తిని ప్రత్యంశమునను పరికింప గలము. క్షమయందు సీత అసదృశ. క్షమయే సీత, సీతయే క్షమగ బుట్టి యుండెనని నను నతిశయోక్తిగాదు. క్షమ యందే ఆమె సతీత్వమెల్ల రాజించినది."3 అని చెప్పిన విషయములు భూమిపుత్రియైన సీతాదేవి "క్షమయా ధరిత్రి" అన్నట్లుఅర్థాంగికి కావలసిన ఆరు యుక్తులలో నొకటిగ నెంచదగినది.

మైథిలి అన్వర్థనామధేయయై మహిలో మనుష వర్గమున మహిమాఢ్యగ వెలుగొందుటకు కారణము. పరికింతము ఆమెలోని దైవత్వముకన్న నుముఖ్యముగా చెప్పదగినది మానవత్వము. మాతృహృదయ వాత్సల్యము. ధర్మోపజీవనము. విశుద్ధ చరిత గలిగి సీత జగదారాధ్యగ వెలుగుటయే గాక అసురి ప్రవృత్తిని గెలువజాలిన దైవత్వమును పొందగలిగినది. ఈ స్త్రీ మూర్తిని గురించి కల్లూరి చంద్రమౌళిగారు రామాయణ సుధాలహరిలో ప్రశంసించిన తీరు సత్య సౌందర్యమనదగినది.

"సీత యాదర్శ సతి. పతివ్రతయే గాని కేవల పతి ప్రియ గాదు. పరిపూర్ణ నారి. భారత సాహిత్యమునందే గాదు విశ్వసాహిత్య చరితము నంద

1. సీతామహాసాధ్వి - పుట: 203-204.
2. రామాయణ సుధాలహరి - పుట :
3. సీత సతీత్వము - పుట: 214, 17.

మూల్య రత్నమై శోభిల్లు నారీరత్నము సీత మాత్రమే. త్రికరణశుద్ధిగ, తన ఇష్ట దైవముగ రామునారాధించెను. సహనశీలముల సమ్మేళన రూపమగు పతివ్రతా రత్నము. ఆదర్శముల కాదర్శమైన యిట్టి వనితను విశ్వచరితమున మరెచ్చటను గాంచము."

అనన్య చరితయైన సీత లోకసామాన్య ధర్మములను నెలకొల్పుటకై ప్రభవించి. ఆ సత్య నిరూపణమునకై జీవితములో మున్నాతిక వంతు ఎనలేని కష్టములనుభవించినది. కంసాలి చేతిలో పడిన బంగరు లోహము కొలిమిలో కాల్పబడి, కంసాలి చేతిలో సుత్తిదెబ్బలు తినినట్లు శ్రీరాముని చేపట్టిన సీత జీవితము దర్శనీయమగుచున్నది. బాధలన్ని భరించి బంగరు శలాకవలె ఎల్లరను సమాకర్షించుకొని అభినందనీయమైన జానకి సచ్ఛీలము జాతిని జాగృత మొనర్చినది.

రాముని సహధర్మ చారిణియై మానవత్వమునకు ప్రతీకయై కరుణాకటాక్ష వీక్షణములతో యెల్లరను సమాదరించిన దాక్షిణ్య నిలయ. "త్వం మాతా సర్వ భూతానామ్" అని పరాశరుడనినట్లు ఈమె జగదేక మాత. హైందవ సంస్కృతికి, పాతివ్రత్యమునకు నిలయమై మనోహారిణియైనది అబలయైన స్త్రీ మూర్తియే ఎంత ఔన్నత్యము గల వానినైన నీతి ధర్మములకు దూరుడైనచో పరిమార్పగలదని హెచ్చరించినది. పాతివ్రత్య ప్రభావ మెట్టిదో నిరూపించినది. స్త్రీల నవమానపరచిన వాడు నశింపక తప్పదను సత్యమును తెలియజేసినది. స్త్రీ మూర్తికి గల అవర శక్తిని ప్రదర్శించినది. స్త్రీలు దివ్య శక్తి గలవారని తెలియజేయును భారతమున భీష్ముడు యుధిష్ఠిరునితో పలికిన మాటలు ఈమె చరితమునకు చక్కగ అన్వ యించును.

"ఎందు గాంతలవమానింపబడుదురో వారి కార్యము లన్నియు ఫల శూన్యము లగును. స్త్రీ లెవ్వరి యెడ దుఃఖింతురో, వారికి వంశముండదు. కాంతా శప్తములగు గేహములు శక్తిచే నశింపజేయబడినవి పోలె వెలయక లక్ష్మీ శూన్యములై వృద్ధి నొంద జాలవు." అని చెప్పబడిన మాటలు ఈ పురంధ్రి జీవితము నందు మనకు ప్రమాణములైనవి. "పురంధ్రి యత ఇతి పురంధ్రి" పురమును ధరించునది. అనగ దేశమునకు, లేక పురమునకు ఖ్యాతి సంపాదించునది.

"యావత్ స్థాస్యంతి గిరయ స్సరితశ్చ మహీతలే
తావత్ సీతా చరితమ్ వై లోకేషు ప్రచరిష్యతి"

త్రిలోకము లందలి గిరులు, నదులున్నంత కాలము సీతా చరితము మార్మ్రోగుచునే యుండును. ఆమె నామమునే ఈ లోకము నిత్యము స్మరియించు చుండును. పుణ్య భారతము యొక్క పావిత్ర్యమును దిశల వెదజల్లు చుండును. ఆదర్శ సతి సీత జీవితగాథయే ఒక "గీత". ఆమె ఆచరణ ద్వారమున భారత నారీమణులకుపదేశించిన దివ్య సందేశము నౌదల దాల్చిన ప్రతి నాతి సీత వంటి పురంధ్రియై భారత జనని సౌభాగ్య సంపదను సుప్రతిష్ఠము చేయుగాత! ●

Acc. No
24201
894.8131072
RAG.
ర - 25-10.

# ఉపయుక్త గ్రంథ సూచి

## సంస్కృతము

1. వాల్మీకి : శ్రీరామాయణాభిధేయం గ్రంథ, : వ్యాఖ్యాన చతుష్టయ విశిష్ట సరస్వతీ తిరు వేంకటాచార్యేణ, సరస్వతి ముద్రాక్షరశాల, 1883.

2. ” : శ్రీమద్రామాయణమ్, సంపు—1, 2: వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, వావిళ్ళ ముద్రాలయము, చెన్నపురి, 1931.

3. ” : శ్రీ వాల్మీకి మహర్షిణా ప్రణీతో2యం, శ్రీ రామాయణాఖ్య గ్రన్థః, శ్రీ రాజేశ్వరి ముద్రాలయము, చాకలిపేట, మద్రాసు-1935.

4. ” శ్రీమద్రామాయణము [బాల. అయోధ్య], తెలుగు వ్యాఖ్యానముతో, జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాద్-1979.

# తెలుగు గ్రంథములు

5. అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి : తిక్కన తీర్చిన సీతమ్మ, సారస్వతాలోకము, త్రివేణి ప్రెస్, మచిలీపట్టణము, ప్రథమ ముద్రణ - 1954, ద్వితీయ ముద్రణ—1955.

6. అప్పలస్వామి, పురిపండా : సారస్వత వ్యాసములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాద్, ఏప్రిల్, 1969.

7. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యము, 8 వ సంపుటి, ప్రథమ ముద్రణ, నవంబరు, 1965.

8. గంగప్ప, ఎస్. : జానపద గేయ రామాయణము, ప్రథమ ముద్రణ, వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు, 1983.

9. గణపతిశాస్త్రి, చర్ల : అర్థధర్మములు, లలితా ప్రెస్, హైదరాబాద్.

10. గోపాలకృష్ణశర్మ, మల్లాది : శ్రీమద్రామాయణ వైభవము, ఎ. ఎస్. ఆర్. పవర్ ప్రెస్, తెనాలి, 1971.

11. చంద్రమౌళి కల్లూరి : రామాయణ సుధాలహరి, భారత్ ప్రెస్, తెనాలి, 1955.

12. ” ” : రామకథా నిధి, జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు-1976.

13. ” ” : సీతా మహాసాధ్వి,

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్,
గుంటూరు.

14. తిక్కన : నిర్వచనోత్తర రామాయణము,
ఆనంద ముద్రాక్షరశాలి,
చెన్నపురి, 1879.

15. దుర్గాప్రసాదరావు, పర్సా : మైథిలి [వచన రామాయణము],
కళాకుటీర ప్రచురణ,
జయంతి పబ్లికేషన్సు, 1967.

16. దొరస్వామిశర్మ, రావూరి : తెలుగు సాహిత్యము- రామకథ,
త్రివేణి ప్రెస్,
ప్రథమ ముద్రణ, 1972.

17. నన్నయ : ఆంధ్ర మహాభారతము, ఆదిపర్వము,
పరిష్కర్త : విశ్వనాథ సత్యనారాయణ,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, హైదరాబాద్, 1970.

18. నరసింహావధానులు, పులుకుంట్ల : శ్రీరామాయణ సారోద్ధారము,
అనంత పబ్లికేషన్స్, విజయవాడ.

19. ,, ,, : సీతారామ కళ్యాణ వైభవము,
దేవీ పబ్లికేషన్స్, విజయవాడ.

20. ప్రతాపరెడ్డి, సురవరం : రామాయణ విశేషములు,
ఆంధ్ర రచయితల సంఘం,
హైదరాబాద్, రెండవ ముద్రణ,
మార్చి, 1957.

21. పోతన, బమ్మెర : శ్రీమదాంధ్ర భాగవతము,
దశమ స్కంధము,
రాయలు అండ్ కో, కడప.

22. బుద్ధారెడ్డి, గోన : రంగనాథ రామాయణము,
రాయలు అండ్ కో, పబ్లిషర్స్ అండ్

బుక్ సెల్లర్స్, కడప, 1949.

23. భాస్కరుడు : భాస్కర రామాయణము,
పరిష్కర్త: మోదేపల్లి వెంకట రమణాచార్యులు,
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1961.

24. మొల్ల ఆతుకూరి : రామాయణము, ముకుంద వికాసము,
ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ,
సాహిత్య అకాడమీ, కళాభవన్,
హైదరాబాదు-4, 1967.

25. ” ” : రామాయణము,
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, వావిళ్ళ ప్రెస్,
మద్రాసు, 1968.

26. ” ” : రామాయణము,
యం. శేషాచలం అండ్ కో,
మచిలీపట్టణం, ప్రథమ ముద్రణ,
ఎమెస్కో పాకెట్ బుక్, 1975.

27. రామలింగారెడ్డి, కట్టమంచి : పంచమి,
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, 1954.

28. రామదాసస్వామి, సమర్థ : ఆనంద రామాయణం,
సంస్కృత మూలము,
ఆంధ్రీకర్త : చిలుకూరి శ్రీరామశాస్త్రి,
భారతీ ప్రెస్, తెనాలి.

29. లక్ష్మీకాంతం పింగళి : సాహిత్య శిల్ప సమీక్ష, 1981.

30. విద్యా ప్రకాశానంద స్వామి : గీతా మకరందం, శుకబ్రహ్మాశ్రయం,
కాళహస్తి, 1980.

31. శ్రీనివాసశాస్త్రి, షి. ఎస్. : రామాయణ ఉపన్యాసములు,
ప్రథమ, ద్వితీయ సంపుటములు,

అనువాదం: వెలంపాటి లక్ష్మీనరసయ్య, ఫ్రీడం ప్రెస్, మద్రాసు.

32. శేషయ్య, చాగంటి : ఆంధ్ర కవిత తరంగిణి, 9వ సంపుటి, ఆంధ్ర ప్రచారిణీ, లిమిటెడ్, కాకినాడ.

33. శేషేంద్ర శర్మ, గుంటూరు : షోడశి (రామాయణ రాహస్యములు), తిరుమల తిరుపతి దేవస్థానములు ప్రచురణ, 1980.

34. సత్యనారాయణచౌదరి, కొత్త : రామాయణ రహస్యములు, భాషా పోషక గ్రంథమండలి, ప్రథమ ముద్రణ, 1968.

35. సుబ్బారావు, వావిలకొలను : శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, (మంధరము) శ్రీ కోదండ రామస్వామి సేవక ధర్మసమాజము, అంగలకుదురు, తెనాలి.

## బి - వ్యాసములు

అప్పలస్వామి, పురిపండా : సారస్వత వ్యాసములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాద్, ఏప్రిల్, 1969.

చంద్రమౌళి, కల్లూరి : రామాయణము—సుందరకాండము, శాంతి, సాహిత్య సంకలనము, వెల్కం ప్రెస్-గుంటూరు, 1961.

ప్రకాశరావు, శివలెంక : మొల్ల రామాయణము, సీత, తెలుగు విద్యార్థి, ఫిబ్రవరి, 1977.

మేధా దక్షిణామూర్తి, నాదెళ్ళ : వైదేహి, శాంతి (సాహిత్య సంకలనము 1961.

రాజ్యలక్ష్మి. పోలా ప్రగడ : మొల్ల రామాయణంలో సీత, ఆంధ్రప్రభ, మంగళవారం, ఏప్రిల్, 10, 1984.

రాధామనోహరన్ : సీతారామ కళ్యాణం, (వాక్చిత్రం), ఆంధ్రజ్యోతి వారపత్రిక, 29-4-1984.

లక్ష్మీకాంతమ్మ. ఉటుకూరి : ఆదర్శ రామరాజ్యము, శాంతి, సాహిత్య సంకలనము, వెల్కం ప్రెస్ గుంటూరు, 1961.

" " : ఆంధ్ర కవయిత్రులు, ప్రబంధ రచనా ప్రాబల్యం, శారదా మంజీరము, శివాజీ ప్రెస్, సికింద్రాబాద్, మార్చి 1971.

లక్ష్మీకాంతమ్మ, ఉటుకూరి : సీతమ్మ (మొల్ల) మేనువెంచె, వనితాజ్యోతి మే, 1985.

లక్ష్మీరంజన. ఖండవల్లి : రామాయణము-మహాకావ్యము, శాంతి (సాహిత్య సంకలనము), ప్రథమ ముద్రణ, వెల్కం ప్రెస్, గుంటూరు, 1961.

వరలక్ష్మమ్మ. కనుపర్తి : సీత సతీత్వము, ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక, 1928-29.

వసుంధర. మల్లాది : మొల్ల రామాయణము, స్రవంతి జనవరి, 1982.

వెంకటకృష్ణారెడ్డి, దేవరపల్లి : మొల్ల రామాయణము, కాల విమర్శనము భారతి, అక్టోబరు, 1963.

వెంకట కృష్ణారావు, కోటగిరి : వేదవతి, భారతి డిశంబరు, 1959.

శ్రీనివాసానంద సరస్వతీ స్వామి : స్త్రీలకు సౌభాగ్య సందేశము,

శాంతి సాహిత్య సంకలనము,
ప్రెస్, గుంటూరు, 1961.

## సి-నిఘంటువులు

ప్రసాద భూపాలుడు. దేవిడి : ఆంధ్ర విజ్ఞానము Telugu Encyclo-peadio) ఎస్. ఆర్. పి. వర్క్స్, కోకనద, 1938.

వెంకట రంగయ్య, మామిడిపూడి : సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము మొల్ల సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశ సమితి, హైదరాబాద్ 1970.

శివనారయ్య. నల్ల పాటి

వెంకట కృష్ణమాచార్య, కారంచేడు : సంకలన కర్తలు : తెలుగు సాహిత్య పదకోశము-ప్రాచీన సాహిత్యము పరిష్కర్త : బి. విజయభారతి, ఆతుకూరి మొల్ల . తెలుగు అకాడమి, హైదరాబాద్—1980

సూర్య రాయాంధ్ర నిఘంటువు : ఐదవ సంపుటము. (వ-భ్రే). ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. హైదరాబాద్, 1982.

## English Books

Gopala krishna Rao, T. : Folk Ramayana's in Telugu and Kannada, Freedom Press' Madras.

Satyanarayana, Viswanatha : What is Ramayana to m, vallie publications, Maruthinagar, Vijayawada, I Edition, 1976.

Sita Rama Murthy, C. English version of Appala Charyu-lu's discoveries in Telugu, Lecturers on Valmiki Ramayana

(Balakanda). Sarvodaya Printers and Publishers, Visakhapatnam.

" " Women in Valmiki Ramayana, Sarvodaya Printers & Publishers, Visakhapatnam - 530 010.

Swami Madhavananda Sarma, Member : Great women of India, Advitasrama, Mayavathi, 1953.

Dictionaries & Encyclopaedias

Encyclopaedia, Britanica : Text Index.

Monior : Williams A Dictionary of English and Sanskrit, Motilal Banarasi Das, 1971

Cassell : Steevenson's Book of Quotations

